ఓమ్

# మన వేదశాస్త్రాల పరిచయం






గ్రంథ కర్త :
సుమ్నాద్రి
(డా॥ కోడూరి సుబ్బారావు)



శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య

# మహర్షి దయానంద సరస్వతి

(1824-1883)




# మన వేదశాస్త్రాల పరిచయం




వేద కర్త :

'ఓ౩మ్' నామక సర్వవ్యాపక సర్వేశ్వరుడు

పరిచయకర్త :

సుమ్నార్థి

(డా॥ కోడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమట్రస్టు ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల : 43

**మన వేదశాస్త్రాల పరిచయం**

ప్రథమ ముద్రణ ప్రతులు : 1000

ద్వితీయ ముద్రణ ప్రతులు : 1000



సృష్టిసంవత్సరము : ః 197, 29, 49, 119
విక్రమాబ్దము : 2075
దయానందాబ్దము : 194

శ్రీ విళంబినామ సం॥ మహర్షి దయానందుని జన్మదినం (10-2-2019)

**మూల్యము : రూ. 70/-** (తపాల ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు,
కార్యదర్శి : కె.పి. నర్సింగరావు,
12-10-586/6, ఆర్యసమాజము, వారాసిగూడ,
సికింద్రాబాద్ - 500 061. (ఇందిరానగర్ రోడ్డు - 2)
సెల్ : 98480 11073, 6301044860

2. డా॥ కోదూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం (B.O.) ; (Via.) భువనగిరి గంజ్ - 508 117.
సెల్ : 9290604641, 9908994084.

3. ఆర్యసమాజ మందిరము, రైల్వే ఫ్లైఓవర్ దగ్గర,
సీతాఫలమండి - 500 061. సెల్ : 9133134156

4. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
ఫోన్ : 08644-252789.

5. శ్రీ బాశెట్టి సత్తయ్య, జె-38, రాంగోపాల్‌పేట్, సికింద్రాబాద్ - 3.

*Printed at :*

**PRINTSHOP** - 040-6632 0300.



# వేదమాతకు వందనములు

వేదమాతా దేవతా

అతి జగతీ ఛన్దః

స్తుతా మయా వరదా వేదమాతా
ప్రచోదయన్తాం పావమానీ ద్విజానామ్
ఆయుః ప్రాణం ప్రజాం పశుం కీర్తిం ద్రవిణం బ్రహ్మవర్చసం ।
మహ్యం దత్వా వ్రజత బ్రహ్మలోకమ్ ॥

(అథర్వవేదం. 19-71-1)

నాచే కీర్తింపబడిన వరదాయనియైన వేదమాత ద్విజులను (విద్యాసదాచార సంపన్నులను) పవిత్రపరచి సత్కర్మలయందు ప్రేరేపించును గాక !

ఆ తల్లి నాకు దీర్ఘాయువును, బలమైన ప్రాణశక్తిని, సుపుత్రులను (సన్మిత్రులను), పశుసంపదలను, సువిశాలకీర్తిని, పుష్కల ధనరాశిని, స్థిర సమాధిచే గలుగు బ్రహ్మవర్చస్సును ప్రసాదించి ; నన్ను బ్రహ్మలోకమునకు – మోక్షధామమునకు చేర్చును గాక !

స్తుతించు,
ఒక సుమ్మార్థి,
**కోడూరి సుబ్బారావు**

# ముందు మాటలు

భారతీయార్యులమైన మనలో అనేక సాంప్రదాయాలున్నా అనాదిగా మనమంతా వేదాలను ఈశ్వరీయ జ్ఞానంగా నమ్ముతాం. కావుననే ప్రతీ సాంప్రదాయంవారూ తమ భావాలకు వేదమే మూలమంటారు. ఏవో కొన్ని మంత్రాలు, శ్లోకాలు, వాక్యాలూ చూపి అవే మా సాంప్రదాయానికి శ్రోతస్సులంటారు. కాని, అసలు ఈశ్వరీయజ్ఞానమైన వేదం ఏమి చెబుతున్నదో స్పష్టంగా ఎవరికీ తెలియటంలేదు. వారు చెప్పే మౌళిక సిద్ధాంతాలలో ఏకరూపత లేదు. ఒకే మతానికి చెందినవారిలో ఈ సిద్ధాంత భిన్నత ఎందుకు? ఈ పరిస్థితిలో మన వేదశాస్త్రాల మౌళిక స్వరూపాన్ని యథాతథంగా సామాన్యుల కందజేయాలనే సత్సంకల్పంతో ఒక పరిచయ గ్రంథం వ్రాయాలనుకున్నాను. దాని కార్యరూపమే ఈ గ్రంథం.

నేడు ప్రపంచం ప్రకృతివైపు శరవేగంతో పరుగెడుతోంది. విజ్ఞాన వికాసంతో ఎన్నెన్నో సుఖసాధనాలు సమకూరాయి. జీవితం విందులతో, వినోదాలతో, విలాసాలతో హాయిగా గడిచిపోతోంది. దీనికి 'ప్రగతి' అని అందమైన పేరు పెట్టుకున్నాం. ఈ ప్రగతి మనను పరమాత్మవైపుకు తీసుకువెడితే హర్షించవలసినదే. కాని, అది మనను పరమాత్మకు దూరం చేస్తున్నది. మానవుని పరమపురుషార్థం ప్రకృతి బంధనాన్నుండి విముక్తికాగా ఈ ప్రగతి మనను మరింతగా ప్రకృతితో బంధిస్తున్నది. బాగా ఆలోచించిచూస్తే ఈ అభ్యుదయం వెనుక అవనతి దాగివుంది. ఇది మన వేదశాస్త్రాలు సూచించే అభ్యుదయం కాదు. వైదికాభ్యుదయం మనను నిశ్శ్రేయసం వైపు నడిపిస్తుంది. పరమానందాన్ని, పరమశాంతిని ప్రాప్తింపచేస్తుంది.

నేటి యాంత్రిక జీవనశైలిలో ఆధ్యాత్మిక విషయాల నాలోచించే తీరిక ఎవ్వరికీ లేదు. స్వాధ్యాయంచేసే తీరిక కూడా స్వల్పమే. ఆ స్వల్పకాలంకూడా పత్రికలు చదవటానికే సరిపోతున్నది. ఈ స్థితిలో మనవేదశాస్త్రాలను పరిశీలించే సమయం ఎక్కడ ? పరిచయ గ్రంథాలైనా చిన్నగా సారాంశరూపంలో ఉంటేనే చదువుతున్నారు. లేకుంటే అలమరలలో అలంకరణప్రాయంగానే ఉండిపోతున్నాయి. అందుచే ఈ పరిచయగ్రంథం వీలైనంత సంక్షిప్తంచేయ యత్నించాను. శక్తికొలది శ్రమించాను.

ఈ గ్రంథరచనకు ఎందరెందరో వేదవిద్వాంసుల రచన లుపకరించాయి. వారందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతాసుమాంజలులు. నా గజిబిజి వ్రాతను అర్థం చేసుకొని కంప్యూటర్ కంపోజింగ్ చేసిన చి॥ చకిలం వినోద్ కుమార్ గారికి, ప్రింట్‌షాప్ యజమానులకు, కార్యకర్తలకు నా శుభాకాంక్షలు. అభిమానంతో గ్రంథముద్రణకు తోడ్పడుతున్న దాతలకు, ఆదరించి చదువుచున్న పాఠకులకు ధన్యవాదములు.

విజ్ఞులు, విద్వాంసులు ఈ రచనలోని లోపములేమైనయున్న సహృదయతతో తెలుపగోరుచున్నాను. పునరాలోచించి మలిముద్రణలో సవరించుకోగలవాడను.

విన్నవించు
ఒక సుమ్నార్థి
**కోదూరి సుబ్బారావు**

## ఈ పరిచయ గ్రంథంలో :



**చదువండి - చదివించండి**

**మీ వైదిక ధర్మంపై స్వాభిమానం కలిగిఉండండి.**

# వివేకం వికసించిన రజనీ, రమేశ్ దంపతులు
## (ముద్రణ వ్యయ దాతల సంక్షిప్త పరిచయం)

సీతాఫలమండి (సికింద్రాబాద్ - 61) ఆర్యసమాజ సభ్యులైన శ్రీ కంటె రమేశ్, శ్రీమతి రజనీ దంపతులతో నాకు సుమారు 25 సంవత్సరాల పరిచయం. వీరిద్దరూ వివేకవంతులే కావటం వీరి పూర్వజన్మల సుకృతఫలం. వివేకవంతులు కావటంవల్లనే ఆర్యసమాజం వైపు ఆకర్షింపబడ్డారు. తరచుగా వైదిక సత్సంగాలలో పాల్గొనటంవల్ల వివేకం వికసించి వైదిక సిద్ధాంతాలపై శ్రద్ధాభక్తు లేర్పడ్డాయి. ఇంతేగాక, వారి పరిధిలోగల బంధుమిత్రులకు, వినియోగదారులకు వైదిక సిద్ధాంతాలను తెలుపుతూ వైదిక సాహిత్యాన్ని వితరణచేస్తూ ధర్మప్రచారం చేస్తున్నారు.

శ్రీమతి రజనీగారు హైస్కూలు టీచరు కావటంవల్ల విద్యార్థులలో వైదిక సిద్ధాంతాలను నాటటానికి విశేష కృషిచేస్తున్నారు. అందుకు తగినట్లు వ్యాసరచన, వక్తృత్వ పోటీలు నిర్వహిస్తూ బహుమతులుగా వైదిక సాహిత్యాన్నే వితరణ చేస్తున్నారు. ఇంతేగాక, పండుగల సందర్భాలలో విద్యార్థులను విహార యాత్రలకు (ఎక్స్‌కర్షన్‌లకు) తీసుకువెడుతున్నారు. విజ్ఞాన వినోదాలతోబాటు వివేకాన్ని కలిగించేటట్టుగా గోశాలలకు, వ్యవసాయక్షేత్రాలకు, వైదిక సత్సంగాలకు తీసుకువెడుతున్నారు. ముఖ్యంగా "నేటి వేదమంత్రం" పేరుతో వాట్సప్‌లో నేను పంపే మంత్రాలను, అర్థాలను టైపుచేసి పంపుతున్నారు. వీరితోబాటు శ్రీమతి రావికంటి రోజాగారు కూడా టైపు చేసి పంపటంవల్ల సుమారు ఒక సంవత్సరంగా విరామం లేకుండా ప్రతి రోజూ ఒక వేదమంత్రాన్ని పంపగలుగుతున్నాను - వీరిద్దరికి నా హృదయపూర్వక ధన్యవాదములు. శుభాకాంక్షలు. శుభాశీస్సులు.

ఈ దంపతుల శ్రద్ధా భక్తులను చూసి - మీ దివంగత తండ్రిగారి స్మృతిలో ఒక పుస్తకం అచ్చువేయిస్తే బాగుంటుందని సూచించాను. అందుకు రమేశ్ గారు వెంటనే పెద్దగా ఆలోచించకుండానే అట్లే చేద్దామన్నారు, మీ కుటుంబ పరిచయం, ఫోటోలు పంపమంటే - "అవేమీ ప్రచురించవద్దు, ఫోటోలు కూడా వద్దు, మీరు చేస్తున్న మంచి కార్యానికి ఇది మా గుప్తదానంగా భావించండి" అన్నారు.

ఇట్టి దానాన్నే సాత్వికవదానం అంటాయి శాస్త్రాలు, వీరికి, వీరి కుటంబానికి సర్వవ్యాపక సర్వేశ్వరుడు దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యాలనిచ్చి సదా కాపాడుచుందునుగాక.

మాటల సందర్భంలో నేను గ్రహించిన కుటుంబ విషయాలేమంటే శ్రీ రమేశ్ తండ్రిగారి పేరు కీ.శే. కంటె ఎల్లయ్య, తల్లిపేరు కళావతి. శ్రీ రమేశ్ గారు 2-3-1973న వారి స్వగ్రామం బోధన్ (నిజామాబాద్ జిల్లా)లో జన్మించారు. వీరికి చిన్నతనం నుండీ ఆధ్యాత్మిక జిజ్ఞాస ఉండేదట. వీరు నాయనమ్మ గారితో కలిసి చాలా దేవాలయాలు దర్శిస్తూ "అసలు దేవుడంటే ఎవరని ప్రశ్నిస్తూవుండేవారట, సికింద్రాబాద్‌లో గ్రాడ్యుయేషన్ చదువుకునేటప్పుడు తరచుగా ఇస్కాన్ దేవాలయానికి, సత్సంగాలకు వెడుతూవుంటే కూడా దేవుని గూర్చిన ఆయన సందేహాలకు సమాధానాలు లభించలేదు, వివాహం అయిన తరువాత వీరు సీతాఫలమండి ఆర్యసమాజ వేద పండితులైన శ్రీ పం. జ్ఞానేంద్రగారి గృహంలో అద్దెకు (రెంటుకు) ఉండటం జరిగింది. పండితులతో తరచుగా ఆధ్యాత్మిక చర్చలు చేస్తూ ఉండటం వల్ల వారి సందేహాలన్నిటికి హేతుబద్ధమైన సమాధానాలు లభించాయి. శ్రీమతి రజని గారికి కూడా చాలా తృప్తి కలిగి వీరిద్దరు సీతాఫమండి ఆర్యసమాజ సభ్యులయ్యారు. సత్సంగాలకు వస్తూ వారి జ్ఞానాన్ని పెంచుకుంటున్నారు.

శ్రీమతి రజనీగారు 1978లో సికింద్రాబాద్‌లోనే జన్మించారు. వీరి తల్లి శ్రీమతి అంజమ్మ, తండ్రి శ్రీ రాజయ్య. రజనీ రమేశ్ దంపతులకు ఇద్దరు సంతానం, అబ్బాయి పేరు స్నేహిత్ (విజ్ఞాన కాంక్షి - స్నేహశీలి) అమ్మాయి పేరు కీర్తిశ్రీ (బాల నర్తకి). ఈ దంపతులు వారాసిగూడ బౌద్ధనగర్‌లో ఒక ప్లాట్ కొనుక్కొని వరుణ్ ఇంజనీయర్స్ పేరుతో ఒక వ్యాపార సంస్థను నడుపుకుంటున్నారు.

సుమ్నార్థి
(గ్రంథకర్త)



# మన వేదశాస్త్రాల పరిచయం

ప్రియ పాఠకులారా !

మనమంతా భారతీయులం. భారతదేశవాసులం. మతపరంగా మనం హిందువులమని లోకంలో వ్యవహరింపబడుతున్నాం. కాని, మనం హిందువులం కాదు. ఎందుకనగా మతమంటే 'అభిప్రాయ' మని అర్థం. క్రైస్తవమతం అంటే ఏసుక్రీస్తు యొక్క అభిప్రాయాలను, ఉపదేశాలను అనుసరించే ఒక సాంప్రదాయం. అట్టివారిని క్రైస్తవు లంటారు. అట్లే మహ్మద్‌ప్రవక్త యొక్క అభిప్రాయాలను, ఉపదేశాలను అనుసరించేవారిని మహ్మదీయులనీ, మహాత్మా బుద్ధుని అభిప్రాయాల ననుసరించేవారిని బౌద్ధులనీ, జినముని అభిప్రాయాల ననుసరించేవారిని జైనులని అంటారు. వీరంతా ప్రవక్తలు. వారి వారి కాలాలలో మానవసమాజంలో ఏర్పడిన కురీతులను పోగొట్టడానికి వారికి తోచిన మార్గాన్ని వారు అనుసరించి ప్రబోధించారు. ఆనాడు వాటిని అనుసరించిన మానవులకు కొంత ఉపశమనం కలిగింది. దానితో వారు ఆ ప్రవక్తల కనుయాయులై ఆ యా మతస్థులుగా లోకంలో వ్యహరింపబడుతున్నారు. వాస్తవిక స్థితి యిట్లుండగా - 'హిందువు' అనే వ్యక్తి లేకుండా హిందూమతం ఎలా ప్రారంభమౌతుంది? కనుక ఈ మాట మనకు వర్తించదు. మనమంతా పరమేశ్వరీయ జ్ఞానమైన వేదాలలోని ఉపదేశాల ననుసిరించే వేదమతానికి చెందినవారం. వైదికులం. ఇక్కడ 'వైదికు'లంటే బ్రాహ్మణులలోని ఒక వర్గమని భావించరాదు. వేదానుయాయులని గ్రహించాలి.

మధ్యకాలంలో మహ్మదీయులు మనదేశాన్ని పాలించినపుడు వారి అల్లాదేవుని మనం అంగీకరించకపోవటంచే మనను హిందువులన్నారు. అట్టి హిందువు లనుసరించే మతాన్ని హిందూమత మన్నారు. అట్టివారు నివసించే దేశం కనుక హిందూదేశ మన్నారు. అరబ్బీ భాషలో 'హిందువు' అంటే 'కాఫిర్' అని అర్థం. కాఫిర్ అంటే ఇస్లాంమతంపై నమ్మకంలేని నాస్తికుడని

వారి అభిప్రాయం. ఇంతేగాక 'హిందూ' పదమునకు అరబ్బీ నిఘంటువులో - గులామ్, కాలా ఆద్మీ, బద్మాష్ మొదలైన నీచమైన అర్థాలుకూడా వ్రాసిఉన్నాయి. కనుక మనం హిందూ పదమును వదిలిపెట్టడమే మంచిది.

సింధునదిని బట్టి ఈ దేశానికి పూర్వం సింధుదేశమనే పేరుండేదనీ, అది సరిగా ఉచ్చరింపబడక హిందూదేశంగా పిలవటం మొదలైయ్యిందని కొంద రంటారు. ఈ అభిప్రాయం కూడా సరియైనది కాదు. సింధునదిని యిప్పుడు కూడా సింధునది యనియే అంటున్నాముకదా! హిందునది యని అనటం లేదు కదా! మరి సింధుదేశాన్ని హిందూదేశం అనటం ఎందుకు? ఈ విధంగా ఎన్నో ప్రశ్నలు వస్తాయి. కనుక ఈ చర్చ నింతటితో ఆపి మన వేదమతాన్ని గూర్చిన కొన్ని ముఖ్యవిషయాలు తెలుసుకుందాము.

వేదం ముందుగా ఆస్తిక్యాన్ని ప్రబోధిస్తుంది. యోజనాబద్ధంగా నిర్మింపబడిన ఈ సృష్టికి కర్త ఒక డున్నాడంటుంది. కర్త లేకుండా జడ పదార్థాలు వాటంతట అవిగా కలిసి ఒక ప్రయోజనకరమైన పదార్థంగా ఏర్పడలేవని చెబుతుంది. ఇప్పుడుకూడా మనకీ విషయం స్పష్టంగా కనబడుతుంది - ఇటుకలు వాటంతట అవిగా కలిసి ఒక గోడగా ఏర్పడటం లేదు. తాపీమేస్త్రి దానిని నిర్మిస్తున్నాడు. కలప తనంత తానుగా తలుపులు, కిటికీలుగా తయారుకావటంలేదు. వడ్రంగి వాటిని ఆవిధంగా నిర్మిస్తున్నాడు. బంగారం స్వర్ణకారుడు లేకుండా నగలుగా తయారుకావటంలేదు. అందుచే ఎక్కడ నిర్మాణం కనబడుతుందో అక్కడ ప్రత్యక్షంగానో లేక పరోక్షంగానో కర్త ఉంటాడు. ఈ తార్కిక దృష్టితో చూస్తే యోజనాబద్దంగా నిర్మింపబడిన ఈ సృష్టికి కర్త తప్పక ఒక డున్నాడు. అతనినే మన వేదం 'దేవుడు' అంటుంది.

వేదం వివరించే దేవుడు సర్వవ్యాపకుడు. అందుచేతనే విశ్వంలో అంతటా సృష్టి స్థితి లయ కార్యాలు జరుగుతున్నాయి. దేవుడు ఎక్కడో ఒక చోటనే ఉంటే ఈ క్రియలు జరుగవు. కర్త ఒకచోట క్రియ మరొక చోట జరగటం అసంభవం. నాలుగవ ఆకాశంలోనో, ఏడవ ఆకాశంలోనో, వైకుంఠంలోనో , కైలాసంలోనో మాత్రమే దేవుడుంటే ఈ విశాల విశ్వంలో ప్రతి అణువులో జరిగే క్రియలు జరుగవు. నేటి వైజ్ఞానికులు సృష్టిలోని ప్రతి అణువులోను ప్రోటాన్, న్యూట్రాన్ల చుట్టూ ఎలక్ట్రాన్‌లు నియంత్రిత గతితో

పరిభ్రమిస్తున్నా యంటున్నారు. అందువల్లనే ఆయా మూలకాలు (ఎలిమెంట్స్) స్థిరంగా ఉండగలుగుతున్నా యంటున్నారు. ఇదే విషయం సృష్ట్యాదిలో ఆవిర్భవింపబడిన వేదం - " **ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్**" (యజుర్వేదం 40-1) - గతిశీలమైన ఈ జగత్‌లో అణువు మొదలు బ్రహ్మాండం వరకు ఈశునిచే - నియామకునిచే వ్యాపించబడి ఉందని చెబుతుంది. ఇట్టి భావంగల మంత్రాలు వేదాలలో కోకొల్లలుగా ఉన్నాయి. ఆ పరమేశ్వరుడు ఒకే ఒక్కడని కూడా పెక్కుచోట్ల చెప్పబడింది.

**'భూతస్య జాతః పతిరేక ఆసీత్' (యజు. 13-4)**

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనే పంచ భూతాలను, సమస్త ప్రాణిజాతులను సృజించి పాలించే పతి-దేవుడు ఒక్కడే ఉన్నాడు.

**న ద్వితీయో న తృతీయశ్చతుర్థో నాప్యుచ్యతే ।**

**న పంచమో న షష్ఠః సప్తమో నాప్యుచ్యతే ।**

**నాష్టమో న నవమో దశమో నాప్యుచ్యతే ।**

**య ఏతం దేవమేకవృతం వేద ॥**

**(అథర్వ. 13-4-16, 17, 18)**

సృష్టికర్త ఒకే ఒక్కడు. ఇద్దరుగాని, ముగ్గురు గాని ......... పదిమంది గాని లేనేలేరు. అతడు ఒకే ఒక్కడు. అట్టి ఏకేశ్వరుడైన పరమేశ్వరుని స్వరూపాన్ని, గుణ కర్మ స్వభావాలనుకూడా వేదం అతి స్పష్టంగా తెలుపుతుంది.

**స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగ్ం**

**శుద్ధ మపాప విద్ధమ్, కవిర్ మనీషీ పరిభూః**

**స్వయంభూర్ యాథా తథ్యతోఽర్థాన్**

**వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ॥ (యజు. 40-8)**

ఆ పరమేశ్వరుడు (పరి ఆగాత్) అంతటా వ్యాపించి యున్నాడు. (శుక్రమ్) సర్వశక్తిమంతుడు - ఇతరుల సహాయము లేకుండానే సృష్టి స్థితి ప్రళయాలు చేయగల శక్తిమంతుడు. (అకాయం) స్థూల సూక్ష్మ కారణ శరీరరహితుడు. (అవ్రణం) ఛిద్రరహితుడు. (అస్నావిరం) స్నాయుబంధనములు లేనివాడు.

(శుద్ధం) పవిత్రుడు. (అపాపవిద్ధం) జీవులవలె పాపములు చేసి వాటిచే కట్టబడనివాడు. (కవిః) వేదకవి – సర్వజ్ఞుడు. (మనీషీ) జీవుల మనోవృత్తుల నెరుగువాడు. (పరిభూః) దుష్టులను పరిభవించువాడు. లోకలోకాంతరాల నన్నిటిని అతిక్రమించి యుండువాడు. (స్వయంభూః) స్వయం సత్తా గలవాడు. తన ఉనికికి మరొక కారణం లేనివాడు. (యాథాతథ్యతో ఽర్థాన్ వ్యదధాత్) ఈ సృష్టిలో ఏ పదార్థము నెట్లు సృజింపవలెనో అట్లు సృజించుచున్న సృష్టికర్త. ఈ సృష్టి ఎవరికొరకనగా–(శాశ్వతీభ్యః సమాభ్యః) శాశ్వతులైన జీవుల కొరకు.

జీవుడుకూడా పరమేశ్వరునివలె ఉత్పత్తి వినాశములులేని శాశ్వత తత్వమే. అయితే, జీవుడు అల్పజ్ఞుడు, అల్పశక్తిమంతుడు, అల్ప పరిమాణం కలవాడు. అవిద్యతోకూడి ఉండటంవల్ల దేహాత్మభ్రాంతికి గురియై కర్మలు చేస్తూ ఉంటాడు. ఆ కర్మఫలాల ననుభవించటానికి వివిధ జన్మలను (శరీరాలను) పొందుతూ ఉంటాడు. ఈ విషయం ముందు ప్రకరణాలలో వివరంగా తెలిసికొందాము.

సర్వవ్యాపకుడు, సర్వశక్తిమంతుడు, ఏకేశ్వరుడు, సృష్టికర్తయునైన పరమేశ్వరుడు ఈ సృష్టిని ఏ విధంగా నిర్మించాడో వేదం విశదంగా వివరిస్తుంది.

ఈ సృష్టికి పూర్వం ఏమీ తెలియరాని ప్రళయ స్థితి–గాఢాంధకారం ఉండేదని నాసదీయ సూక్తం (ఋగ్వేదంలోని–10–129–3) చెబుతుంది. అప్పుడు సృష్టికి ఉపాదాన కారణమైన సత్వరజస్తమస్సు లను పరమాణువులన్నీ విడివిడిగా సామ్యావస్థలో ఉంటాయి. ఆ ప్రళయ స్థితిలో జీవులమైన మనమంతా మూర్ఛితావస్థలో (ఏమీ తెలియని స్థితిలో) ఉంటాము. అట్టి మనపై కరుణించి పరమేశ్వరుడు ఈ సృష్టిని చేయ సంకల్పిస్తాడు. ఈ సంకల్పాన్నే 'ఈక్షణ' మని మన శాస్త్రాలు వర్ణిస్తాయి. ఈ యీక్షణను వేదం 'కామః' అంటుంది. ఆ కామనతో మూల ప్రకృతిలో క్షోభ కలుగుతుంది. పరమాణువులు వివిధ నిష్పత్తులలో కలిసి మూలకాలుగా (ఎలిమెంట్స్‌గా) ఏర్పడతాయి. ఆ మూలకాలతోనే ఈ సృష్టి నిర్మింప బడింది.

పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు కనుక తన అనంత జ్ఞాన బల క్రియలతో తానొక్కడే (మరెవ్వరి సహాయ సహకారాలు లేకుండా) ఈ విశ్వంలోని జడచేతన జగత్తునంతటిని నిర్మించి పాలిస్తున్నాడు.

ఆది ప్రాణిసృష్టి అమైథునంగానే జరిగింది. ప్రారంభంలో భూమి అనేక రసాయనిక మార్పులకు గురియై పొరలు పొరలుగా ఏర్పడుతుంది. బరువైన ఇనుము, నికిల్ మొదలైన లోహాలు కేంద్రం దగ్గరకు చేరుకొని కోర్‌గా ఏర్పడతాయి. తేలిక లోహాలు ఆపైన చేరతాయి. చివరగా భూమిపైన ప్రాణిజాతులు నివసించటానికి అనువైన ఒక పొర (క్రస్ట్) ఏర్పడుతుంది. అనేక సంవత్సరాలు వర్షాలు కురిసి సముద్రాలు ఏర్పడతాయి. భూమి చల్లబడుతుంది. ముందుగా జలచరాలు, అంతకన్న ముందుగా అవి తిని బ్రతకడానికి అనువైన నాచువంటి వృక్షజాతులు సృజింపబడతాయి. అనంతరం భూచర ఖేచరాలు సృజింపబడతాయి. చివరి ప్రాణిజాతిగా మానవులు సృజింపబడతారు.

ఆది మానవసృష్టి త్రివిష్టప పీఠభూమిపై (నేటి టిబెట్ ప్రాంతంలో) జరిగిందని మన శాస్త్రాలు చెబుతున్నాయి. ఆదిమానవులు భూగర్భంలోనే అండములలో యువావస్థవరకు ఎదిగి బయటకు వచ్చారు. ఒకే ఒక జంటగా కాక అనేకమంది స్త్రీలు, పురుషులు ఒకేసారి ఉద్భవించటం జరిగింది. ఆ ఆదిమానవులు 3 రకాలుగా ఉంటారని వేదం చెబుతుంది.

**'తేన దేవా అయజన్త సాధ్యా ఋషయ శ్చ యే'**

**(యజు. 31-9)**

వారెవరనగా - దేవతలు, సాధ్యులు, ఋషులు. దేవతలంటే విద్యావినయ సంపన్నులు, పరోపకార పరాయణులు. సాధ్యులంటే సృష్టికార్యానికి సాధకులుగా ఉండే సామాన్య మానవులు. వీరు దేవత్వాన్ని, ఋషిత్వాన్ని పొందడానికి సాధన చేస్తూ ఉంటారు. ఋషులంటే - విద్యలోను యోగసాధనలోను అత్యున్నత స్థితిని పొందినవారు. ఇట్టి పవిత్ర హృదయులైన ఋషుల హృదయాలందే పరమేశ్వరుడు వేదజ్ఞానాన్ని ప్రకాశపరుస్తాడు.

**అగ్నేర్ ఋగ్వేదో వాయోర్యజుర్వేదః సూర్యాత్సామవేదః**

**అథర్వాంగిరసో ముఖమ్ ॥ (శతపథ బ్రాహ్మణం) 11-5-2-3)**

అగ్ని అను పేరుగల ఋషికి ఋగ్వేదాన్ని, వాయు ఋషికి యజుర్వేదాన్ని, సూర్యఋషికి సామవేదాన్ని, అంగిరస ఋషికి అథర్వవేదాన్ని పరమేశ్వరు డుపదేశించినట్లు శతపథబ్రాహ్మణం చెబుతుంది. అగ్ని వాయు సూర్య

అంగిరసులు నలుగురు వ్యక్తులేకాని భౌతిక పదార్థాలు కావు.

"వేదాలు పరమేశ్వర రచనలు కావు. కాలాంతరంలో ఋషులు తమ అనుభవాలను గ్రంథస్థం చేసా"రని పాశ్చాత్య చరిత్రకారులు వ్రాసారు. ఈ అభిప్రాయం సరియైనది కాదు. స్వయంగా వేదమే యివి ఈశ్వరరచన లంటుంది.

**తస్మాత్ యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే ।**

**ఛందాంసి జజ్ఞిరే తస్మాద్యజుస్తస్మాదజాయత ॥ (యజు. 31-7)**

ఆ సృష్టిరూప యజ్ఞాన్ని నిర్వహించు పరమేశ్వరుని నుండే ఋగ్వేద సామవేదములు, ఛందస్సులుగా చెప్పబడే అథర్వవేదము మరియు యజుర్వేదము ఉత్పన్నమయ్యాయి.

కనుక, వేదాలు ఈశ్వరీయ జ్ఞానమే అనుటలో ఏమీ సందేహం లేదు. ఇంతేగాక, మానవులకు కలిగే జ్ఞానం నైమిత్తికం. ప్రారంభిక జ్ఞానం యితరుల వల్లనే కలుగుతుంది.

**మాతృమాన్ పితృమాన్ ఆచార్యవాన్ పురుషో వేద**

శైశవాస్థలో మాతాపితరుల వల్ల, అనంతరం ఆచార్యులవల్ల - ఉపాధ్యాయులవల్ల మానవులకు జ్ఞానం కలుగుతుంది.

ఆదిమానవులకు తల్లి, తండ్రి, ఆచార్యుడు ఉండరుకనుక పరమేశ్వరుని వల్లనే వారికి జ్ఞానం కలుగుతుందని అంగీకరించక తప్పదు. ఆ ఈశ్వరీయ జ్ఞానమే వేదం. ఆదిమానవులు ప్రకృతిని పరిశీలిస్తూ, జంతువుల అరుపుల ననుకరిస్తూ క్రమంగా మాటలు నేర్చారని చెప్పే వికాసవాదం సరియైనదికాదు. ఈ విషయంలో చాలా పరిశోధనలు జరిగాయి. ప్రాథమిక జ్ఞానం కలగటానికి మరొకరి సాయం మానవునికి అవసరం. ఏ భాష నేర్పితే వారికి ఆ భాషనే వస్తుంది. ఏ నడవడిక నేర్పితే ఆ నడవడికనే వస్తుంది.

పరమపితయైన పరమేశ్వరుడు ఉత్తమ ప్రాణిగా మానవుని జనింపజేసి, 'బుద్ధి' అనే అంతరింద్రియాన్ని ప్రసాదించాడు. ఇది జ్ఞానాన్ని గ్రహించే సాధనం. కన్ను రూపాన్ని, చెవి శబ్దాన్ని గ్రహించినట్లే బుద్ధి జ్ఞానాన్ని గ్రహించి ఆకలింపు చేసుకొంటుంది. మానవునికి గల పంచ జ్ఞానేంద్రియాలకు - శ్రోత్ర త్వక్ చక్షు జిహ్వా ఘ్రాణేంద్రియాలకు వరుసగా శబ్ద స్పర్శ రూప రస

గంధాదులైన అయిదు విషయాలను సృజించి యిచ్చినట్లే పరమేశ్వరుడు బుద్ధి అనే అంతరింద్రియానికి విషయంగా వేదాన్ని ప్రసాదించాడు. ఇందులో మానవులకు కావలసిన సమస్త విద్యా విజ్ఞానాలు బీజరూపంలో సంక్షిప్తంగా ఉపదేశించబడ్డాయి. ఎవరికి ఏ విషయంలో అభిరుచి ఉంటే అందుకు తగిన మంత్రాలను సేకరించి మననం చేస్తే-వాటిని గురించి లోతుగా ఆలోచిస్తే ఆ విషయం బోధపడుతుంది. మంత్రం అంటేనే మననం చేయతగినదని అర్థం. **మననాత్ మంత్ర ఇతి ఉచ్యతే'** అని నిర్వచనం. కావుననే వేదాలలో ఉండే పద్యాలను మంత్రము లంటారు. అట్టి మన వేదాలు ఏ రకంగా ఉన్నాయో, ఏమి చెబుతున్నాయో సంక్షిప్తంగా తెలిసికొందాము.

## ఋగ్వేద సంహిత

సృష్టికర్తయైన పరమేశ్వరుడు తాను సృజించిన సృష్టిలోని వివిధ పదార్థాల గుణగణాలను ఋగ్వేదం ద్వారా బోధించాడు. **'ఋచ్యతే స్తూయతే యయా సా ఋక్' "అర్చ్యతే ప్రశస్యతే అనేన దేవ విశేషః ఇతి ఋక్'** అని ఋక్ పదమునకు నిర్వచనాలు చెబుతారు. అంటే - దేనిచేత ప్రపంచ పదార్థాల గుణాలు స్తుతించబడ్డాయో, కీర్తించబడ్డాయో అది ఋగ్వేదం. వివిధ దేవతలను (దివ్యగుణాలుగల పదార్థాలను) ప్రశంసిస్తుంది కనుక దీనికి ఋగ్వేద మనే పేరు వచ్చింది. ఋగ్వేదం 10,589 మంత్రాలు గల బృహత్ గ్రంథం. నాలుగు వేదాలలోని మొత్తం మంత్రాల సంఖ్య 20,416 కాగా, సగానికి పైగా (10, 580) మంత్రాలు ఈ ఋగ్వేదంలో ఉన్నాయి. ఇంతేగాక, దాదాపుగా సామవేదంలోని మంత్రాలన్నీ ఋగ్వేద మంత్రాలే. కొన్ని మంత్రాలు మాత్రమే ప్రత్యేక మంత్రాలు. అథర్వవేదంలో సుమారుగా 1200 మంత్రాలు ఋగ్వేద మంత్రాలే. యజుర్వేదంలో కూడా కొన్ని ఋక్ లున్నాయి. అందుచే నాలుగు వేదాలలో ఋగ్వేదం ప్రధానమైనది.

ఋగ్వేదంలోని మంత్రాలు ఛందోనియమం కలిగి పాదవ్యవస్థతో కూడి ఉంటాయి. దీనిలోని అధ్యాయాలకు మండలాలని పేరు. ఇవి మొత్తం 10 మండలాలు. వీటిని తిరిగి అనువాకాలుగా, సూక్తాలుగా విభజించారు. ఆ విభజన ప్రకారం ఋగ్వేదంలో 85 అనువాకాలు, 1028 సూక్తాలు ఉంటాయి.

దీనిని వర్గాలుగా, అధ్యాయాలుగా విభజించి వ్యవహరించటం కూడా ఉంది.

ప్రతీ మంత్రానికి ఋషి, దేవత, ఛందస్సు, స్వరము అని నాలుగు విషయాలుంటాయి.. ఋషిని గురించి రెండభిప్రాయాలున్నాయి. మంత్రార్థాన్ని తెలుసుకోగోరిన యోగి సమాధి స్థితిలోనికి వెళ్ళి పరమేశ్వరుని ప్రార్థిస్తే అట్టి యోగి అభీష్టం మేరకు పరమేశ్వరుడు ఆ మంత్రార్థాన్ని విశద పరుస్తాడు. దీనిని మంత్రార్థ దర్శనం అంటారు. ఆ విధంగా మంత్రద్రష్టలైన వారినే ఋషులంటారు. అట్టి ఋషులు తమ శిష్య గణమునకు, ప్రజలకు ఆ మంత్రార్థాన్ని బోధించేవారు. ఏ ఋషి ముందుగా సమాధిస్థితిలోనికి వెళ్ళి ఆ మంత్రార్థాన్ని దర్శించి ప్రచారం చేసారో అట్టి ఋషిపేరును ఆ మంత్రానికి ఋషిగా పేర్కొంటూ వచ్చారు. వేదకాలం నుండి యిప్పటివరకు ఈ పద్ధతిని అనుసరిస్తూ వస్తున్నారు. ఇది మొదటి అభిప్రాయం. రెండవ అభిప్రాయం గలవారు దీనిని అంగీకరిస్తూ మంత్రాలకు చెప్పబడిన ఋషుల పేర్లు వారి అసలు పేర్లు కావు, అవి నైమిత్తిక నామములంటారు. వాటిలో యౌగికార్థం ఉంటుంది, అది మంత్రార్థాన్ని మరింత విశద పరుస్తుందంటారు.

ఉదాహరణకు – ఋగ్వేదంలోని మొదటి సూక్తానికి ఋషి మధుఛందుడు. ఆ మంత్రాల దేవత అగ్ని. అగ్ని యొక్క గుణగణాలు ఆ మంత్రాలలో చెప్పబడ్డాయి. ఆ గుణగణాలు ఎవ్వో మధుఛందుడు సమాధి స్థితిలోనికి వెళ్ళి దర్శించి ప్రచారం చేసాడు. అగ్నిలో మాధుర్యాన్ని స్యందించే గుణం కూడా ఉందని చెప్పి ఉంటాడని వారంటారు. (అగ్నిపక్వమైన ఆహారంలో మాధుర్యం రావటం మనం చూస్తున్నాము కదా!). అందుకే ఈ ఋషిని మధుఛందుడని ప్రజలు పిలిచి ఉంటారు అనేది రెండవ అభిప్రాయం.

ముందు చెప్పుకొన్నట్లుగా మంత్ర దేవత ఆ మంత్రంలో ఉపదేశింపబడిన విషయాన్ని (సబ్జెక్ట్ ఆఫ్ ది మంత్రా) చెబుతుంది. ఛందస్సు అక్షర గణను, పాదవ్యవస్థను, గురు–లఘు క్రమ విన్యాసాన్ని తెలుపుతుంది. ఋగ్వేదంలోని మంత్రాలన్నీ స్వర ప్రధానంగా ఉంటాయి. ఈ స్వరం లయాత్మకంగా గోచరిస్తుంది. షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము – అని స్వరములు ఏడు. వీటి నుండే స రి గ మ ప ద ని అనే సంగీత స్వరా లుద్భవించాయి.

ఋగ్వేద ప్రథమ మండలంలోని మొదటి 10 సూక్తాలకు మధుఛందుడే ఋషి. ఇట్లే ప్రథమ మండలంలో మరొక 22 మంది ఋషులు ప్రముఖంగా కనబడతారు. రెండు నుండి ఏడవ మండలం వరకు వరుసగా గృత్సమద, విశ్వామిత్ర, వామదేవ, అత్రి, భరద్వాజ, వశిష్ఠ ఋషి వంశములవారి పేర్లు కనబడతాయి. ఎనిమిదవ మండలం కణ్వ – అంగీరస గోత్రీకులు దర్శించారు. తొమ్మిదవ మండలంలో 'పవమానః సోమః' దేవత గల చాలా సూక్తాలున్నాయి. అందుచే ఈ మండలానికి పవమానసోమ మండల మనే పేరు వచ్చింది. వీటిని దర్శించిన ఋషుల పేర్లు మాత్రం వేరువేరుగా కనబడతాయి. పదవ మండలం కూడా వేరువేరు ఋషులు దర్శించినదే. విశేషంగా ఋగ్వేదంలో కొందరు ఋషికల పేర్లు (స్త్రీఋషుల పేర్లు) కనబడతాయి. అంటే వేదకాలంనాడే స్త్రీలు విద్యాభ్యాసం చేసి వేదాధ్యయనం చేసేవారన్న మాట. అందులో కొందరు విశేష ప్రజ్ఞకలిగినవారు యోగాభ్యాసం చేసి సమాధి స్థితిలోనికి వెళ్లి వేదమంత్రార్థ దర్శనంచేసి ఆ అర్థాన్ని లోకంలో ప్రచారం చేసారని గ్రహించాలి.

వేదాల యథార్థ స్వరూపం తెలియని కొందరు పాశ్చాత్య సంస్కృత విద్వాంసులు మంత్రకర్తలే ఋషు లని ప్రచారం చేసారు. ఈ అభిప్రాయం సరియైనది కాదు. 'ఋషిర్దర్శనాత్' అని చెప్పినట్లు మంత్రార్థ దర్శనం చేసినందుననే వారికి ఋషులనే ఉపాధి లభించింది.

ఋగ్వేదంలో అనేక దేవీ దేవతల గుణగణాలు వర్ణింపబడ్డాయి. ఈ దేవతా పదములకు ఏకేశ్వరుడైన దేవుని పరంగాను, వివిధ ప్రాకృతిక పదార్థాల పరంగాను కూడా అర్థం చెప్పుకోవచ్చు. వీటిని ఆధ్యాత్మిక వ్యావహారి కార్థము లంటారు. ఆధ్యాత్మికార్థం ఆత్మ పరమాత్మల జ్ఞానాన్ని బోధిస్తే, వ్యావహారికార్థం భౌతిక విజ్ఞానాన్ని బోధిస్తుంది. ఈ ప్రాకృతిక దేవతలను మూడు వర్గాలుగా చేసి వ్యవహరిస్తారు. అవే – పృథివీ, అంతరిక్ష, ద్యుస్థానీయ దేవతలు. ఋగ్వేదాన్ననుసరించి –

**యే దేవాసో దివ్యేకాదశస్థ పృథివ్యా మధ్యేకాదశస్థ ।**
**అప్సు క్షితౌ మహినైకాదశస్థ తే దేవాసో**
**యజ్ఞ మిమం జుషధ్వమ్ ।** (ఋగ్వేదం. **1-139-11**)

ద్యుస్థానీయ దేవతలు - 11, పృథివీస్థానీయ దేవతలు - 11, అంతరిక్షస్థ దేవతలు - 11. మొత్తం 33గురు దేవతలు ముఖ్యులు. మరొకచోట (ఋ. 3-9-9) (10-52-6) దేవతల సంఖ్య 3339గా గణింపబడింది. (**త్రీణి శతా త్రిసహస్రాణ్యగ్నిం త్రింశ్చ దేవా నవ చాసపర్యన్**). దేవత లెన్ని యున్నా మూడే ప్రధాన దేవత లంటుంది **నిరుక్తం** :

> **త్రిస్ర ఏవ దేవతా ఇతి నైరుక్తాః అగ్నిః పృథివీ స్థానః**
>
> **వాయుర్వేంద్రో వాన్తరిక్షస్థానః, సూర్యో ద్యుస్థానః ॥**

దేవతలు మూడే. అందులో అగ్ని మొదటిది. అది పృథివీ స్థానికము. రెండవది వాయువు లేక ఇంద్రుడు (మేఘములలోని మెరుపు). ఇది అంతరిక్షస్థానికము. మూడవది సూర్యుడు. ఇది ద్యుస్థానికము.

> **తాసాం మహాభాగ్యా దేకైక స్యాఽపి బహూని నామధేయాని**
>
> **భవన్తి । (నిరుక్తం. 7-2-1, 2)**

ఈ మూడును మహాభాగ్యవంతములైనవి. అనగా ఒక్కొక్కటి అనేకానేక గొప్పగుణాలు కలిగి ఉన్నాయి. అందువల్ల ఒక్కొక్క దేవతకు అనేక నామములున్నాయి.

దేవతల విషయంలో యజ్ఞికుల కథనం మరొకరకంగా ఉంటుంది. వేదాలలో వివిధ నామాలతో పేర్కొనబడిన దేవతలన్నీ వివిధ శక్తులే కాని ఒకే దేవతకుగల వివిధ నామములని వారంగీకరించరు. దానికి యాస్కమహర్షి సమాధానం చెబుతూ స్థానాన్ని బట్టి వర్గీకరిస్తే పృథివిపైన వివిధ పదార్థాలన్నీ పృథివీ స్థానీయములే అవుతాయి కదా ! అని వారంటారు. కనుక ఇచట పృథివీస్థానీయ దేవతలలో (వివిధ పదార్థాలలో) అగ్ని ముఖ్య దేవత యనీ, అంతరిక్షంలో వాయువు లేక విద్యుత్ ముఖ్య దేవతయనీ, ద్యుస్థాన దేవతలలో సూర్యుడు ముఖ్య దేవతయనీ గ్రహించాలి.

వేదాలలో దేవతలను గూర్చిన స్తుతి ప్రార్థనలను పరిశీలించినపుడు దేవతలు మానవాకృతి గలవేమోనని అనిపిస్తుంది. కానీ, ఇది సత్యం కాదు. ప్రాకృతిక దేవతలన్నీ జ్ఞానంలేని జడపదార్థాలే. ఆ వర్ణనలన్నీ ఆలంకారికములే. ఉదాహరణకు :

1. ఋష్వా త ఇంద్ర స్థవిరస్య బాహూ' (ఋ. 6-47-8)

'ఓ ఇంద్రా ! వృద్ధుడవైన నీయొక్క శత్రునాశకబాహువుల శరణు జొచ్చుచున్నాను.'

2. 'ఆ ద్వాభ్యాం హరిర్యమింద్రయాహి' (ఋ. 2-18-4)

ఓ ఇంద్ర! నీ రెండు గుఱ్ఱములతో రమ్ము (రెండు గుఱ్ఱములు జోడించిన రథముతో రమ్ము).

ఇట్టివే మరెన్నో ప్రార్థనలు వివిధ దేవతల నామములతో వేదాలలో కనబడతాయి. ఆ విధంగా వర్ణింపబడినంత మాత్రాన అవి మానవాకృతి గల జ్ఞానంగల దేవతలని తలంచరాదు. ఏలయన కొన్ని రాళ్ళను, రప్పలను, నదులను, వృక్షాలను సంబోధిస్తూ ప్రార్థనలు కనబడతాయి. అప్పుడు అవి జ్ఞానంగల దేవతలని అంగీకరించగలమా?

కనుక, సారంశమేమంటే వేదాలలోని వివిధ ప్రాకృతిక దేవతలన్నీ ప్రాకృతిక పదార్థాలు మరియు దివ్య శక్తులు. వాటి గుణగణాలను ఋగ్వేదం స్తుతిస్తుంది. మనం ఆ స్తుతుల ద్వారా ఆ యా పదార్థాల గుణగణాలను తెలుసుకుంటూ, వాటిని మనన చింతనలు చేస్తూ పరిశోధనలు చేస్తే ఎన్నో విజ్ఞాన విషయాలు వెలుగులోనికి వస్తాయి. మన జీవితం సుఖమయం అవుతుంది.

ఇక యివే మంత్రాలకు ఆధిభౌతికంగా అర్థం చెప్పుకుంటే అట్టి గుణాలుగల రాజులకు, విద్వాంసులకు, వ్యక్తులకు అవి వర్తిస్తాయి. ప్రకరణాన్నిబట్టి యివే మంత్రాలు ఆధ్యాత్మికార్థాన్ని బోధిస్తాయి. అప్పుడు ఆ పదములతో పరమేశ్వరుడు సూచింపబడతాడు. ఈ విధంగా వేదాలు అనేకార్థ బోధకాలు. ప్రకరణానుగుణంగా (ప్రసంగాన్నిబట్టి) అర్థం చెప్పుకోవటమే ఉత్తమం.

విశాలమైన ఋగ్వేదాన్ని జ్ఞానకాండ అంటారు. అద్భుతాద్భుతమైన ఈ సృష్టిలోని వివిధ పదార్థాల గుణగణాలను ఇది వర్ణిస్తుంది. ఈ ఋగ్వేదంలోని చివరిదైన దశమ మండలం విశిష్టంగా ఉంటుంది. దీనిలో సృష్టి విజ్ఞానం, సామాజిక విజ్ఞానం, సామాజిక రీతి నీతులు మొదలైన ఎన్నెన్నో విషయాలున్నాయి. వాటిని గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాము.

## నాసదీయ సూక్తం

ఋగ్వేద దశమమండలంలోని 129వ సూక్తానికి నాసదీయ సూక్తమని పేరు. ఈ సూక్తానికి 'భావవృత్తమ్' దేవత అయినా **'నాసదాసీన్నో సదా సీత్తదానీం'** అనే వాక్యంతో ఈ సూక్తం ప్రారంభింపబడుతుంది కనుక ఈ సూక్తానికి నాసదీయ సూక్తమనే పేరు స్థిరపడింది. ఈ మంత్రాల దేవత అంటే విషయం (సబ్జెక్ట్) భావవృత్తమ్. 'భావవృత్తమ్' అనేది జ్యోతిష గ్రంథాలలో కనబడే పారిభాషికపదం. ఈ విశ్వం ఎంతో విశాలమైనది అయినా యిది వృత్తాకారంలో ఉన్నదని మన ఋషులు భావించి ఆ విధంగా వ్యవహరించారు. ఈ సూక్తం సృష్టికి పూర్వపు స్థితిని అంటే ప్రళయంలో ఉండే స్థితిని తెలుపుతుంది. ఆ స్థితి **న అసత్** ఏమీ లేదని కాని, **సత్** ఉన్నదని కాని చెప్పనలవికాని స్థితి. గాడాంధకార స్థితి.

**తమ ఆసీత్తమసా గూఢమగ్రే ౨ప్రకేతం సలిలం సర్వమా ఇదం ।**
**తుచ్ఛ్యేనాభ్వపిహితం యదాసీత్తపసస్తన్మహి నా జాయతైకమ్ ।**

సృష్టికి పూర్వం ఈ విశ్వమంతా గాఢాంధకారంతో వ్యాప్తమై ఉంటుంది. నామరూపాత్మకమైన ఈ జగత్తంతా మూల ప్రకృతిలో లీనమై అప్రకేతంగా (అవ్యక్తంగా) అప్రత్యక్షంగా ఉంటుంది. అనంత పరమేశ్వరునిలో తుచ్ఛంగా ఒక మూల పడి ఉంటుంది. అట్టి మూలప్రకృతినుండి పరమేశ్వరుడు తన దివ్య తపస్సుతో మరెవ్వరి సహాయం లేకుండా తా నొక్కడే ఈ సృష్టిని నిర్మిస్తాడు.

ఈ సృష్టికి పరమేశ్వరుని సంకల్పమే బీజంగా ఉంటుంది. అది ప్రకృతిలో వివిధరకాల రశ్మలను (ప్రేరణలను) కలిగించి సృష్టిని గావిస్తుంది. అప్పుడు కర్మబద్ధులైన జీవులు, కూడా ఉంటాయి. కాని వారెవరూ సృష్టిరచనను తెలుసుకోలేరు. ఎందుచేతనంటే అప్పటికి వారికి యింద్రియాల నిర్మాణం కాలేదు. కనుక ఒక్క పరమేశ్వరుడు మాత్రమే సృష్టి ఏ విధంగా ఏర్పడిందో, దేనితో ధరింపబడిందో తెలుసుకోగలడు.

**ఇయం విసృష్టిర్యత ఆబభూవ యది వా దధే యది వా న।**
**యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్త్సో వేద యది వా న వేద ।**
**(ఋగ్వేదం. 10-129-7)**

# అఘమర్షణ సూక్తం

మూడు మంత్రాలు గల ఈ చిన్న సూక్తం దశమ మండలంలోని 190వ సూక్తం. ఈ సూక్తానికి కూడా దేవత - భావవృత్తమ్. ఇది సృష్టి రచనా క్రమాన్ని సంక్షిప్తంగా తెలుపుతుంది. ఈ సూక్తానికి 'అఘమర్షణో మధుచ్ఛందస' ఋషి.

'అఘము' అంటే పాపం. 'అర్షణం' అంటే పోగొట్టుకోవటం. పాపాన్ని పోగొట్టుకోవటానికి ఈ మంత్రాలుపకరిస్తాయి. అంటే ఈ మంత్రార్థాలను మననం చేస్తూవుంటే పరమేశ్వరుని మహిమ అర్థమై పాపం చెయ్యడానికి భయపడతాం. ఆ విధంగా పాపాలు మననుండి దూరమౌతాయి.

**ఋతం చ సత్యం చాభీద్ధా తపసో<sub></sub>ఽధ్యజాయత ।**
**తతో రాత్ర్యజాయత తతః సముద్రోఽర్ణవః ॥**
**సముద్రా దర్ణవా దధి సంవత్సరో అజాయత ।**
**అహోరాత్రాణి విదధ ద్విశ్వస్య మిషతో వశీ ॥**
**సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్ ।**
**దివం చ పృథివీం చాంతరిక్ష మథో స్వః ॥** (ఋ10-190-1,2, 3)

ఋత సత్యములతోను, పరమేశ్వరుని దివ్యతపస్సుతోను ఈ జగత్తు ఉత్పన్నమయ్యింది. (ఋతం అంటే సృష్టియొక్క శాశ్వత నియమాలు, సత్యమంటే మూల ప్రకృతి). ఆ పరిణామ క్రమంలో ముందుగా ప్రళయరూప రాత్రి ఉత్పన్నమయ్యింది. దానినుండి పరమాణు సముద్రం (తరలరూప పరమాణురాశి) ఉద్భవించింది. ఆ అర్ణవసముద్రం సంవత్సర నామక మహదండంగా ఏర్పడింది. ఆ మహదండం బ్రద్దలై నక్షత్రాలుగా, సూర్యులుగా, గ్రహ ఉపగ్రహాలుగా ఏర్పడి అహోరాత్రములేర్పడ్డాయి. వీటన్నిటిని సృజించినది 'వశీ' నామక నియామకశక్తి. అనగా పరమేశ్వరుడు. ఆ ధారణశక్తియే ఈ సూర్యచంద్రాదులను, పృథివీ అంతరిక్షాలను పూర్వకల్పంలో సృజించినట్లే సృజించింది.

ఒక విశ్వవ్యాపక నియామక శక్తి ఈ సృష్టి స్థితి ప్రళయాలను చక్రభ్రమణంగా చేస్తూ జీవులు చేసిన కర్మలకు న్యాయంగా ఫలితాలనిస్తున్నది. అది సర్వద్రష్ట. కనుక ఏ పాపియు పాపఫలాన్ని అనుభవించకుండా

తప్పించుకోలేడు. ఇది గుర్తించినవాడు పాపాలకు దూరమౌతాడు. పాపం చెయ్యకుండా ఉంటాడు.

## పురుష సూక్తం

'సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ ।, అంటూ ప్రారంభమయ్యే పురుషసూక్తం ముందుగా ఋగ్వేదం (10-90)లో కనబడుతుంది. తదుపరి యజుర్వేదంలో మరికొంత విశాలంగా కనబడుతుంది. సామవేదంలో ఈ మంత్రాలు కొన్నే ఉంటాయి. అథర్వవేదం (19వ కాండం 6వ సూక్తం) లో కొంత మార్పుతో ఉంటుంది. ఈ మంత్రాల దేవత (విషయం - సబ్జెక్ట్) పురుషుడు. ఇచట పురుషు డంటే పురుషశరీరం కాదు. ఈ పురుషపదం ప్రకరణాన్నిబట్టి పరమాత్మకు, జీవాత్మకు, ప్రకృతికి కూడా అన్వయించవచ్చు. పరమేశ్వరుడు బ్రహ్మండ పురంలో శయనించి ఉంటే, జీవాత్మ శరీరపురంలో శయనించి ఉంటాడు. ప్రకృతికూడా పురుషాత్మకమేకనుక ఈ పదం ప్రకరణాన్ని బట్టి ప్రకృతికి కూడా వర్తిస్తుంది.

ఈ మంత్రాలలో పురుషుడు వేల శిరస్సులు, వేల కన్నులు, వేల పాదములు కలవాడని వర్ణింపబడింది. అంటే ప్రాణుల సమస్త శిరస్సులు కన్నులు పాదములు తనయందు కలవాడని అర్థం. పరమేశ్వరుని విశ్వరూపం ఈ మంత్రాలలో వర్ణింపబడింది. ఈ సమస్త విశ్వము, అందలిప్రాణులు, వేదాలు కూడా అతనినుండే ఉత్పన్నమయ్యాయనీ, ఈ విశ్వమంతా అతనిలో ఒక పాదం (1/4) కాగా, మరొక మూడు పాదాలు (3/4) అమృతమయంగా (ఆనందమయంగా) ఉన్నదనీ ఈ సూక్తం చెబుతుంది.

**బ్రాహ్మణోఽస్య ముఖమాసీద్ బాహూ రాజన్యః కృతః ।**
**ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత ॥**

**(ఋగ్వేదం. 10-90-12)**

మానవ సమాజాన్ని ఒక పురుష శరీరంతో పోలిస్తే బ్రాహ్మణులు (విద్యావంతులు) ముఖతుల్యం గాను, రాజన్యులు (శూరులు, వీరులు, రక్షకులు) బాహు సమానంగాను ఉంటారని ఈ సూక్తం చెబుతుంది. వైశ్యులు (కృషి గోరక్ష వాణిజ్యాలు చేసేవారు) ఊరువులు గాను, శూద్రులు (కర్మచారులు)

పాదములుగాను ఉంటారనే మాటలు ఎవరినీ కించపరచటం లేదు. ఇది కేవలం ఆలంకారిక వర్ణన. కాళ్ళతోటే మనం వెళ్ళాలనుకున్న చోటికి వెళ్ళగలుగుతున్నాం. ఎన్నిటినో చూడగలుగుతున్నాం. వినగలుగుతున్నాం. తినగలుగుతున్నాం. కాళ్ళు లేకపోతే మన జీవితం ఎంత కష్టమయమో కర్మచారులు (శూద్రులు) లేకపోతే కూడా అంత కష్టమయమే.

మానవులు మాతృగర్భంనుండి పుడతారేకాని కాళ్ళు చేతుల నుండి, శిరస్సునుండి కాదుకదా ! శరీరంలో ఏ భాగానికి బాధ కలిగినా మిగతా శరీరమంతా స్పందిస్తుంది కదా ! ఈ విషయం మరికొంత వివరంగా ముందు ప్రకరణాలలో తెలిసికొందాము.

## హిరణ్యగర్భ సూక్తం

పదవ మండలంలోని 121వ సూక్తం హిరణ్యగర్భ సూక్తం. ఈ మంత్రాలకు దేవత (విషయం) కః (సుఖస్వరూపుడైన పరమేశ్వరుడు.) అయినప్పటికీ 'హిరణ్యగర్భః' అంటూ ప్రారంభమౌతుంది కనుక ఈ సూక్తం హిరణ్యగర్భ సూక్తంగా ప్రసిద్ధి చెందింది. ఇంతేగాక, ఈ మంత్రాలకు ఋషి 'హిరణ్యగర్భః ప్రజాపత్యః' కావటంకూడా మరొక కారణం.

ఈ మంత్రాలన్నీ **'కస్మై దేవాయ హవిషా విధేమ'** అనే ధ్రువ వాక్యంతో అంతమౌతాయి. ఈ వాక్యంలోని 'కస్మై' అనే పదంలో ఎవనికొరకు? అనే ప్రశ్నార్థకమేకాక 'సుఖ స్వరూపునికొరకు' అనే సమాధానం కూడా ఉంది. 'కః ' అనే పదమునకు సుఖ మనే అర్థంకూడా ఉంది. ప్రజాపతియైన పరమేశ్వరుడు కేవల సుఖస్వరూపుడు కనుక అతనికే కః అనే పేరుందని శతపథ బ్రాహ్మణం చెబుతుంది. **(కః వై ప్రజాపతిః).** హిరణ్యగర్భుడంటే బంగారం కడుపులో గలవాడని అర్థంకాదు. **'జ్యోతిర్వై హిరణ్యమ్'** అని శతపథ బ్రాహ్మణ వ్యాఖ్య. కాన - **'హిరణ్యాని సూర్యాదీని తేజాంసి గర్భే మధ్యే యస్య సః'** - సూర్యుడు మొదలైన తేజోమయ గోళములను తన గర్భమందు గల పరమేశ్వరు డని నిర్వచనం. ఇందలి మొదటి మంత్రం ఈ విధంగాఉంటుంది.

**హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్ ।**
**స దాధార పృథివీం ద్యాముతేమాం**
**కస్మై దేవాయ హవిషా విధేమ ॥** (ఋ. **10-121-1)**

సూర్యాది జ్యోతిస్సులను గర్భమున గల పరమేశ్వరుడు సృష్టికి పూర్వము విద్యమానుడై సమస్త భూతములకు ఏకైక జనకుడై ఉన్నాడు. అతని ఆధారముననే ఈ పృథివీ ద్యులోకములు నిలిచియున్నవి. అట్టి సుఖస్వరూప పరమేశ్వరునకు సత్కర్మ లను హవిస్సు నర్పించి నమస్కరించు చున్నాను.

ఈ విధంగానే మిగిలిన మంత్రాలు పరమేశ్వరుని సర్వవ్యాపకునిగా, సర్వాధారునిగా, సర్వ సంరక్షకునిగా, సర్వ కర్మఫల దాతగా, మోక్ష ప్రదాతగా కీర్తించాయి. చివరి మంత్రంలో 'హే ప్రజాపతీ ! జన్మించిన ఈ జగత్తునంతటిని తెలుసుకొనగలవాడు నీకన్న వేరెవ్వరూ లేరు. కాన, మేము ఏఏ కోరికలతో నిన్ను ఉపాసించెదమో వాటినన్నిటిని పూర్ణపురుషార్థమొనర్చి పొందుదుము గాక !' అనే సంకల్పం ఉంది. అంటే, ఆ విధంగా సంకల్పం చేసి సాధన చెయ్యమంటుంది.

## స్వస్తి సూక్తాలు

స్వస్తిని శుభాన్ని కోరే మంత్రాలు వేదాలలో కోకొల్లలుగా ఉన్నాయి. ఋగ్వేద పంచమ, దశమ మండలాలలో యివి ఎక్కువగా కనబడతాయి వీటి సంకలనంతో ఏర్పడినవే స్వస్తివాచన, పుణ్యాహవాచన మంత్రాలు. వీటిలో కేవలం స్వస్తికొరకు ప్రార్థనలేకాక స్వస్తి ఏ విధంగా కలుగుతుందో చెప్పబడింది. అంటే వేదం చెప్పిన ఆ మార్గంలో జీవితం గడిపితే మనకి అన్నీ శుభాలే జరుగుతాయి.

ముఖ్యంగా దశమ మండలంలోని 63వ సూక్తం ఆదిత్య బ్రహ్మచారుల ఉపదేశాల ననుసరించమంటుంది. ఆదిత్య బ్రహ్మచారులంటే నాలుగు వేదాలు చదువుకొన్న పూర్ణ విద్వాంసులు. ఇంతేగాక, పరోపకార భావనతో సర్వసంగ పరిత్యాగులై దేశసంచారంచేస్తూ ధర్మోపదేశం చేసే ధర్మదేవతలు. వీరిని వేదం విశ్వదేవత లంటుంది. మాతాపితరులు, ఆచార్యఅతిథులు దేవతలే అయినా వారు మనవరకే దేవతలు. కాని, విశ్వదేవతలు మానవమాత్రులందరికి దేవతలు. వారు పక్షపాతం లేకుండా అందరినీ తమ బిడ్డలుగా భావించి అందరి ఉన్నతికొరకు ఉపదేశం చేస్తారు ఆదిశంకరాచార్యులు, మహర్షి దయానందులు మొదలైనవారు ఇట్టి కోవకు చెందిన విశ్వదేవతలు.

పూర్వం ప్రయాణ సమయంలో స్వస్తివాచనం చెప్పుకొని ప్రయాణమయ్యే వారట. ఇట్టి వర్ణనలు మన రామాయణ భారతాలలో అక్కడక్కడ కనబడతాయి. మేము పయనించే భూ జల ఆకాశ మార్గాలు మాకు శుభ ప్రదములు, సుఖ ప్రదములు కావాలనే ప్రార్థనలు ఆ మంత్రాలలో ఉన్నాయి.

ఓం స్వస్తి నః పథ్యాసు ధన్వసు స్వస్త్యప్సు వృజనే స్వర్వతి ॥
**స్వస్తి నః పుత్రకృథేషు యోనిషు, స్వస్తి రాయే**
**మరుతో దధాతన ॥ (ఋ. 10-63-15)**

ఓం స్వస్తి రిద్ధి ప్రపథే శ్రేష్ఠా రేక్ణ స్వత్యభి యా వామమేతి ।
**సా నో అమా సో అరణే నిపాతు స్వావేశా భవతు దేవగోపా ॥**
**(ఋ. 10-63-16)**

హే పరమేశ్వర ! నీ కృపవలన మా భూ జల వాయు మార్గము లన్నియు మాకు స్వస్తిని కలిగించును గాక. యుద్ధభూములు, సంతానోత్పత్తి మార్గములు అన్నియు మాకు శుభంకరములే యగును గాక !

హే సర్వేశ్వర ! సర్వసంరక్షక ! ఏ భూమియందు (దేశమందు) మార్గములన్నియు శుభప్రదములో, ధనధాన్య పూర్ణములో అట్టి భూమియందు మమ్ము వసింపజేయుము. అది మాకు రమణీయము, పురుషార్థసాధన యోగ్యము అగును గాక ! మేము విద్వాంసులచేతను ధర్మాత్ములచేతను రక్షింపబడుదుము గాక !

ఏ మానవుడు స్వస్తిని పొందునో కూడా ఈ మంత్రాలు సూచిస్తాయి.

**అరిష్టః స మర్తో విశ్వ ఏధతే ప్రప్రజాభి ర్జాయతే ధర్మణ స్పరి।**
**య మాదిత్యాసో నయథా సునీతిభిరతి విశ్వాని దురితా స్వస్తయే ॥**
**(ఋ. 10-63-13)**

రోగరహితుడైన మానవుడే సంకల్పించినవి సాధించగలడు. ధర్మాత్ముడైన పిదపనే ఉత్తమ సంతానమును, అనుచరులను, అభిమానులను పొందును. ఎవనికి ఆదిత్య బ్రహ్మచారులు మార్గదర్శకులో అట్టివాడు కష్టములను విఘ్నములను అధిగమించి స్వస్తిని (శుభమును) పొందును.

**'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్'** అని పెద్దలు చెప్పినట్లు ఈ వేదం నిరోగియే అన్నిటిని పొందునని చెబుతుంది. ఇంతేగాక జీవునకు ఈ మానవ శరీరం 'ప్రాతర్యావాణ' మంటుంది.

ప్రాతర్యావాణం రథ మింద్ర సానసి
మరిష్యంత మారుహేమా స్వస్తయే ॥ ఋ. **(10-63-14)**

ఓ జీవాత్మా ! నిద్రనుండి లేవగానే నీకు రథముగా నుండు ఈ శరీరారోగ్యమును కాపాడుకో. ఆరోగ్యవంతమైన శరీరరథము నధిరోహించి స్వస్తిని పొందు.

విద్వద్రచిత శ్లోకములతోకన్న యిట్టి భావగర్భిత వేద మంత్రములతో ప్రార్థించుటయే ఆదర్శంగాను ఉన్నతంగాను ఉంటుంది. అందుచేతనే మన ప్రాచీనులు స్తుతి ప్రార్థనోపాసనలు వేదమంత్రాలతోనే జరుపుకొనేవారు.

## ధన అన్న దాన ప్రశంసా సూక్తం

12వ సూక్తం ధన అన్నదానములను ప్రశంసిస్తుంది. ఆకలిగొన్న వానికి అన్నం పెట్టమంటుంది. దానం చేసినంతమాత్రాన ఎవరూ దరిద్రులుకారంటుంది. దానం చేయనివాడు సుఖాలను పొందలే డంటుంది. అన్నార్తుడై యింటికి వచ్చిన యాచకునికి అన్నం పెట్టక మనం తింటే ఆ అన్నం మనకు సుఖాన్ని యివ్వదంటుంది. అట్లని గర్వంతో దానం చెయ్యకు మంటుంది. లోకంలో చనిపోయేవారంతా కేవలం ఆకలి కారణంతోనే చనిపోవుటం లేదు, కడుపునిండా తిండిగలవాడుకూడా మరణిస్తున్నాడు కదా! కనుక గర్వించకు అని హితవు చెబుతుంది.

**'న స సఖా యో న దదాతి సఖ్యం సచా భువే సచమానాయ పిత్వః'** కష్టాలలో ఉన్నవాడిని ఆదుకోని మిత్రుడు మిత్రుడే కాదంటుంది ఈ సూక్తం. **'ఓ హి వర్తన్తే రథ్యేవ చక్రాన్యమన్యముప తిష్ఠన్తి రాయః'** – ధనం రథచక్రం వలె ఒకరినుండి మరియొకరికి పయనిస్తుంది కనుక అది నీ చేతిలో ఉన్నపుడే దానంచేసుకొని పుణ్యాత్ముడవు కమ్మని హితువు చెబుతుంది. – పరమేశ్వరుని ఉపదేశ మేమంటే :

మోఘమన్నం విన్దతే అప్రచేతాః సత్యం బ్రవీమి
వధ ఇత్ స తస్య। నార్యమణం పుష్యతి నో
సఖాయం కేవలాఘో భవతి కేవలాదీ॥ (ఋ. 10-117-6)

ఓ మానవులారా ! వివేకంలేని స్వార్థపరుడు వ్యర్థంగా అన్న భోగాల ననుభవిస్తాడు. అతని ఆ స్వార్థమే అతని పతనానికి కారణమౌతుంది. నేను సత్యమే చెప్పుచున్నాను. కేవలం తన కొరకే వండుకొని తినేవాడు అన్నమును కాక పాపమునే భుజిస్తాడు.

"పొలములో కష్టించి భూమిని దున్నే రైతే శ్రేష్ఠమైన భోజనాన్ని పొందుతాడు. ప్రయాణంచేసే యాత్రికుడే గమ్యాన్ని చేరుకొంటాడు. ఉపదేశం చేయని విద్వాంసునికన్న ఉపదేశంచేసే విద్వాంసుడే మిన్న. అట్లే అదాత కన్న దానశీలుడే ఉన్నతిని పొందుతాడు" అని ఉపదేశిస్తుం దీ సూక్తం.

"సోమరికన్న పురుషార్థపరుడే ప్రగతిని సాధిస్తాడు. ఒకటికి రెండు, మూడు, నాలుగురెట్లుగా అతని ఐశ్వర్యం వృద్ధి చెందుతుంది. అట్లే దానశీలతకూడా వృద్ధి చెందాలి" అనే సుభాషితాలతో ఈ సూక్తం ముగుస్తుంది.

## ద్యూత నిరాకరణ సూక్తం

ద్యూతం అంటే జూదం. జూదం ఆడవద్దంటుంది వేదం. జూదం అంటే కేవలం పాచికలాడటమే కాదు. కష్టపడకుండా యితరుల నుండి డబ్బు సంపాదించే మార్గాలన్నీ జూదం క్రిందకే వస్తాయి. ఇటువంటి వాటిలో లాటరీలు, షేర్ మార్కెట్లు, పేకాటలు, గుఱ్ఱపుపందాలు, కోడిపందాలు మొదలైనవన్నీ వస్తాయి. ఇవన్నీ పైపై మెరుగులతో తేలికగా ధనవంతులుకండని మురిపిస్తాయి. వివేకహీనులను తమ వలలో వేసుకొని అష్టకష్టాలు పెట్టి , అధోగతి పాలు చేస్తాయి. జూదరి తాను అధోగతి పాలు కావడమేకాక భార్యాబిడ్డలనుకూడా దారిద్ర్యానికి, అవహేళనకు గురిచేస్తాడు. ఈ విషయాన్నే ఈ సూక్తం వివరంగా వర్ణించి మనను జాగరూకులను చేస్తుంది.

జూదరి భాగ్యవాది. అదృష్టం కోసం అర్రులు చాస్తూ అధోగతి పాలవుతాడు. ఈ సూక్తం జూదకర్మను నిందిస్తుంది. పురుషార్థ పరుడవు కమ్మంటుంది. వ్యసాయదారునివలె కష్టించి ఫలితాన్ని కోరమంటుంది.

**అక్షైర్మాదీవ్యః కృషిమిత్ కృషస్వ,**
**విత్తే రమస్వ బహుమన్యమానః**
**తత్ర గావః కితవ తత్ర జాయా,**
**తన్మే విచష్టే సవితాయమర్యః ॥ (ఋ. 10-34-13)**

ఓ మానవా! పాచిక లాడవద్దు. వ్యవసాయదారునివలె పురుషార్థపరుడవు కమ్ము. ఆ కష్టార్జితంపై వచ్చు ధనముతోనే సంతృప్తి చెందు. దానిలోనే గొప్ప గౌరవముంది. నీ భార్యాపిల్లలు నిన్ను ఆదరించి ప్రేమిస్తారు. అంతర్యామియైన పరమేశ్వరుడు ఈ ధర్మరహస్యాన్ని నీ కెరుక పరుచును గాక !

చివరిగా ఈ సూక్తం నిజంగా పశ్చాత్తాపపడి జూదకర్మను విడచిన జూదరిని కించపరచక ఆదరించమంటుంది. అతనికి సరియైన దారిచూపి మిత్రభావంతో మెలగమంటుంది. అతనిని ఉపమానంగా చూపి జూదంవైపు పోకుండా అమాయకులను ఆపమంటుంది. జూదరి ప్రజాద్రోహం కాని, రాజద్రోహంకాని చేసిఉంటే రాజశాసనానికి (చట్టానికి) లోంగిపోయి శిక్ష ననుభవించాలంటుంది. అదే సరియైన ప్రాయశ్చిత్త మంటుంది.

## స్త్రీ ప్రశంసా సూక్తాలు

వేదాలలో స్త్రీ ప్రశంసా సూక్తాలు చాలా ఉన్నాయి. ముఖ్యంగా ఋగ్వేద అథర్వవేదాలలో ఎక్కువగా కనబడతాయి. ఋగ్వేద దశమ మండలంలో 85, 159 సూక్తాలు స్త్రీ ఔన్నత్యాన్ని విశేషంగా కీర్తిస్తాయి. ఈ రెండు సూక్తాలకు ఋషులు స్త్రీలే. వ్యవహార సౌలభ్యంకొరకు స్త్రీ ఋషులను ఋషిక లంటారు. 85వ సూక్తానికి ఋషిక సూర్యాసావిత్రీ. 195వ సూక్తానికి శచీపౌలోమి. ఈ విధంగానే చాలామంది ఋషికల పేర్లు ఋగ్వేదంలో కనబడతాయి. అదితి, అపాలా, ఆత్రేయీ, ఇంద్రాణీ, ఊర్వశీ, యమీ, వైవస్వతీ, రోమశా, బ్రహ్మావాదినీ జుహూ, బ్రహ్మజాయీ, మాయీ, జరితా, నదీ, అగస్త్యస్వసా మొదలగు వారంతా ఋషికలే. వివాహ సంస్కారంలో వీనిలోని కొన్ని మంత్రాలు సేకరించబడ్డాయి. 85వ సూక్తం స్త్రీని గృహసామ్రాజ్ఞి అంటుంది.

**సామ్రాజ్ఞీ శ్వశురే భవ, సామ్రాజ్ఞీశ్వశ్రవాం భవ ।**
**ననాన్దరీ సామ్రాజ్ఞీభవ, సామ్రాజ్ఞీ అధి దేవృషు ॥(ఋ. 10-85-46)**

ఓ నారీమణీ ! నీవు అత్త మామలకు, ఆడబిడ్డలకు, దేవరులకు (మరదులకు) సామ్రాజ్ఞిగా తలమాణికముగా నుండి వారి గౌరవ మర్యాదలను ప్రకాశింపజేయుము. గృహ సామ్రాజ్యానికి సామ్రాజ్ఞివి కమ్ము.

159 వ సూక్తం స్త్రీ అబలగాకాక సబలగానుండి కుటుంబ కీర్తి ప్రతిష్ఠలను ఉన్నత శిఖరాలకు చేర్చమంటుంది.

**అహం కేతురహం మూర్ధాహ ముగ్రా వివాచనీ ।**
**మమేదను క్రతుం పతిః సేహానాయా ఉపాచరేత్ ॥**
**మమ పుత్రాః శత్రుహణో ౽ థో మే దుహితా విరాట్ ।**
**ఉతాహమస్మి సఞ్జయా పత్యౌ మే శ్లోక ఉత్తమః ॥**

**(ఋ. 10-159-2, 3)**

"నేను జ్ఞానంలో అగ్రగణ్యను. స్త్రీలలో మూర్ధన్యను. ఉన్నతశ్రేణికి చెందిన వక్తను. అన్ని రంగాలలో విజేతను. నా శ్రేష్ఠతను గుర్తించి నన్ను నా పతి గౌరవించును గాక !

నా పుత్రులు శత్రుంజయులు. నా పుత్రి విశ్వవందిత. సర్వసద్గుణ సుభూషిత. నేను ఇంటా బయటా గెలిచిన విజేతను. నా పతి హృదయమున నా కీర్తి స్థిరముగా నుండునుగాక !" అని సంకల్పించమంటుంది.

ఇంతేగాక, స్త్రీ కుటుంబమువారందరికి ప్రీతిపాత్రురాలు కావాలంటుంది.

**అఘోరచక్షురపతిఘ్న్యేధి శివా పశుభ్యః సుమనాః సువర్చాః**
**వీర సూర్దేవృ కామా స్యోనా శం నో భవ ద్విపదే**
**శం చతుష్పదే ॥ (ఋ. 10-85-44)**

"ఓ నారీమణీ ! నీవు సౌమ్యదృష్టి కలదానివి కమ్ము. పతికి హాని కలిగించనిదానివి కమ్ము. పశువులకు హితకారివి కమ్ము. సుమనస్కురాలవు, ఉత్తమ జ్ఞాన బలములు కలదానవు, వీరపుత్రులకు జన్మనిచ్చుదానవు, దైవభక్తి దేశభక్తి కలదానవు కమ్ము. వారు వీరననేల ద్విపాద చతుష్పాద ప్రాణులన్నిటికి మేలు చేసేదానివై అందరి మన్ననలను పొందు"మని హితువు చెబుతుంది.

వివాహ విషయంలో వేదం వధూవరులకు చాలా కట్టుబాట్లు నేర్పరుస్తుంది. చాలా ప్రమాణాలు చేయాలంటుంది. ముందుగా యిద్దరూ అందరి ఎదుట ఈ ప్రమాణం చెయ్యాలి.

సమఞ్జన్తు విశ్వేదేవాః సమాపో హృదయాని నౌ ।
సం మాతరిశ్వా సంధాతా సముదేష్ట్రీ దధాతు నౌ ॥
(ఋ. 10-85-47)

"ఓ విద్వాంసులారా ! మా యిరువురి హృదయములు రెండు నదుల నీరు కలిసి ఒకటగునట్లు కలిసియుండును గాక ! గాలి, నీరు మమ్ము ఒకటిగా చేయును గాక. ప్రపంచ ధారకశక్తి మా యిద్దరిని చక్కగా ధరించును గాక ! జ్ఞాన దేవత మా మనస్సులను ఒకటిగా చేయును గాక !" అని ప్రమాణం చెయ్యాలి.

వివాహాన్ని ఒక పవిత్ర బంధంగా భావించి ఒకరినొకరు అర్థం చేసుకుంటూ, ఒకరినొకరు గౌరవించుకుంటూ జీవితాంతం కలిసి ఉండాలని వేదం ఉపదేశిస్తుంది.

ఇహే మావిన్ద్ర సంనుద చక్రవాకేవ దమ్పతీ ।
ప్రజాయైనౌ స్వస్తకౌ విశ్వమాయుర్వ్యశ్నుతామ్ ।
(అథర్వ. 14-2-64)

మీ రిరువురు చక్రవాక పక్షుల జంటవలె అన్యోన్యానురాగ బద్ధులై నూరు సంవత్సరములు జీవింతురు గాక.

పతీ పత్నులు విడిపోకూడదు. దూరదూరంగా ఉండకూడదు. అప్పుడే ఆ గృహంలో ఉత్తమ సంతానం నిర్మింపబడుతుందని వేదం హితం చెబుతుంది.

ఇహైవ స్తం మా వి యౌష్టం విశ్వమాయుర్వ్యశ్నుతమ్ ।
క్రీడన్తౌ పుత్రై నప్తృభిర్ మోదమానౌ స్వే గృహే ॥
(ఋ. 10-85-42)

"ఓ పతీపత్నులారా ! మీ రెన్నడును విడిపోవద్దు. అన్యోన్యముగా కలిసిమెలసి ఈ గృహము నందే యుండుడు. పుత్రులతో పౌత్రులతో ఆటపాటలతో ఆనందంగా పూర్ణాయువు ననుభవింపుడు" అనే ఆశీర్వచనాలు వేదంలో చాలా కనబడతాయి.

వివాహము ఎవరు ఎవరితో చేసుకోవాలో యమ-యమీ సూక్తం స్పష్టం చేస్తుంది.

## యమ - యమీ సూక్తం

ఋగ్వేద దశమ మండలంలోని 10వ సూక్తం యమ-యమీ సూక్తం. దీనిలో యమ-యమీ అను పేర్లుగల అన్నా చెల్లెండ్ర సంవాదం (సంభాషణ) ఉంటుంది. చెల్లెలు యమీకి వివాహమయ్యిందికాని సంతానం కలుగలేదు. భర్తను విడచి మరొకరిని వివాహం కాని, నియోగం కాని చేసుకోవాలని అనుకొంది. తన అన్నయైన యముని పరికించి చూచింది. అతడు నిండు యవ్వనంతో ఎంతో అందంగా కనిపించాడు. అతడు విద్యావంతుడు, వీరుడు, సద్గుణవంతుడుకూడా. అందుచే అతడే తనకు తగిన వరుడని భావించింది. అన్నను సమీపించి వివాహ ప్రస్తావన తెచ్చింది.

అందుకు అన్న యముడు నిరాకరిస్తూ, నివారిస్తూ 'ఓ చెల్లీ ! నీ ఈ ఆలోచన మంచిదికాదు. దీనిలో చాలా దోషాలున్నాయి. వేదం కాని, విజ్ఞానంకాని యిట్టి సగోత్ర వివాహాల నంగీకరించదు. ఇది సృష్టి నియమాలకు విరుద్ధం' అంటాడు. అందుకు చెల్లెలు యమీ చాలా యుక్తులతో అన్నను వప్పించ ప్రయత్నిస్తుంది. "కన్య స్వయంవరం వివాహం చేసుకోవాలి. నేను నిన్ను వరిస్తున్నాను." కనుక నన్ను వివాహం చేసుకోమంటుంది. విద్యావతీ, సద్గుణవతీ, సౌశీల్యవతి యైన తన చెల్లెలు చెప్పిన యుక్తులలోని దోషాలను చూపించి ఆమెను ఆ ప్రయత్నం నుండి విరమింపచేస్తాడు యముడు. విద్యావతి, వివేకవతి కనుక యమీ కూడా అన్న చూపిన దోషాలనన్నిటిని అర్థం చేసుకొని మనఃపూర్వకంగానే తన ప్రయత్నం విరమించుకుంటుంది.

ఈ సూక్తం ద్వారా పరమేశ్వరుని ప్రబోధమేమంటే సగోత్ర-సపిండ వివాహాలు మంచివికావని తెలపుటయే. ఈ వేదోపదేశాన్నే మను మహర్షి మరికొంత వివరిస్తూ -

**అసపిణ్డా చ యా మాతురసగోత్రా చ య పితుః ।**
**సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే ॥**

**(మనుస్మృతి. 3-5)**

తల్లి కులంలో ఆరు తరములలోనిదియు, తండ్రి గోత్రమునకు చెందినదియు నగు కన్యలనుకాక దూరపు కన్యలనే వివాహం చేసుకోవాలి. అట్టి వివాహాలే ద్విజులకు (విద్యావంతులకు) ఉత్తమమైనవి. నియోగానికి

కూడా యిట్టినియమమే వర్తిస్తుంది.

మన శాస్త్రాలలో పుత్రికకు 'దుహితా' అనే పేరుకూడా ఉంది. 'దుహిత' అంటే 'దూరే హితా' దూరంగాహితం చేసేదని అర్థం. కుమార్తె తనకు పుట్టినదే అయినా దూరంగా వెళ్ళి భర్త హితంకొరకు తన జీవితాన్ని అర్పిస్తుంది. వైద్యవిజ్ఞానంకూడా దగ్గర బంధువులతో వివాహాలను (మేనరికాలు మొదలగువాటిని) నిషేధిస్తుంది. మేనరికాలు చేసుకుంటే జన్యుపరమైన సమస్య లేర్పడి వికలాంగులు పుట్టే అవకాశం ఎక్కువగా ఉంటుందని హెచ్చరిస్తుంది. అటువంటి సంఘటనలెన్నో జరిగాయి. మన శాస్త్రాలు దేశదూరం కూడా ఉండటం మంచిదంటాయి. విత్తనాలను పండిన పొలంలోకాక దూరంగా నాటితే ఎక్కువ పంటలనిస్తున్నాయని విజ్ఞానవేత్త లంటున్నారు కదా ! కనుక పెండ్లికి దూరపు సంబంధాలే మంచిది.

నియోగం నేటి తరానికి విపరీతంగా కనబడుతుందికాని యిది వేద సమ్మతమే. తన భర్తవల్ల సంతానం కలగని స్త్రీ భర్తయొక్క అనుమతితో కొన్ని నియమాలు ఏర్పరచుకొని పెద్దల సమక్షంలో యోగ్యుడైన వ్యక్తితో నియోగం చేసుకోవచ్చు. సంతానం పొందవచ్చు. అట్లే పురుషులు కూడా తన భార్యవల్ల సంతానం కలగకపోతే ఆమె అనుమతితో మరొక స్త్రీతో నియోగం చేసుకోవచ్చు. అదే నేడు గర్భకోశాన్ని దానంగా (డోనర్ మదర్స్‌ని) కోరుకుంటున్నారు. మహాభారతంలో నిట్టి నియోగ సంతానాలు కొన్ని కనబడతాయి. విచిత్రవీర్యుని భార్యలైన అంబికా అంబాలికలకు వ్యాసునితో ఏర్పాటు చేసిన నియోగం వల్లనే దృతరాష్ట్ర, పాండు రాజులు జన్మించారు. పాండురాజు పత్నులైన కుంతీ మాద్రిలకు నియోగం ఏర్పాటు చేయటంవల్లనే పాండవులు పుట్టారు. అప్పుడు అది ఎవరూ విపరీతంగా భావించలేదు. ఇదికూడా వివాహం వంటిదే.

వేదం బహుభార్యత్వాన్ని నిషేదిస్తుంది. ఒక పురుషునికి ఒక స్త్రీ, ఒక స్త్రీకి ఒకపురుషుడే పత్నీ పతులుగా ఉండాలంటుంది. వేదంలో అంతటా పత్నీపత్నుల గురించి ద్వివచనం వాడబడింది. సంస్కృత భాషలో ద్వివచనం ముఖ్యంగా పతీపత్నుల గురించే ఏర్పడ్డదేమో అనిపిస్తుంది.

## కథా సూక్తాలు

వేదాలలో చరిత్ర లేదు. చరిత్రలో కనబడే కొన్ని పేర్లను వేదాలలో చూసి వేదాలలో చరిత్ర ఉందని కొందరు పొరబడతారు. ఆదిమానవ సృష్టి సమయంలోనే వేదాలు ఉపదేశించబడ్డాయి కనుక అందులో చరిత్ర ఉండే అవకాశం ఎంతమాత్రం ఉండదు. వేదాలలో ఉన్న పేర్లతో కొందరు తమ పుత్రీపుత్రులకు నామకరణాలు చేసుకున్నారు. అందుచే ఈ భ్రమ కలుగుతున్నది. అటువంటి కథలలో గౌతమ- అహల్య కథ, ఇంద్ర వృతాసుర కథ, దేవాసుర సంగ్రామ కథ, కశ్యప - గయాదితీర్థ కథ, దేవాపి - శంతనుల కథ, ఊర్వశీ - పురూరవ కథ మొదలగునవి ముఖ్యమైనవి, కాని, ఇవి చారిత్రిక కథలు కావు. ఇవన్నీ ప్రాకృతిక శక్తుల గుణగణాల వర్ణన. ప్రకరణాన్నిబట్టి ఆ యా సంవాదాలకు, ప్రసంగాలకు, ఆలంకారిక కథలకు అర్థాలు వేరే ఉంటాయి.

అహల్య కథలో - ఇంద్రుడంటే సూర్యుడు. అహల్య అంటే రాత్రి. చంద్రుడే గౌతముడు. సూర్యుడు రాత్రిని తొలగిస్తాడు కనుక ఇంద్రుని జారునిగా ఒక వేదమంత్రం ఆలంకారికంగా వర్ణిస్తుంది.

చంద్రుని గౌతముడని ఎందుకన్నారంటే చంద్రుడు వేగంగా ఒకదినములోనే భూమిచుట్టూ తిరిగివస్తాడు కనుక. రాత్రిని అహల్య ఎందుకాన్నరంటే అది పగటిని తనలో లయం చేసుకుంటుంది కనుక. ఇది రూపకాలంకార వర్ణన. మనోరంజనకొరకు ఇట్టి అలంకారాలు ప్రయోగింపబడతాయి.

దేవాపి - శంతనుల కథలో - ఆర్ష్టిషేనుడు ఋష్టిషేణుని కుమారుడు. అంటే మరుద్గణముల (వాయువుల) పుత్రుడు ఋష్టిషేనుడు. అతని పుత్రులు దేవాపి - శంతనులు. అనగా విద్యుత్ జలములు. దీనిలో వర్షేష్టి యజ్ఞవిధానం ఆలంకారికంగా వర్ణింపబడింది.

ఊర్వశీ-పురూరవుల కథలో ఊర్వశి అంటే విద్యుత్ (మెరుపు). పూరురవుడంటే మేఘం. ఇలా అంటే జలం. కథలో పురూరవుడు ఇలా పుత్రుడని

చెప్పబడింది. జలంనుండే పుడుతుంది కదా మేఘం. కనుక మేఘం యిలా పుత్రుడు – పురూరవుడు.

వేదాలలో కనబడే కథలు ఇట్టివేకాని, చరిత్రలు కావు. ఉదాహరణకు – అంబ, అంబికా, అంబాలికా అనే పేర్లు యజుర్వేదంలో కనబడతాయి. అట్లని యజుర్వేదం మహాభారతం తరువాత వ్రాయబడిందని అనగలమా? రామయణంలో నాలుగు వేదాల పేర్లు వచ్చినవి కదా ! కనుక వేదాలలో ఉన్న ప్రాకృతిక శక్తుల పేర్లను భారతకాలంనాటి కాశీరాజు తనకుమార్తెలకు పెట్టుకున్నాడని గ్రహించాలి. అట్లే నదీ సూక్తంలో గంగా యమునల పేర్లున్నాయి. అవి కూడా ఆదిఋషులు వేదంలో ఉన్న పేర్లను ఆ నదులకు పెట్టినట్లు గ్రహించాలి.

ఋగ్వేదంలో ఓషధీ సూక్తాలు, చికిత్సా సూక్తాలు చాలా ఉన్నాయి. ఆయుర్వేదం ఋగ్వేదానికి ఉపవేదమే. వేదం ఐహికాన్ని ఆముష్మికాన్ని కూడా తెలుపుతుంది. ఆత్మ పరమాత్మలను గూర్చిన మంత్రాలెన్నో ఋగ్వేదంలో ఉన్నాయి. సామాజిక జీవనాన్ని తెలిపే మంత్రాలు కూడా ఉన్నాయి. ముఖ్యంగా ఋగ్వేద అంతిమ సూక్తం అందరూ అనుసరించతగినది. విశేషంగా అది సంఘటనను – ఐకమత్యాన్ని బోధిస్తుంది. సమానత్వాన్ని ప్రతిపాదిస్తుంది.

## సంఘటన సూక్తం

**సంసమిద్యువసే వృషన్నగ్నే విశ్వాన్యర్య ఆ ।**
**ఇళస్పదే సమిధ్యసే స నో వసూన్యా భర ॥**

హే సుఖవర్షమును కురిపించు జ్ఞానప్రకాశక పరమేశ్వర ! నీవు సమస్త ప్రాణులను, తత్వాలను కలుపగల గొప్పసంఘటన శక్తివి. వాక్పతివి. కరుణించి మమ్ము సంపదలతో నింపుము.

**సంగచ్ఛధ్వం సంవదధ్వం సం వో మనాంసి జానతామ్ ।**
**దేవా భాగం యథాపూర్వే సంజానానా ఉపాసతే ॥**

ఓ మానవులారా ! ప్రగతిమార్గంలో కలిసి నడవండి. కలిసి ప్రేమతో

వార్తాలాపములు చేయండి. కలిసి ఆలోచించండి. ఒకరి నొకరు అర్థము చేసుకొనండి. పూర్వం ఉత్తమ మానవులు ఏరకంగా పరస్పరం కలిసిమెలిసి సామాజికోన్నతికి పాటుపడ్డారో, ఏరకంగా తమకు లభించిన భాగములతో తృప్తిపడ్డారో, ఉపాసనాదులు చేసారో మీరును అట్లే చేయండి.

**సమానో మంత్రః సమానీ సమానం మనః సహ చిత్తమేషామ్**
**సమానం మన్త్రమభి మన్త్రయే వః సమానేన హవిషా జుహోమి ॥**

ఓ మానవులారా ! మీ అందరి ఆలోచనలు ఒకటిగా ఉండాలి. మీ సమితులు, సభలు, సంఘాలు అన్నీ ఒకే లక్ష్యాన్ని కలిగి ఉండాలి. ఒకరి భావాల నొకరు గౌరవించుకుంటూ ఒకే లక్ష్యంవైపు పయనించాలి. మీరందరు కలిసిమెలిసి యజ్ఞాలను (సమాజ సంక్షేమ కార్యాలను) నిర్వహించాలి.

**సమానీవ ఆకూతిః సమానా హృదయాని వః ।**
**సమానమస్తు వో మనో యథా వః సుసహాసతి ॥**

**(ఋ. 10-169-1, 2, 3, 4)**

ఓ మానవులారా ! మీ జ్ఞానము, మీ భావాలు కలిసి చక్కగా పనిచేయును గాక. మీ మనస్సులు పరస్పరము కలిసి ఒకరికొకరు సహకరించుకుంటూ ఉన్నతిని పొందుదురు గాక !

ఇట్టివే సమానత్వాన్ని బోధించే మంత్రాలు నాలుగు వేదాలలో కోకొల్లలు. యజ్ఞ యాగాది ధార్మికకార్యాలు కూడా అందరూ చేయాలనీ, చేయవచ్చని వేదం చెబుతుంది. **'పంచ జనా మమ హోత్రం జుషధ్వం" ' పంచ జనా మమ హోత్రం జుషన్తాం'** అని ఋగ్వేదం (10-53-4,5) హితువు చెబుతుంది. అంటే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు మరియు ఇతరులు కూడా అగ్నిహోత్రాన్ని ఆచరించి ఆరోగ్యాన్ని, శుద్ధమైన అన్న జలాదులనుపొందండని ఉపదేశిస్తున్నది. (వర్ణ విభాగం గురించి ముందు ప్రకరణాలలో వివరంగా తెలుసుకొందాము). ఇక యజుర్వేదం ఏమి ఉపదేశిస్తున్నదో తెలుసుకుందాం.

# యజుర్వేదం

యజుర్వేదం కర్మకాండను ఉపదేశిస్తుంది. దీనిలో 1975 మంత్రాలున్నాయి. ఇవి 40 అధ్యాయాలుగా విభజింపబడి ఉంటాయి. వీటిని అనువాకాలుగాను, కండికలుగాను కూడా విభజించి వ్యవహరిస్తూ ఉంటారు. ఆ ప్రకారం 303 అనువాకాలు, 1975 కండికలు అవుతాయి. అంటే వీటిలోని మంత్రాలను కండికలని కూడా అంటారు.

యజుః + వేదం రెండు పదములు కలిసి యజుర్వేదం అయ్యింది. యజుః అంటే (యజ–దేవపూజా సంగతికరణ దానేషు) – 'దేవతలను (దివ్యగుణాలుగల పదార్థాలను, వ్యక్తులను) పూజించుట, సంపదలను వ్యక్తులను సమీకరించుట, వాటిని యథాయోగ్యముగా వితరణ చేయుట అని అర్థం. వీటిని గురించి ఈ వేదం వివరిస్తుంది. సారాంశమేమంటే – ఏ కర్మలు చేయటంవల్ల మానవులకు ఇహలోక ఉన్నతి, పరలోక ఉన్నతి కలుగుతుందో ఆ యా విషయాలు ఈ వేదంలో ఉన్నాయి. ఋగ్వేదం జ్ఞానాన్ని బోధిస్తే ఆ జ్ఞానాని కనుగుణంగా కర్మలు ఎలా చేయాలో యజుర్వేదం బోధిస్తుంది.

మనకు ఉన్నతినికలిగించే కర్మలలో యజ్ఞం (అగ్నిహోత్రం) శ్రేష్ఠతమ కర్మగా చెప్పబడింది. ఆవునెయ్యి, మూలికలు, సుగంధ ద్రవ్యాలు మొదలైన శ్రేష్ఠమైన పదార్థాలను పద్ధతిప్రకారం అగ్నిలో ఆహుతులుగా వేస్తే పృథివీ అంతరిక్ష ద్యుస్థానీయ దేవతలు సంస్కరింపబడతాయి. అంటే జల వాయువులు, భూమి మాలిన్యరహిత మౌతాయి. తద్వారా ప్రాణులన్నిటికి ఆయు రారోగ్య ఐశ్వర్యాలు లభిస్తాయి. దీనిద్వారా పక్షపాతం లేని పరోపకారం జరుగుతుంది. అందుచే అగ్నిహోత్రాన్ని శ్రేష్ఠతమ కర్మగా యజుర్వేదం చెబుతుంది.

అగ్నిహోత్రం ఒక చికిత్సా పరికరం వంటిది. దీనివల్ల వివిధ కామనలు (కోరికలు) నెరవేరుతాయి. వర్షాల కొరకు, ఆరోగ్యం కొరకు, సంతానంకొరకు, ఉపద్రవాలనుండి రక్షణకొరకు, సంక్షేమంకొరకు వివిధ యజ్ఞాలను ఈ వేదం ఉపదేశిస్తుంది. అయితే ఆ యా ప్రయోజనాల కొరకు అందుకు తగిన మూలికలను, మిష్టాన్న పాయసాదులను, ఆవునెయ్యి, సోమలత లేదా తిప్పతీగ మొదలైన పుష్టికర పదార్థాలను పద్ధతి ననుసరిస్తూ ఆహుతు లివ్వాలి. ఆ విధంగా చేస్తే అగ్నిహోత్రం కామధేనువవుతుంది. కోరికలను నెరవేరుస్తుంది.

**'ఇషే త్వోర్జే త్వా వాయవ స్థ దేవో వః**
**సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణే**

అంటూ ప్రారంభింపబడిన ఈ వేదం అగ్నిహోత్ర వైశిష్ట్యాన్ని వేనోళ్ళ కీర్తిస్తుంది. ఈ విధంగా ఉపదేశిస్తుంది.

**వసోః పవిత్రమసి ద్యౌరసి పృథివ్యసి ఘర్మో౽సివిశ్వధా౽ అసి।**
**పరమేణ ధామ్నా దృంహస్వ మా హ్వార్మా తే యజ్ఞపతిర్హ్వా ర్షీత్ ॥**
**(యజుర్వేదం. 1-2)**

"ఓ మానవులారా ! ఈ వసువు అంటే యజ్ఞం చాల పవిత్రమైనది. (యజ్ఞో వై వసుః - శతపథ బ్రాహ్మణం. 1-5-4-9). ద్యులోకం వంటి విశాలమైనది. దీనిలో వేసిన ఆహుతులు సూర్యరశ్మిలో చేరి ప్రాణుల కుపకారం చేస్తాయి. వాయువులో చేరి పృథివివలె విస్తరిస్తాయి. అన్నిటిని శుద్ధి చేసి వాటిని ధరిస్తాయి. అట్టి శ్రేష్ఠమైన యజ్ఞాన్ని మీరు విడువవద్దు. యజ్ఞములను చేయు యజ్ఞపతులుకూడా దీనిని విడువకుందురు గాక."

ఇంకా ఈ యజ్ఞం **'వసోః పవిత్రమసి శతధారం, వసోః పవిత్రమసి సహస్రధారం' (యజు. 1-3),** శతవిధాల సహస్రవిధాల పవిత్రం చేస్తుందని చెబుతుంది.

మనం అగ్నిహోత్రంలో వేసిన ఆహుతి **'భూ రగ్నయే స్వాహా'** - భూలోకంలో అగ్నిగా మారుతుంది. తదుపరి **'భువర్వాయవే స్వాహా'** భువర్లోకంలో అంటే అంతరిక్షంలో వాయువుగా మారుతుంది. అనంతరం **'స్వరాదిత్యాయ స్వాహా'** స్వర్లోకంలో (సూర్య నక్షత్రాదులుండే ద్యుస్థానంలో) ఆదిత్యునిలో చేరుతుంది. ఈ విషయాలు వివరంగా, వైజ్ఞానికంగా తెలుసుకో గోరువారు మాచే ప్రచురింపబడిన **'అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము' 'అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ'** అనే పుస్తకాలు చదువగోరుచున్నాము.

అగ్నిహోత్రాన్ని వ్రతంగా స్వీకరించటంతోబాటు సత్యాన్ని కూడా వ్రతంగా స్వీకరించమంటుంది. ఈ వేదం -

**అగ్నే! వ్రతపతే ! వ్రతం చరిష్యామి**
**తచ్ఛకేయం తన్మే రాధ్యతామ్ ।**
**ఇదమహ మనృతాత్ సత్య ముపైమి ॥ (యజు. 1-5)**

ఓ అగ్నే ! జ్ఞాన ప్రకాశకా ! వ్రతపాలకా ! నేను సత్యవ్రతమును చేయ సంకల్పించితిని. దాని నాచరించు శక్తిని నాకు ప్రసాదింపుము. దానితో విద్యా విజ్ఞానాదులను పొంది ప్రకాశింతును గాక ! ఇప్పటినుండి అసత్యము నుండి, అసత్యవ్యవహారమునుండి, అజ్ఞానమునుండి విడివడి సత్యమును, సత్యవ్యవహారమును, జ్ఞానమును పొందుదును గాక !

ఈ విధంగా యజ్ఞ ప్రశంసతో ప్రారంభింపబడిన ఈ వేదం యజ్ఞాన్ని జీవితంలోనికి అన్వయించుకోమంటుంది. యజ్ఞమయ జీవితం గడపమంటుంది. ఈ విషయాన్ని వివరించటానికే యాజ్ఞవల్క్య మహర్షి 14 కాండలుగల శతపథబ్రాహ్మణ మనే విశాలమైన గ్రంథాన్ని రచించారు. ఆయన 'దేవయాజి కన్న ఆత్మయాజి గొప్పవా' డన్నారు. మా ప్రచురణ **'అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము'** చదివితే మీకీ విషయం విశదమౌతుంది.

వేదాలలో ప్రతిపాదింపబడిన యజ్ఞాలను శ్రౌతయజ్ఞాలంటారు. ఇవి సుమారు 24 వరకు ఉన్నాయి. వీటిని హవిర్యజ్ఞ, సోమయజ్ఞ, పాకయజ్ఞాలుగా విభజించి వ్యవహరిస్తూ ఉంటారు. వీటిలో ముఖ్యమైనవి దర్శపౌర్ణమాసేష్టులు, సోమయాగ (వాజపేయ) రాజసూయ అశ్వమేధములు. దర్శేష్టి పితరుల (తల్లిదండ్రుల,పెద్దల) సంక్షేమం కొరకు ఉద్దేశించబడింది. ఇచట పితరు లంటే జీవించియున్న పితరుల కొరకే. చనిపోయిన వారిని పితరులనరు ప్రేత లంటారు. వారి గురించి మనం ఏమీ చేయలేము. పౌర్ణమాసేష్టి పుత్రుల ఉన్నతికొరకు చేయబడుతుంది. వారినెట్లా పెంచి పెద్ద చెయ్యాలి? ఏ విధంగా విద్యావంతలను, ధర్మాత్ములను చెయ్యాలి ? అనే విషయాలు సంకేత రూపంలో సూచింపబడతాయి.

మూలికలలో సోమలత రాజుగా ఉంటుందని (సోమ ఓషధీనామధిపతిః - అని) వేదం చెబుతుంది. ఇది బలాన్నిచ్చే గొప్ప ఔషధం. పర్యావరణ దోషాల కారణం కావచ్చు, చాలా కాలంగా ఈ మూలిక లభించటం లేదు. దీనికి ప్రత్యామ్నాయంగా తిప్పతీగతో ఈ యాగం జరిపించినట్లు మన గ్రంథాలలో కనబడుతుంది. సోమయాగంలో ప్రాతః సవన, మాధ్యందిన సవన, తృతీయ సవనము లని మూడు భాగాలుంటాయి. ఇవి మానవ జీవితంలోని మూడుకాలాలను సూచిస్తాయి. అవే బాల్య యౌవ్వన వార్ధక్యాలు. ఆ యా

కాలాలలో తీసుకోవలసిన జాగ్రత్తలు ఈ యజ్ఞం ద్వారా సూచింపబడతాయి. దీనిని వాజపేయయాగం అనికూడా అంటారు.

రాజసూయయాగం రాజ్యపట్టాభిషేక సమయంలో చేయబడుతుంది. దీనిలో రాజ్యపాలన ఏ విధంగా చేయాలో సూచింపబడుతుంది. రామాయణ మహాభారతాలలో రాజసూయయాగ వర్ణణలు కనబడతాయి. అశ్వమేధయాగం రాష్ట్రంయొక్క (దేశంయొక్క) సంక్షేమంకొరకు చేయబడుతుంది. రాజ్యపాలనలోని లోపాలను సరిచేసి సువ్యవస్థితం చేయటం, దుష్టుల దురాగతాల నణచటం, దేశాన్ని అన్నివిధాల పటిష్టం చేయటం ఈ యాగం యొక్క ముఖ్యోద్దేశ్యం.

ఇట్టి పవిత్రమైన, ఆదర్శవంతమైన యజ్ఞాలు మహాభారతయుద్ధం తరువాత వికృతరూపం ధరించాయి. దీనికి కారణం భారతయుద్ధంలో వీరులు, విద్యావంతులు పెక్కురు మరణించటం. తద్వారా విశుద్ధ వైదిక ధర్మాన్ని ప్రచారం చేసేవారు లేకపోవటం. దానితో వేదవిరుద్ధ తాంత్రిక మతాలు పుట్టాయి. మద్యమాంసభక్షణలు, వ్యభిచారం ధర్మంపేరుతో జరిగాయి. అవి క్రమంగా యజ్ఞయాగాదులలో ప్రవేశించాయి. సోమయాగం పేరుతో సురాపానం చేసేవారు. అజామేధం పేరుతో మేకలను చంపి మాంసాన్ని ఆహుతులుగా యిచ్చి ప్రసాదం పేరుతో మిగిలిన మాంసాన్ని తినేవారు. అశ్వమేధం పేరుతో గుఱ్ఱాలను చంపి మాంసాన్ని తినేవారు. ఇంతేగాక, అశ్వమేధం పేరుతో కొన్ని అసభ్యకర చేష్టలు చేసారు. ఈ దుశ్చేష్టలే బౌద్ధ జైన మతాలు పుట్టడానికి అవకాశం కల్పించాయి.

వేదాలలో యిట్టి హింసాపూరిత యజ్ఞాల ప్రసక్తి ఎక్కడా కనబడదు. దీనికి భిన్నంగా వేదం ఏ ప్రాణిని హింసించవద్దని స్పష్టంగా చెబుతుంది.

గాం మా హింసీః అవిర్ మా హింసీః అని ఉపదేశిస్తుంది.

వేదం యజ్ఞాన్ని అధ్వర మంటుంది.

**అగ్నేయం యజ్ఞమధ్వరం విశ్వతః పరిభూరసి ।**

**స ఇద్ దేవేషు గచ్ఛతి ॥ (ఋ. 1-1-4)**

ఓ ప్రకాశస్వరూప పరమేశ్వర ! ఏ అధ్వరరూపమైన యజ్ఞము (హింసారహిత యజ్ఞము) విశ్వమును చక్కగా ధరించుచున్నదో ఆ యజ్ఞమునే

విద్వాంసులు లోకములో విస్తరింపజేయుదురు గాక.

**దేవో దేవానామసి మిత్రో అద్భుతో**

**వసుర్వసూనామసి చారురధ్వరే । (ఋ. 1-94-13)**

అధ్వరము హింసారహిత యజ్ఞము. దేవతలకు దేవత. అద్భుత మిత్రుడు. వసువులకు వసువు. అత్యంత రమణీయమైనది.

యజ్ఞమును అధ్వరమనే మంత్రాలు వేదాలలో వందలకొలది ఉన్నాయి. అధ్వర మంటే ఏమిటో యాస్కమహర్షి తన నిరుక్తంలో ఈ విధంగా వివరించాడు.

**'అధ్వర ఇతి యజ్ఞనామ, ధ్వరతిర్హింసా కర్మా తత్ప్రతిషేధః'** (నిరుక్తు. 1-7)

అధ్వరం యజ్ఞానికి (అగ్నిహోత్రానికి) పర్యాయ పదం. హింసించే కర్మను ధ్వరతి అంటారు. అట్టి హింసను ఇది నిషేధిస్తున్నది. కనుక దీనికి అధ్వరమనే పేరు వచ్చింది.

ఇంత స్పష్టంగా మన వేద శాస్త్రాలు యజ్ఞాన్ని హింసారహిత కర్మయని కీర్తిస్తుండగా ఉవ్వట, మహీధరాది కొందరు వేదభాష్యకారులు యజ్ఞయాగాలలో పశుహింసను ప్రోత్సహించారు. ఈ మాటలనే పాశ్చాత్య వేదభాష్యకారు లనుకరించారు. దయానంద మహర్షి వచ్చేవరకు ఆ పాఖండం అట్లే కొనసాగింది.

వేదమంత్రాలలో గాయత్రీ మంత్రానికి ఒక విశిష్టస్థానం ఉంది. ఈ మంత్రం ముందుగా ఋగ్వేదం (3-62-10) లో కనబడుతుంది. యజుర్వేదంలో విశేషంగా నాలుగుచోట్ల కనబడుతుంది. అవి : 3-35, 22-9, 30-2, 36-3 అధ్యాయాలు. వీటిలో 36వ అధ్యాయంలోని మంత్రంలో 'భూర్భువః స్వః' అనే మహావ్యాహృతులు కూడా కలిసి ఉంటాయి. అందుచే అక్కడ అది గాయత్రీ ఛందస్సులోకాక దైవీబృహతీ చందస్సులో ఉంటుంది.

## గాయత్రీ మంత్రం

**ఓ3మ్ భూర్భువః స్వః । తత్సవితుర్వరేణ్యమ్**

**భర్గో దేవస్య ధీమహి ।**

**ధియో యోనః ప్రచోదయాత్ ॥ (యజు. 36-3)**

హే సర్వ సంరక్షక ! సచ్చిదానంద స్వరూపా ! తత్ పద వాచ్యుడవైన నీవు సృష్టికర్తవు. ప్రాణులందరిచేతను వరింపదగినవాడవు (కోరదగిన ఆనంద

స్వరూపుడవు). అట్టి నీ దివ్యగుణయుక్త భర్గః స్వరూపమును-సమస్త క్లేశములను, కష్టములను, బాధలను, భయములను నశింపజేయు శుద్ధస్వరూపమును ధ్యానింతుము గాక. నీవు మా బుద్ధిని వికసింపజేసి సత్కర్మలయందు ప్రేరేపింతువు గాక. మే మా బుద్ధి సహాయమున సద్వ్రతముల నాచరించి అభ్యుదయ నిఃశ్రేయసముల నొందుదుము గాక.

ఈ మంత్రంలో పరమేశ్వర స్వరూప స్తుతితోబాటు సద్బుద్ధి కొరకు ప్రార్థన ఉంది. బుద్ధి పరమేశ్వరుడు మానవుల కిచ్చిన ఒక గొప్ప వరం. ఆ బుద్ధితోనే మానవుడు పశుపక్ష్యాదులకన్న సుఖంగా ఎంతో ఉన్నతంగా జీవించగలుగుతున్నాడు. అట్టి బుద్ధిని ప్రతిదినం ఉదయ సాయం సమయాలలో ఈ గాయత్రీ మంత్ర జపధ్యానాలతో పదును పెట్టుకోవటం, పవిత్రం చేసుకోవటం మంచిది. తద్వారా మన కెంతో మేలు కలుగుతుంది.

ఈ మంత్రం సామవేదంలో కూడా కనబడుతుంది. అథర్వవేదంలో ఈ మంత్రమహిమ గానం చెయ్యబడింది. సృష్ట్యాది నుండి మహాభారత కాలం వరకు ఈ మంత్రాన్నే జపమంత్రంగా, గురుమంత్రంగా ఆర్యులంతా సంధ్యావందనంలో వీలైనన్ని ఎక్కువ పర్యాయాలు జపించేవారు.

ఇందలి 34వ అధ్యాయంలో శివసంకల్ప మంత్రాలు వస్తాయి. దీనిని కొందరు శివసంకల్పోపనిషత్తనికూడా అంటారు. మనస్సులో ఎప్పుడూ ఏదో ఒక ఆలోచన ఉంటూనే ఉంటుంది. వాటిలోని బలమైన ఆలోచనలు కార్యరూపం ధరిస్తాయి. అందుచే మనం ప్రయత్నపూర్వకంగా మనస్సుతో శివసంకల్పాలు - మంచి సంకల్పాలు చేయాలని ఈ మంత్రాలు బోధిస్తాయి. వీటిలో మనోవిజ్ఞానం కూడా ఉంది. ఇవి మనస్సు యొక్క గుణగణాలను కీర్తించి అట్టి నా మనస్సు శుభ సంకల్పములనే చేయును గాక (**తన్మే మనః శివసంకల్పమస్తు**) అని సంకల్పించ మంటాయి. వీటిని రాత్రి పరుండబోవు సమయంలో అర్థభావనతో పఠిస్తే దుఃస్వప్నాలు రాకుండా ఉంటాయి.

ఇదే 34వ అధ్యాయంలో ఉదయం నిద్రనుండి లేవగానే పఠించతగిన ప్రాతఃస్మరణ మంత్రాలు (34 నుండి 39 వరకు) ఉన్నాయి. వీటిలో పరమేశ్వరుని దివ్యగుణాలు కీర్తించబడ్డాయి. **'ప్రాతరగ్నిం ప్రాతరింద్రం హవామహే** - ఈ

ప్రాతఃకాలంలో నేను 'పరమేశ్వరుని ప్రకాశశక్తిని (జ్ఞానశక్తిని), ఐశ్వర్యశక్తిని (ఇంద్రశక్తిని) నా హృదయంలోకి ఆహ్వానిస్తున్నా'ననే భావంగల వాక్యాలతో ఈ మంత్రాలు ప్రారంభింప బడతాయి. ఈ మంత్రాలలో పరమేశ్వరుని పరమ ఐశ్వర్యవంతునిగా పేర్కొంటూ మమ్ముకూడా ఐశ్వర్యవంతులగుటకు ప్రేరేపింపుమనే ప్రార్థన ఉంది. ఈ మంత్రాల దేవత 'భగః' – ఐశ్వర్యం. అందుచే కొందరు వీటిని 'భగసూక్తం,' 'భాగ్యసూక్తం' అని కూడా అంటారు.

35 నుండి 39 వరకు గల అధ్యాయాలలో పితృమేధాది పాకయజ్ఞాల వర్ణన ఉంది. వీనిలో తల్లిదండ్రుల, పెద్దల సంక్షేమం కొరకు సూచనలు చేయబడతాయి. కేవలం యజ్ఞ విషయాలేకాక అనేక వృత్తుల వర్ణన యజుర్వేదంలో ఉంది. మానవులకు వృత్తిపరమైన జ్ఞానం యజుర్వేదంవల్లనే కలిగింది. వ్యవసాయం, గృహ నిర్మాణం, రథాల శకటాల నిర్మాణం మొదలైన ఎన్నో విషయాలు యజుర్వేదంలో ఉన్నాయి. వైద్యం, న్యాయం, రాజ్యపాలన, పశుపాలన మొదలైన సామాజిక ప్రయోజన కర్మలు ఈ వేదంలో ఉన్నాయి. మానవుడు సామాజిక ప్రాణి. ముఖ్యంగా కౌటుంబిక జీవితం గడిపేవాడు. అందుచే సామాజిక నియమాలను కౌటుంబిక నియమాలను కూడా ఈ వేదం ఉపదేశిస్తుంది.

యజుర్వేదం దుష్టశిక్షణ శిష్టరక్షణ చెయ్యమంటుంది. శత్రువులను చీల్చి చెండాడి ప్రజలను రక్షించమంటుంది. 16వ అధ్యాయం ఈ విషయాన్ని విశేషంగా చర్చిస్తుంది. లోకంలో ఈ అధ్యాయానికి రుద్రాధ్యాయ మనే పేరుంది. శివాలయాలలో దీనిని అభిషేకసమయంలో పారాయణ చేస్తుంటారు. కాని, ఇందులో వర్ణించబడిన రుద్రుడు పురాణ కల్పిత రుద్రుడు (శివుడు) కాదు. రుద్రుడంటే 'రుద–రోదనే' దుష్టులను దండించి దారిలోపెట్టే రాజు అని అర్థం. ఇట్టి రాజధర్మోపదేశం చేసే మంత్రాలు ఈ వేదంలో చాలానే ఉన్నాయి. అస్త్ర శస్త్ర విద్యలను తెలిపే ధనుర్వేదం యిట్టి మంత్రాలనుండే ఉద్భవించింది. ఈ వేదానికి ఉపవేదంగా ప్రసిద్ధిని పొందింది.

యజుర్వేదం కర్మకాండకు చెందిన వేదమే అయినా ఆధ్యాత్మిక విద్యలెన్నో దీనిలో ఉన్నాయి. సృష్టి విద్యతో బాటు పరమేశ్వర స్తుతిని (గుణగణాలను)

తెలిపే పురుషసూక్తం దీనిలో విశిష్టంగా ఉంటుంది. ముఖ్యంగా చివరి 40వ అధ్యాయం ఆధ్యాత్మిక విద్యల సారాంశం. ఇదే లోకంలో ఈశావాస్యోపనిషత్తుగా ప్రసిద్ధిని పొందింది. **'ఈశావాస్య మిదం సర్వం'** అంటూ ప్రారంభింపబడిన ఈ అధ్యాయం త్యాగానికి పెద్దపీట వేస్తుంది. ఈ జగత్తంతా పరమేశ్వరునిచే వ్యాప్తమైయుంది. ఇది పరమేశ్వరునిదికనుక త్యాగభావంతో (ఇది నాదికాదు అనే భావంతో) న్యాయంగా లభించిన భోగాల ననుభవించమంటుంది. **'వేదవిహిత కర్మలను చేసస్తూనే నూరేళ్ళు జీవించగోరుమంటుంది. కర్మబంధనాన్నుండి విడివడటానికి యిదొక్కటే మార్గం'** అంటుంది. అంటే సత్కర్మల ఫలాన్ని భగవంతున కర్పించి రాగరహితడవు కమ్మంటుంది.

దీనిలోని మొదటి రెండు మంత్రాల విస్తృత వ్యాఖ్యయే జగత్ప్రసిద్ధిని పొందిన భగవద్గీత. అది త్యాగానికి నిష్కామ కర్మయోగమని పేరు పెట్టింది. ఈ విషయం ముందు ప్రకరణాలలో తెలిసికొందాము.

## కృష్ణయజుర్వేదం

ఈ సందర్భంలో యజుర్వేదానికి చెందిన మరికొన్ని విషయాలు తెలుసుకోవటం అవసరం. మన దక్షిణభారతదేశంలో కృష్ణయజుర్వేద మనే పేరుతో తైత్తరీయశాఖ ఒకటి సంహితగా ప్రాచుర్యంలో ఉంది. దీనిని గురించి ఒక చారిత్రిక కథ చెప్పబడింది.

పరమేశ్వరుని ద్వారా వాయు ఋషికి లభించిన యజుర్వేదం అనుశృతంగా వేదవ్యాసుని కాలం వరకు కొనసాగింది. వ్యాసమహర్షి వద్ద వైశంపాయనుడు దీనిని నేర్చుకొన్నాడు. వైశంపాయనుని వద్ద కొంతమంది శిష్యులు చేరి అభ్యసించారు. వారిలో యాజ్ఞవల్కుడనే వ్యక్తి చాలా ప్రతిభాశాలి అనతికాలంలోనే ఆ వేదాన్ని నేర్చుకున్నాడు. కాని, ఏదో కారణంతో గురుశిష్యుల మధ్య వివాదమేర్పడింది. దానితో గురువు ఆగ్రహించి తానిచ్చిన విద్యను తనకిచ్చి పొమ్మన్నాడు. అభిమానియైన యాజ్ఞవల్క్యుడు తాను నేర్చినదంతా వమనము చేసెనట. దానిని తిత్తిరి పక్షులు తినినవట. అప్పటినుండి అది కృష్ణయజుర్వేదంగా లోకంలో ప్రాచుర్యం పొందెనట. బహుశః యాజ్ఞవల్క్యుడు

కొందరికి తాను నేర్చిన విద్యనునేర్పి వెళ్ళిపోయి ఉండవచ్చును. దానిని ఆలంకారికంగా యిక్కడ కక్కివేసినట్లుగా వర్ణించి యుందురు. ఏలయన 'ఆపస్తంభానుక్రమణిక' లో తిత్తిరి అను ఒక ఋషి పేరు ఉంది. ఇంతేగాక కృష్ణయజుర్వేదానికి గల శాఖలలో తైత్తరీయశాఖనే మిక్కిలిగా ప్రాచుర్యం పొందింది. కనుక యాజ్ఞవల్క్యఋషి దీనిని తిత్తిరిఋషికి నేర్పి అక్కడనుండి వెళ్ళిపోయి ఉండవచ్చును.

ఆ విధంగా యాజ్ఞవల్క్యుడు గరువును విడచి ఆదిత్య ఋషిని సేవించి ఆయన వద్ద మూలయజుర్వేదసంహిత నభ్యసించాడు. తాను నేర్చిన ఆ సంహితను శిష్యుల కుపదేశించసాగాడు. యాజ్ఞవల్క్యుని పూర్వులు అన్నదానం చేసి 'వాజసేని' అని బిరుదు పొందారట. వాజసనేయుడైన యాజ్ఞవల్క్యునిచే ప్రచారం చేయబడటంచేత దీనికి 'వాజసనేయ సంహిత' అనే పేరు వచ్చింది. ఇది ఆదిత్యఋషినుండి మధ్యాహ్నవేళలలో గ్రహింపబడటంచేత దీనికి 'మాధ్యందిన సంహిత' అనే మరొక పేరు వచ్చింది. ఇంతేగాక, దీనిలో కేవలం మూలమంత్రాలే ఉండటంవల్ల దీనికి శుక్లయజుర్వేదమని మరొక పేరు. శుక్లమంటే శుద్ధమైనది యని అర్థం. ఈ విధంగా యజుర్వేద మూలసంహిత – శుక్ల యజుర్వేదమనీ, మాధ్యందినశాఖ యనీ, వాజసనేయసంహితయనీ లోకంలో వ్యవహరింపబడుతూ వస్తున్నది. ఈ మూడూ వేరువేరు శాఖలు కాదు. ఒక్కదానికే మూడు పేర్లు. ఇది ఆదిత్యఋషినుండి వస్తూ ఉండటం వల్ల దీని ననుసరించేవారిని ఆదిత్యసాంప్రదాయంగా వ్యవహరించటం కూడా ఉంది. అందుచేతనే, శతపథ బ్రాహ్మణం – **'ఆదిత్యాని ఇమాని శుక్లాని యజూంషి వాజసనేయేన యాజ్ఞవల్క్యేన ఆఖ్యాయంతే"** అంటుంది.

వైశంపాయనుడు అర్థస్పష్టీకరణ కొరకు మూల సంహితలోని మంత్రాలకు బ్రాహ్మణ గ్రంథాలలోని వాక్యాలు జోడించి తన శిష్యులకు నేర్పటం జరిగి ఉండవచ్చు. లేదా తిత్తిరిఋషి ఆ పని చేసి యుండవచ్చు. కనుక యిది శాఖా గ్రంథమేకాని మూలసంహిత కాదు. కనుకనే దీనికి తైత్తరీయసంహిత యనే పేరు ఏర్పడింది. బ్రాహ్మణభాగ మిశ్రితమైనది కావటంచేత కృష్ణయజుర్వేదంగా ప్రాచర్యం పొందింది.

దీని ననుసరించేవారిని బ్రహ్మసాంప్రదాయంగా పిలిచారు. (కృష్ణ అంటే నలుపు అని అర్థం. మలినమైనదని కూడా అర్థం.)

ఏమైనను శుక్ల కృష్ణ సంహితలకు పెద్దగా భేదం లేదు. కృష్ణ యజుర్వేదంలోని బ్రాహ్మణ వాక్యాలను తొలగిస్తే రెండూ ఒకటే. క్రమంలో మాత్రం కొద్దిగా భేదం ఉంటుంది.

ఋగ్వేదంలో వలెనే యజుర్వేదంలో మంత్రార్థద్రష్టలైన స్త్రీ నామములు (ఋషికల పేర్లు) కొన్ని కనబడతాయి. ప్రాదురాక్షి, రమ్యాక్షి, లౌగాక్షి, లోపాముద్ర, సరస్వతీ, సర్పరాజీ, కద్రూ మొదలైనవారు విదుషీమణులేగాక యోగులు, తపస్వినులు, మంత్రార్థద్రష్టలు, వేద ప్రచారికలు.

"బ్రహ్మచర్యేణ కన్యా యువానాం విందతే పతిమ్' (అథర్వ. 11-5-18) - కన్యలు కన్యాగురుకులాలకు వెళ్ళి బ్రహ్మచర్యాన్ని పాటించి విద్యావంతులై యువావస్థను పొంది తన గుణ కర్మ స్వభావాలకు తగిన పతిని పొందాలని ఈ వాక్యాభిప్రాయం. అట్టి విద్యావంతులే ఋషికలు కాగలరు. బ్రహ్మవాదినులు కాగలరు. యజుర్వేదం స్త్రీని బ్రహ్మవాదినిగానేకాక యజ్ఞబ్రహ్మగా కూడా చేస్తుంది.

**చోదయత్రీ సూనృతానాం చేతన్తీ సుమతీనామ్ ।**
**యజ్ఞం దధే సరస్వతీ ॥ (యజు. 20-85)**

ఉత్తమ విద్యావతియగు స్త్రీ మంచివాక్కులతో ప్రజలను ధర్మమార్గమున ప్రేరేపిస్తూ యజ్ఞమును నిర్వహించాలి.

**మహో౨అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునా ।**
**ధియో విశ్వా విరాజతి ॥ (యజు. 20-86)**

స్త్రీ విదుషియై కవయిత్రియై ప్రజలను క్రాంతిమార్గమున ప్రేరేపిస్తూ విశ్వవందిత కావాలి.

ఇట్టివే స్త్రీప్రశంసా మంత్రాలు వేదాలలో చాలానే ఉన్నాయి. అందుచేతనే మనుమహర్షి -

**యత్ర నార్యస్తు పూజ్యంతే రమన్తే తత్ర దేవతాః ।**

యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః ॥

(మనుస్మృతి. 3-56)

"ఏ దేశములో (మానవ సమాజములో) స్త్రీలు పూజింపబడుదురో అచట దేవతలు (దివ్యగుణములుగల మానవులు) విహరించుచున్నారని గ్రహించండి. ఎచట నారీ సత్కారము జరుగదో (స్త్రీలు తగినవిధంగా గౌరవింపబడరో) అచట ఏ క్రియలు ఫలించవని తెలుసుకోం"డని ఉపదేశించాడు.

మన భారతీయ సంస్కృతిలోగల యిట్టి నారీసత్కారం మరే దేశ సంస్కృతిలోను కానరాదు.

ఇక మనం సామవేదం ఏమి చెబుతున్నదో తెలిసికొందాము.

## సామవేదం

సామవేదం ఉపసనాకాండను బోధిస్తుంది. ఉపాసన అంటే మనస్సును ప్రాపంచిక విషయ చింతనలనుండి మరలించి అంతర్ముఖం చేసి తనలో వ్యాపించి యున్న పరమాత్మతో సంయుక్తం చేయటం. ఆ విధంగా సంయుక్తం చేసి పరమేశ్వరుని స్తుతి ప్రార్థనలు చెయ్యాలి. పరమేశ్వరుని సచ్చిదానంద స్వరూపాన్ని ధ్యానం చెయ్యాలి. దానివల్ల మనస్సు నిర్మలమై ప్రసన్నమై అనిర్వచనీయమైన ఆనందం కలుగుతుంది. అందుకు సామవేద మంత్రాలు మార్గదర్శనం చేస్తాయి. మనస్సును ఉపాసనా మగ్నం చేయడానికి సహకరిస్తాయి.

దాదాపుగా ఈ వేదంలోని మంత్రాలన్నీ ఋగ్వేద మంత్రాలే. అయినప్పటికీ యివి గాన ప్రధానంగా ఉంటాయి. ఆ మంత్రాలకు అర్థాలు కూడా పరమేశ్వరపరంగానే చెప్పుకోవాలి. ఈ వేదం యొక్క సారమే ఉద్గీథము - ఓ3మ్ **(సామ్న ఉద్గీథో రసః)** అని చాంధోగ్యోపనిషత్తు చెబుతుంది. **'సా చ అనుశ్వేతి తత్ సామ్న సామత్వమ్'** - ఋక్‌లపై గాంధారాదిస్వరములు చేర్చినందున సామ మేర్పడుననియు, కనుక అది సామము అనగా గానము అని పిలువబడుననియు బృహదారణ్యా కోపనిషత్‌లో వివరింపబడింది. **'గీతీషు సామాఖ్యా'** గేయమంత్రాలకే సామమని పేరు వర్తిస్తుందని జైమిని మహర్షి అంటారు. ఒక్క సామవేదానికే వెయ్యి శాఖలున్నట్లు మన శాస్త్రాలలో కనబడుతుంది. అంటే ప్రాచీనకాలంలో సామవేదాన్ని వెయ్యి రకాలుగా గానం

నేసేవారని తెలుస్తున్నది. దీనిలో 1875 మంత్రాలున్నాయి. ఇవి పూర్వార్చిక, ఉత్తరార్చిక ములుగా విభజింపబడ్డాయి. పూర్వార్చకములో 6 ప్రపాఠకములు, ఉత్తరార్చ కములో 9 ప్రపాఠకములు ఉన్నాయి.

సామగానం భక్తుల నానంద పరవశులను చేస్తుంది. సంగీత శాస్త్రమంతా సామవేదంలోనుండే వచ్చింది. నారదీయ శిక్ష అనే సంగీత శాస్త్రంలో సామవేదాన్ని గానంచేసే అనేక రీతులు చెప్పబడ్డాయి. సామ సప్తస్వరాలు వేణుగానంలో వరుసగా 'మ గ రి స ని ధ ప' అనే స్వరాలకు సరిపోతాయి. నేడు సామగానంపై పరిశోధనలు జరుగుతున్నాయి. సామగానంతో రోగాలు పోతున్నాయనీ, వాతావరణంలో ఆరోగ్యకరమైన మార్పులు వస్తున్నాయనీ చెబుతున్నారు.

పూర్వకాలంలో యజ్ఞయాగాదులలో సోమపానం, సామగానం తప్పక ఉండేవట. సోమలతను గురించి శాస్త్రాలలో చాలా విశేషంగా చెప్పబడింది. కాని, అది యిప్పుడు లభించటం లేదు. ఇక సామగానం- ప్రస్తుతం సామ విద్వాంసులు కొద్దిమందే ఉన్నారు. వారిని రక్షించుకొని వారిద్వారా ఈ విద్యను ప్రచారంలోకి తెస్తే ఎంతో బాగుంటుంది. మన ఆదర్శ పురుషుడు శ్రీకృష్ణుడు వేణువుపై సామము నాలాపించి అందరినీ సమ్మోహపరచేవాడట. సామవేద మంత్రాలన్నీ ఉపాసనా పరంగా చెప్పబడినా వాటికి భౌతిక పక్షంగా అర్థాలు చెప్పుకొని భౌతిక సామాజిక విజ్ఞానాలను పొందవచ్చు.

## అథర్వవేదం

వేదచతుష్టయంలో చివరిది అథర్వవేదం. థర్వ అంటే చలించేదని అర్థం. అందుచే అథర్వ అంటే 'చలించనిది - కదలనిది - మార్పు చెందనిది' అని అర్థం వస్తుంది. అటువంటి పదార్థం కేవలం పరమేశ్వరుడే. అట్టి పరమేశ్వరుని ఈ వేదం స్కంభ, ఉచ్ఛిష్ట, ఓదన మొదలగు పేర్లతో పేర్కొంటూ అట్టి దేవుని స్వరూపాన్నీ, గుణకర్మలను వివరిస్తుంది. అందుచే దీనికి 'బ్రహ్మవేద' మని మరొక పేరు. సాంప్రదాయక యజ్ఞ యాగాది క్రతవులలో ఋక్ యజు సామవేదములతోబాటు అథర్వవేదంకూడా చదువుకున్న వారినే బ్రహ్మగా - అధ్యక్షునిగా ఎన్నుకునే వారట. దీనిలో 20 కాండలు, 732 సూక్తాలు, 5,977 మంత్రాలు ఉన్నాయి. ఋగ్వేదం తరువాత యిదే పెద్ద వేదం. ఇందులో 1200 వరకు ఋగ్వేద మంత్రాలే ఉన్నాయి.

ఇది బ్రహ్మ పదార్థాన్ని వివరించటమే కాక ఎన్నో విజ్ఞాన విషయాలను కూడా వివరిస్తుంది. అందుచే ఈ వేదాన్ని విజ్ఞానకాండగా పేర్కొంటారు. అనేక రకాల వాహనాల, యంత్రాల నిర్మాణం గురించి ఈ వేదంలో సూత్రప్రాయంగా చెప్పబడింది. మొదటి తొమ్మిది కాండలలోను భైషజ్య సూక్తాలు చాలా కనబడతాయి. శరీర నిర్మాణ శాస్త్రం (అనాటమీ), శరీర ధర్మశాస్త్రం (ఫిజియాలజీ), మూలికల గుణధర్మాలు, వివిధ వ్యాధుల చికిత్స ఈ వేదంలో ఉన్నాయి. క్షయ, కుష్టు, ఉబ్బసము, వివిధ జ్వరాలు మొదలగు వాటికి ఔషధ ప్రక్రియలు చెప్పబడ్డాయి. దీనిలో రోగ నిదానము, రోగకారణాలు కూడా వర్ణింపబడ్డాయి. క్రిములు రోగవ్యాప్తికి మూలమనీ, వైద్యులు అట్టి రోగ క్రిములను సంహరించే మందులతో చికిత్స చెయ్యాలనీ చెప్పబడింది. సూర్యకిరణ ప్రసార మారోగ్యకరమనీ, జలచికత్సలు రోగనివారణ కుపకరిస్తాయనీ, ప్రాణాయామాది క్రియలు ఆరోగ్యవర్ధకాలనీ సూచింపబడ్డాయి. శల్య శస్త్ర చికిత్సలు, దంత నేత్ర నాసికా చికిత్సలు వర్ణింపబడ్డాయి. సృష్ట్యాదిలో ఆవిర్భవించిన వేదాలలో యింతటి జ్ఞాన విజ్ఞాన విషయాలుండటం చూస్తే సంభ్రమాశ్చర్యాలు కలుగుతాయి.

అథర్వవేదంలో చికిత్సా విషయా లెన్నో ఉండటంవల్ల ఈ వేదానికి భిషగ్వేదమనే పేరుకూడా ఉంది. ఆయుర్వేదానికి ఈ అథర్వవేదమే మూలమని

కొందరంటారు. చికిత్సా విషయాలతోబాటు ఈ వేదంలో కృత్యా - అభిచార ప్రయోగాలు, శకున విచారాలు ఉండటం వల్ల భూతప్రేతవిద్యలు, మంత్ర తంత్రాలు ఉన్నాయని కొందరనుకుంటారు. కాని, అవి అన్నీ శత్రుసంహారక యుద్ధ విద్యలు మాత్రమే . ఈ విషయం వివరంగా తెలుసుకోగోరువారు స్వామి బ్రహ్మమునిగారు వ్రాసిన అథర్వవేదీయ మంత్రవిద్య, చికిత్సా శాస్త్రాలు చదువగోరుచున్నాము.

దేశశాంతికి, రాష్ట్రరక్షణకు, రాజ్యాభివృద్ధికి, రాజ్యహితమునకు కావలసిన శాంతి పౌష్టిక క్రియలు ఇందులో వర్ణింపబడ్డాయి. రాష్ట్రీయత, సామ్రాజ్య నిర్మాణం, దాని రక్షణ, సార్వభౌమిక చక్రవర్తిరాజ్య స్థాపన, రాజసూయం మొదలైన విషయాలను ఈ వేదం ప్రతిపాదిస్తుంది. అందుచేతనే రాజపురోహితులు విధిగా ఈ వేదం అధ్యయనం చేసి యుండాలని చెప్పబడింది. దేశభక్తిని దేశ సంక్షేమాన్ని తెలిపే పృథివీసూక్తం, గోభక్తిని గోవైశిష్ట్యాన్ని తెలిపే గోసూక్తం ఈ వేదంలో ఉన్నాయి. ఋగ్వేదంవలెనే ఈ వేదం స్త్రీలకు ఉన్నతస్థానం యిస్తుంది. వివాహ సంస్కారంలోని అనేక మంత్రాలు ఈ వేదంనుండి సేకరింపబడినవే.

అథర్వవేదం బ్రహ్మచర్య వైశిష్ట్యాన్ని కొనియాడుతుంది. బ్రహ్మచర్యాన్ని పాటించి మృత్యుంజయులు కమ్మంటుంది. లోకంలో వ్యవహరింపబడే 28 నక్షత్రాల పేర్లు నక్షత్ర సూక్తంలో కనబడతాయి. అవన్నీ కల్యాణకరములేననీ చెప్పబడింది. ఏ ఒక్క నక్షత్రం కీడుచేసేది లేదనీ స్పష్టంగా చెప్పబడింది. కాలం యొక్క విశిష్టతను తెలిపే కాలసూక్తాలు రెండు (19-53, 54) 19వ కాండంలో కనబడతాయి. దర్శన ఉపనిషదాదులకు మూలమనదగిన మంత్రా లెన్నో అథర్వవేదంలో ఉన్నాయి.

స్కంభ, ఉచ్ఛిష్ట, ఓదనాది సూక్తాలలో పరమేశ్వర స్వరూపం విశేషంగా వర్ణింపబడింది. స్కంభ మంటే ఆధారమని అర్థం. సమస్త చరాచర విశ్వానికి పరమేశ్వరుడే ఆధారం కనుక పరమేశ్వరునకు స్కంభమని పేరు. ఉచ్ఛిష్ట మంటే 'మిగిలి ఉండునది - శేషించనది' అని అర్థం. విశ్వమెంత ఆక్రమించినా యింకను మిగిలి ఉండునదే పరబ్రహ్మము. కనుక దానికి ఉచ్ఛిష్టమని పేరు. ఈ విధంగా బ్రహ్మపదార్థాన్ని గురించి విశేషంగా చెప్పబడటం వల్ల ఈ

వేదానికి బ్రహ్మవేదమని మరొక పేరు.

ఋగ్వేద దశమ మండలములోని యమ-యమీ సూక్తం మరల ఈ వేదంలో 18వ కాండలో కనబడుతుంది. దీనిలో రెండుమంత్రాలు ఎక్కువగాను, కొన్ని, భేదాలతోను ఉంది.

ఈ విధంగా వేదాలనుగురించి ఎంత వ్రాసినా అల్పమే. ఇక మనం వేదాల వైశిష్ట్యాన్ని తెలుసుకుందాము.

## వేదాల వైశిష్ట్యం

భారతీయులకు వేదం పరమ ప్రమాణం. ఇది దైవవాణి. మానవ మేధస్సునకు ఆదిమ స్రోతస్సు. మానవజాతి కిది మొదటి పాఠ్యగ్రంథం. మానవుని సర్వతోముఖాభివృద్ధికి కావలసిన సర్వవిషయాలు ఇందులో బీజరూపంలో ఉన్నాయి. వేదాలు సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సృష్టికర్తయు నైన పరమేశ్వరుని నుండి ఆవిర్భవించాయి.

అందుచేతనే ఆది శంకరాచార్యులవారు :

> **ఋగ్వేదాదేః శాస్త్రస్యానేక విద్యాస్థానోపబృంహితస్య ప్రదీపవత్**
> **సర్వార్థావద్యోతినః సర్వజ్ఞ కల్పస్య యోనిః కారణం బ్రహ్మ ।**
> **న హీదృశస్యర్గ్వేదాది లక్షణస్య సర్వజ్ఞగుణాన్వితస్య**
> **సర్వజ్ఞాదన్యతః సంభవోఽస్తి ॥ అని అంటారు.**

సాయణాచార్యులవారు వేదాలకు భాష్యం వ్రాస్తూ - దృష్టాదృష్టములైన అభీష్ట ఫలముల నందుకోవడానికీ, కష్టాలను దూరం చేసుకోవడానికీ కావలసిన ఉపాయాలను తెలిపేదే వేదం **దృష్టప్రాప్త్యనిష్ట పరిహారయో రలౌకిక ముపాయం యో గ్రంథో వేదయతి స వేదః** అని వ్రాసారు. ఇంతేగాక, ప్రత్యక్షంగా చూచిగాని, అనుమానంచే ఊహించిగాని తెలుసుకోలేని సృష్టిరచన, ఆది మానవసృష్టి, వేదోత్పత్తి మొదలైన విషయాలు వేదం ద్వారానే తెలియబడుతున్నాయి-**ప్రత్యక్షేనాను మిత్యావా యస్తూపాయో న విద్యతే । ఏవం విందంతి వేదేన తస్మాద్ వేదస్య వేదతా ॥** యని అంటారు. మన ప్రాచీన ఋషులు, మునులు వ్రాసిన గ్రంథాలన్నిటిలోను వేదాల వైశిష్ట్యం మరెంతగానో కొనియాడబడింది.

మధ్యకాలంలో మనదేశాన్ని విదేశీయులు పాలించే సమయంలో మన వేదాలను కించపరచాలనీ, నశింపచేయాలనీ చాలా ప్రయత్నాలు జరిగాయి. కాని, మహర్షి దయానందులవారి సింహగర్జనతో వారి తర్కం ముందు నిలువలేక వేదాల గొప్పతనాన్ని అంగీకరించటమేగాక వేద వైశిష్ట్యాన్ని ఆధునిక దేశ విదేశ ఆచార్యులంతా కొనియాడారు. ప్రపంచ గ్రంథాలయంలో వేదాలే ప్రాచీనతమ గ్రంథాలనీ, జ్ఞాన విజ్ఞానపూర్ణాలనీ అంగీకరించారు.

ఆదిమ స్మృతికర్తయైన మను మహర్షి **'వేదోఽఖిలో ధర్మమూలం' (1-63)** - వర్ణాశ్రమ ధర్మాలన్నింటికి వేదమే మూలమంటారు. **'సర్వజ్ఞానమయోహి వేదః'** సర్వ జ్ఞాన విజ్ఞానాలకు మూలం వేదమే నంటారు.

**'ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శృతిః" (2-13)**

ధర్మాధర్మ జిజ్ఞాస కలిగినపుడు వేదమే పరమ ప్రామాణమంటారు.

దర్శన ఉపనిషదాది కర్తలైన ఋషులంతా ఈశ్వరీయ జ్ఞానం కావటంవల్ల వేదమే పరమ ప్రమాణమనీ, అట్టి వేదానికి అనుకూలమైనంత వరకే మా రచనలు ప్రమాణమనీ తమ తమ గ్రంథాలలో వ్రాసుకున్నారు. ఇంతేగాక, ఏదైనా విషయంలో శృతి స్మృతులలో భిన్నత కనబడితే అంటే వేదాలలో ఒక రకంగా ఋషుల గ్రంథాలలో మరొకరకంగా కనబడితే **'శృతి స్మృతి విరోధేతు శృతిరేవ గరీయసీ'** - వేదోపదేశాలే గ్రహించా లన్నారు. ఈ విధంగా అన్ని విషయాలలోను వేదమే పరమ ప్రమాణంగా స్వీకరించారు.

ఆధునికులలో వేదాల వైశిష్ట్యాన్ని ప్రప్రథమంగా గుర్తించినవారు మహర్షి దయానంద సరస్వతి. వేదప్రచారం లుప్తమైపోతున్న సమయంలో ఆయన వాటిని పునరుద్ధరించి మన కందించారు. ఆ మహాపురుషుని కృషివలననే నేడు మనం ఈశ్వరవాణియైన వేదాన్ని వినగలుగుతున్నాం, చదువగలుగుతున్నాం. ఆయన మార్గదర్శనంలో ఎందరెందరో ఆర్యవిద్వాంసులు వేదప్రచారం కోసం తమ తను మనో ధనముల నంకితం చేసారు. పండిత శ్రీపాద దామోదర సాత్వలేకర్ గారు 'వేద స్వాధ్యాయ మండలి' అనే పేరుతో ఒక సంస్థను స్థాపించి తమ జీవితమంతా వేదప్రచారానికే అంకితం చేసారు. యోగి అరవిందులు కూడా 'వైదిక మేగ్‌జైన్' అనే పేరుతో ఒక పత్రికను నడిపి

ఆంగ్ల భాషలో వేదప్రచారం చేసారు.

విదేశీయులైన ప్రొ. విల్సన్, ప్రొ. బ్లూంఫీల్డు, ప్రొ. హేరేన్ ప్రొ. మాక్స్ ముల్లర్ మొదలైన సంస్కృత పండితులు కొందరు అరకొరగా వేదాల వైశిష్ట్యాన్ని కొంత గ్రహించారుకానీ ఎవ్వరూ వాటి యథార్థ స్వరూపాన్ని గ్రహించలేకపోయారు. ప్రొ.మాక్స్ ముల్లర్ పండితుడు మహర్షి దయానందుని వేదభాష్యం చదివిన తరుపరి వేదాల ఔన్నత్యాన్ని అంగీకరించి ఈ విధంగా వ్రాసారు.

" If there is a God who has created heaven and earth, it will be unjust on His part if He deprived millions of souls from before Moses of his divine knowledge. Reason and comparative study of religion declare that god gave his divine knowledge to mankind from his first appearance on Earth.

The great seers of India had firm belief that Vedas are the only divine revelation which god gave to mankind for it welfare at the time of creation. Western scholars also admit that Vedas are the oldest books in the library of the World.

The Vedas are an encylopdia dealing with every aspect of life and culture, religion, mysticim, sciences, metaphysics, cosmology, Sociology etc. The light which they emanate still enlightens us. All the mantras of the Vedas are not abtruse and difficult to understand. Some of them are so simple and easy to understand that persons with very little knowledge of sanskrit can understand their meanings and significance without any difficulty.

అనగా - ఒకవేళ దేవుడు ఉండి ఈ భూలోక ద్యులోకాలను నిర్మించినట్లయితే, మూసా కన్న పూర్వం జన్మించిన మిలియన్ల కొలది

మానవులకు తన దివ్యజ్ఞానం యివ్వకుండా అన్యాయం చేసినట్లే అవుతుంది. తర్కంతోను, వివిధ మతాల అభిప్రాయలతోను సరిపోల్చి చూచినట్లయితే పరమేశ్వరుడు తన దివ్యజ్ఞానాన్ని (ఉపదేశాలను) ఈ భూమిపై మానవజాతి ఆవిర్భవించినపుడే యిచ్చి ఉండాలి.

భారతీయ మహర్షుల గట్టి నమ్మకమేమంటే ఆదిమానవసృష్టి జరిగినపుడే పరమేశ్వరుడు తన దివ్య జ్ఞానాన్ని మానవుల కిచ్చాడని. ప్రపంచ గ్రంథాలయంలో వేదాలే ప్రాచీనతమ గ్రంథాలని పాశ్చాత్య విద్వాంసులు కూడా అంగీకరిస్తారు.

వేదాలు బృహత్ విశ్వకోశాలు. వాటిలో మానవుల కవసరమైన జీవనవిధానము, సంస్కృతీ సభ్యతలు చెప్పబడ్డాయి. ధర్మము, ధ్యానయోగ సాధనలు, వివిధ విజ్ఞాన విషయాలు, భౌతిక నియమాలు, గ్రహ నక్షత్రాల విజ్ఞానం, సామాజిక నియమాలు మొదలైన విషయాలెన్నో ఉపదేశింపబడ్డాయి. ఆ విజ్ఞానప్రకాశం నేటికీ మనకు మార్గదర్శనం చేస్తున్నది. వేదాలలోని మంత్రాలన్నీ నిగూఢమైనవీ, అర్థంచేసుకోలేనివీ కావు. కొన్ని మంత్రాలు ఎంత సరళంగా సుబోధకంగా ఉంటాయంటే ఏ కొద్దిపాటి సంస్కృతజ్ఞానం కలిగినవారైనా తేలికగా చదివి అర్థం చేసుకోగలిగేవిగా ఉంటాయి.

మాక్స్‌ముల్లర్ పండితుని పై వ్యాక్యములు **"విజ్ఞానవము మరియు మతము"** అను పుస్తకమునుండి గ్రహింపబడినవి. పరమేశ్వరుడు తానివ్వదలచిన జ్ఞానాన్ని ప్రథమ మానవ సృష్టి సమయంలోనే యిచ్చి ఉండాలి. ఆ విధంగాకాక కాలాంతరంలో యిస్తే అంతకు ముందు జన్మించిన వారికి అన్యాయం చేసినట్లవుతుంది. ప్రపంచ మతాల చరిత్రను పరిశీలిస్తే క్రైస్తవ మతం పుట్టి 2006 సంవత్సరాలయ్యింది. ఏసుక్రీస్తుకన్న వారి పూర్వ చరిత్ర మరొక 2000 సంవత్సరాలు ప్రాతది. అంతాకలిస్తే 4000 సంవత్సరాలుంటుంది. మహ్మదీయుల చరిత్ర 1400 సంవత్సరాల ప్రాతది మాత్రమే. వైజ్ఞానికులు ఈ భూమిపై మానవులు కొన్ని కోట్ల సంవత్సరాలుగా ఉంటున్నట్లు చెబుతున్నారు. ఈ తర్కంతో ఆలోచిస్తే బైబిలు, ఖురానులు ఈశ్వరున్నుండి లభించినవి కావు. అవి కేవలం ప్రవక్తల ఉపదేశాలు మాత్రమే.

ఈశ్వరీయజ్ఞానం ఏదైనా ఒక ప్రాంతీయ భాషలో చెప్పియున్నట్లయితే అది ఆ ప్రాంతీయులకు తేలికగా అర్థమౌతుంది. మిగిలినవారు అర్థం చేసుకోవడానికి చాలా పరిశ్రమ చెయ్యవలసి ఉంటుంది. దానితో దేవుడు పక్షపాతి అవుతాడు. వేదం ఆ విధంగా ఒక ప్రాంతీయ భాషలోకాక సర్వభాషా జననియైన సంస్కృతభాషలో చెప్పిబడింది. అందువల్ల అందరూ సమాన పరిశ్రమతో దానిని అర్థం చేసుకుంటారు.

వేదాలు సృష్టికర్తయొక్క రచనలు కనుక అందు సృష్టినియమాలన్నీ యథాతథంగా చెప్పబడ్డాయి. మిగిలిన ధర్మగ్రంథాలలో సృష్టినియమాలకు విరుద్ధమైన ప్రసంగాలెన్నో మనకు కనబడతాయి. ఇంతేగాక, పరమతద్వేషాన్ని రెచ్చగొట్టే ఒక్క మాటయు వేదాలలో కనబడదు. పరస్పర మైత్రిని ప్రోత్సహించే మాటలే అంతటా కనబడతాయి.

పరమేశ్వరీయజ్ఞానంలో మానవుల కవసరమైన అన్ని విద్యలు ఉండాలి. అభ్యున్నతికేకాక నిఃశ్రేయసానికి (సమస్త దుఃఖ నివృత్తికి – ముక్తికి) అవసరమైన జ్ఞానం కూడా ఉండాలి. అట్టి సర్వ శుభలక్షణాలు మనకు వేదంలోనే కనబడతాయి. మిగతా ధర్మగ్రంథాలలో అవి కానరావు. కనుక వేదమే పరమేశ్వరీయ జ్ఞానమని అంగీకరించక తప్పదు. మనమంతా అట్టి వేదమతానికి చెందిన ఆర్యులం. అందుకు మనమెంతో స్వాభిమానం కలిగి ఉండాలి.

# శాఖలు, బ్రాహ్మణ అరణ్యకాలు

ప్రాచీన ఋషులు పరమేశ్వరీయ జ్ఞానమైన వేదాలను రక్షించి ముందు తరాలకు అందివ్వటానికి చాలా కృషిచేసారు. ఒక్కొక్క ఋషి వేరువేరుగా శిష్యగణాల నేర్పాటుచేసుకొని శిష్యులచే వేదాలను వల్లింప చేసారు. శిష్యులు వారి వారి యోగ్యతానుసారం ఒక వేదం లేదా రెండు వేదాలు లేదా మూడు నాలుగు వేదాలు కంఠస్థం చేసేవారు. వారు కంఠస్థం చేసినదానిని బట్టి ఋగ్వేదీ, యజుర్వేదీ, సామవేదీ, అథర్వవేదీ, ద్వివేదీ, త్రివేదీ, చతుర్వేదీ అనే ఉపాధితో పిలిచేవారు. వారు తమ పిల్లల చేత, విద్యార్థులచేత వారు నేర్చుకున్న వేదాన్ని కంఠస్థం చేయిస్తూ ముందు తరాలకు అందిస్తూ వచ్చారు. అందుచే ద్వివేదీ, త్రివేదీ అనే ఉపాధులు యింటిపేర్లుగా రూపుదిద్దుకున్నాయి. బహుశః గోత్రాలు కూడా శాఖా ప్రవర్తకుల పేర్లతోనే ఏర్పడి ఉండవచ్చు.

దీనితోబాటు ఏ ఆది ఋషివద్ద వారు ఆ వేదాన్ని నేర్చుకుంటూ వచ్చారో ఆ ఋషి పేరుతోనే వారు నేర్చుకున్న దానికి 'శాఖ' అని పేరుపెట్టారు. ఉదా: శాఖలశాఖ, వాష్కలశాఖ, ఆశ్వలాయనశాఖ మొదలైనవి. ప్రాచీన కాలంలో యిట్టివి వేలకొలది శాఖలుండేవి. ఒక ప్రాచీన గ్రంథంలో ఆ ఋషికాలం నాటికి 1131 శాఖలున్నట్లు వ్రాసారు.

**"ఏకశతమధ్వర్యుశాఖా, సహస్రవర్త్మా సామవేదః,**
**ఏకవింశతి బాహ్వృచమ్, నవధా ఽ థర్వణో వేదః"**

అధ్వర్యుశాఖ లంటే యజుర్వేద శాఖలు. ఇవి -101, సామవేద శాఖలు - 1000, ఋగ్వేద శాఖలు -21, అథర్వవేద శాఖలు - 9, మొత్తం వేదశాఖలు - 1131.

అయితే ఈ పై గణనలో మూలసంహితులు నాలుగుకూడ కలిసి ఉన్నాయి. కనుక మూల సంహితలను వేరుచేస్తే యజుర్వేదానికి-100, సామవేదానికి 999, ఋగ్వేదానికి -20, అథర్వవేదానికి - 8. మొత్తం 1127 శాఖలు. పూర్వం యిన్ని శాఖలుండేవి. కాని నేడు కొన్ని శాఖలు మాత్రమే లభిస్తున్నాయి.

మూలసంహితలకు శాఖలకు కొన్ని తేడాలుంటాయి. మూల సంహితలు

పరమేశ్వరుని ఉపదేశాలు. శాఖగ్రంథాలు ఋషుల రచనలు. శాఖగ్రంథాలలో బ్రాహ్మణగ్రంథాలలోని వాక్యాలు, మరికొన్ని వాక్యాలు కలిసి ఉంటాయి. ఉదాహరణకు యజుర్వేదానికి నేడు 5 శాఖలు లభిస్తున్నాయి. వాటిలో శుక్ల యజుర్వేదానికి – 2 (మాధ్యందిన శాఖ, కణ్వశాఖ) ; కృష్ణ యజుర్వేదానికి - 3 (తైత్తరీయ, కఠ, మైత్రాయిణీ శాఖలు). ఈ ఐదింటిలో మాధ్యందినశాఖ మాత్రమే మూలసంహిత. (ఈశ్వరీయ సంహిత). నేడు కృష్ణయజుర్వేదంగా ప్రాచుర్యం పొందినది తైత్తరీయ శాఖనే. దీనిలో మూలసంహితతోబాటు బ్రాహ్మణవాక్యాలు కలిసి ఉన్నాయి. కనుక యిది ప్రామాణికం కాదు. అట్లే ఋగ్వేదానికి చెందిన శాఖలలో – శాకల శాఖ, సామవేద శాఖలలో - కౌథుమీశాఖ, అథర్వవేదశాఖలలో – శౌనక శాఖ మూలసంహితలు (ఈశ్వరీయములు). మిగిలినవి ఋషి కృతములు.

మధ్యకాలంలో మూల సంహితలనుకూడా శాఖలనే పేరుతో వ్యవహరించారు. దానితో మూలసంహిత లేవో తెలుసుకొనుటకు వివేచించవలసి వస్తున్నది. శాఖలెన్ని ఉన్నా ఏదైనా విషయంపై చర్చ వచ్చినపుడు మూలసంహితలే అనగా ఋగ్వేద యజుర్వేద సామవేద అథర్వవేద సంహితలే పరమప్రమాణాలుగా అంగీకరించాలని ఋషులంతా ఏకగ్రీవంగా నిర్ణయించారు. శాఖలను ప్రారంభించిన ఋషులు వారివారి అభిరుచి కనుగుణమైన విషయాన్ని తీసుకొని అందుకు అనుకూలంగా వేదమంత్రాలను వారి కనుకూలమైన క్రమంలో అమర్చుకొని విద్యార్థులకు వాటిని బోధించారు. అందుచేతనే శాఖలలో పాఠంలోను వరుస క్రమంలోను భేదాలు కనబడతాయి.

## బ్రాహ్మణములు

బ్రహ్మగురించి వ్యాఖ్యానించే గ్రంథాలను బ్రాహ్మణము లంటారు. ఇచట బ్రహ్మ అంటే పరమేశ్వరుడనికాదు. గొప్పదైన పరమేశ్వరీయ జ్ఞానమని (వేదములని) అర్థం. ఇవి ముఖ్యంగా అగ్నిహోత్ర ప్రక్రియను వివరించే గ్రంథాలు. వీనిలో విధి, అర్థవాదము, ఉపనిషత్తు అను మూడు భాగాలుంటాయి. విధిలో ఏఏ యజ్ఞాలు ఏ విధంగా చెయ్యాలో చెప్పబడింది. అర్థవాదంలో వాటిని ఆ విధంగా ఎందుకు చెయ్యాలో వివరించబడింది. ఆత్మ పరమాత్మల తత్వాన్ని

బోధించే భాగానికి ఉపనిషత్ అని పేరు. వీటిలో కొన్ని వైజ్ఞానిక విషయాలు, కొన్ని చారిత్రిక విషయాలు కూడా ఉన్నాయి. అక్కడక్కడ కొన్ని కథలు, కల్పనలు కనబడతాయి. ఈ కథల వెనుక ఒక ఆధ్యాత్మిక సందేశం ఉంటుంది. కథలను, కథానికలను యథాతథముగాకాక ఆలోచించి అర్థం చేసుకోవాలి.

బ్రాహ్మణాలలో ఋగ్వేదానికి - ఐతరేయము, యజుర్వేదానికి - శతపథము, సామవేదానికి - సామవిధానము మరియు తాండ్యబ్రహ్మణము, అథర్వవేదానికి - గోపథము ముఖ్యమైనవి.

శుక్లయజుర్వేదానికి చెందిన బ్రాహ్మణాలలో శతపథబ్రాహ్మణం చాలా విశాలమైనది, విశిష్ట మైనదికూడా. ఈ బ్రాహ్మణంలో దర్శపౌర్ణమాసేష్టి మొదలు అశ్వమేధ పర్యంతం గల శ్రౌతయజ్ఞాల వర్ణన ఉంది. యజుర్వేదంలో బీజరూపంలో ఉన్న వివిధ యజ్ఞాల విధివిధానాలు ఈ బ్రాహ్మణం వివరిస్తుంది. ఇంతేగాక, యజ్ఞంయొక్క ముఖ్యోద్దేశ్యం ఆత్మసంస్కరణ మంటుంది. దేవయాజికన్న ఆత్మయాజియే గొప్పవాడంటుంది. అగ్నిని ఆత్మలో ధరించి అమరులు కమ్మంటుంది. దీని భావమేమంటే - నిత్యం ఉదయ సాయం సమయాలలో దైనిక అగ్నిహోత్రం చేస్తూ వాతావరణాన్ని శుద్ధం చేస్తూ ఉండాలి. దానితోపాటు అగ్నిహోత్రంవలె పరోపకారం చేస్తూ యజ్ఞమయ జీవితం గడపాలి. తద్వారా ఆత్మసంస్కరణ (ఆత్మశుద్ధి) చేసుకోవాలి. ఈ విషయం వివరంగా తెలిసికోగోరువారు మాచే ప్రచురింపబడిన **"అగ్నిహోత్ర - ఆధ్యాత్మిక స్వరూపం"** అనే పుస్తకం చదువగోరుచున్నాము.

శతపథబ్రాహ్మణంలో ఇతిహాస కథలుకూడా ఉన్నాయి. దుష్యంతుడు, భరతుడు, ఉద్దాలకుడు, అరుణి మున్నగువారి కథలతో బాటు అంతకుముందు జరిగిన జలప్రళయాన్ని గురించిన, వైవస్వత మనువును గురించిన వర్ణనలున్నాయి.

బ్రాహ్మణాలలో యజ్ఞయాగాదులే ప్రధానంగా వర్ణింపబడినప్పటికీ ప్రాసంగికంగా ఎన్నో చారిత్రిక విషయాలు, విజ్ఞాన విషయాలు, వ్యాకరణ విషయాలు, వైద్యవిషయాలు వస్తాయి. 'వృష్టికామో యజేత, పుత్రకామో యజేత, స్వర్గకామో యజేత' అనే వాక్యాలు వస్తాయి. వాటికి ఏ విధంగా యజ్ఞవిధి ఉండాలో నిర్దేశిస్తాయి. అందుచేతనే శాబరభాష్యం (2-7-3) లో బ్రాహ్మణాన్ని

గురించి ఈ విధంగా వివరింపబడింది.

**హేతు నిర్వచనం నిందా ప్రశంసా సంశయో విధిః ।**
**పరిక్రియా పురాకల్పో వ్యవధారణ కల్పనా ।**
**ఉపమానం దశైతే తు విధయో బ్రాహ్మణస్య తు ॥**

ఏ క్రియ ఎందుకు ఆచరించాలో తెలిపేది హేతువు. శబ్దార్థాన్ని స్పష్టం చేసేది నిర్వచనం. ఆ యా యజ్ఞాల కవసరమైన వస్తువులను గురించి, విధి విధానాలను గురించి యుక్తిగా నచ్చచెప్పే ప్రక్రియలు నిందా ప్రశంసాదులు.

బ్రాహ్మణాలలో కురు పాంచాల దేశాలు వర్ణింపబడ్డాయి. సరస్వతీనది వినశన మను చోట అంతర్వాహినిగా మారి, తిరిగి పక్షప్రస్రవన మను చోట ఉద్గమించినట్లు వ్రాయబడింది. యమునా ప్రవాహభూమి, సరస్వతీ దృషద్వతీ నదుల సంగమస్థానం నిర్దేశింప బడ్డాయి. ఈ ప్రదేశమునే మనుస్మృతి బ్రహ్మావర్తమని పేర్కొంటుంది (1-72). ఆ బ్రహ్మావర్త దేశమున వర్ణములకు, ఆశ్రమములకు పరంపరాగంతంగా వేదాలనుండి సంక్రమించిన ఆచారాన్నే సదాచారమంటుంది (1-73). అట్టి సదాచారాన్నే ప్రపంచ మానవులంతా అనుసరించి భౌతిక ఆత్మికోన్నతులను పొందమంటుంది.

**ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్ర జన్మనః ।**
**స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః ॥**

**(మనుస్మృతి. 1-74)**

ఆర్యావర్తంలోని కురుక్షేత్రంలో ప్రజాపతి అని పిలవబడే మహర్షి పెద్ద యజ్ఞవేదిని నిర్మించి మిగిలిన ఋషుల సహకారంతో పెద్ద పెద్ద యజ్ఞయాగాదులు నిర్వహించినట్లు శాంఖాయన బ్రాహ్మణంలో వ్రాయబడింది. కాలాంతరంలో అచ్చటనే మహాభారత యుద్ధం జరిగింది. ఆ ప్రాంతానికి చెందిన భాష ఉదీచ్యభాష యనీ, అది చాలా ప్రశస్తమైన భాష యనీ పై బ్రాహ్మణంలో చెప్పబడింది.

ఐతరేయ బ్రాహ్మణంలో శునశ్శేపుని కథ విస్తారంగా వర్ణింపబడింది. ఈ కథలోనే ఆంధ్రులు విశ్వామిత్రుని సంతతిగా, వింధ్య పర్వతానికి దక్షిణంగా వలసవచ్చినవారుగా వర్ణింపబడిరి. దీనిలోనే విదేహ రాజ్యాన్ని గురించి, దక్షిణ

రాజ్యాలను గురించి చెప్పబడింది. దీనిలో హరిశ్చంద్రుడు, జనమేజయుడు, శర్యాతి, సుదాసుడు, భరతుడు మొదలగు చారిత్రిక పురుషుల కథలున్నాయి. భూమండలమునగల వివిధ రాజ్యాల వర్ణన ఉంది.

కాషీతక బ్రాహ్మణంలో అనేక చక్రవర్తుల వర్ణన ఉంది. వీరిలో కొందరు అశ్వవిద్యను అంటే అగ్నివిద్యను తెలిసినవారుండేవారు. ఆ కాలంలో బాల బాలికలను ఐదేండ్ల ప్రాయంలోనే పాఠశాలలకు పంపినట్లుగా ఈ బ్రాహ్మణంలో వ్రాసి ఉంది. ఇంతేగాక, ఈ నియమాన్ని తప్పితే రాజార్యసభ తల్లిదండ్రులకు దండన విధించేది.

తైత్తరీయ బ్రాహ్మణం కృష్ణయుజర్వేదానికి చెందినదిగా చెబుతారు. సామవేదానికి చెందిన బ్రాహ్మణాలలో తాండ్యబ్రాహ్మణం ముఖ్యమైనది. ఇది తండి అనే ఋషిచే వ్రాయబడింది. దీనిలో 40 అధ్యాయాలుంటాయి. వీనిలో మొదటి 8 అధ్యాయాలకు పంచవింశ బ్రాహ్మణమనియు, తదుపరి 5 అధ్యాయాలకు షడ్వింశ బ్రాహ్మణమనియు, అనంతరం 2 అధ్యాయాలకు మంత్ర బ్రాహ్మణమనియు చివరి 8 అధ్యాయాలకు ఛాందోగ్య బ్రాహ్మణమనియు లోకంలో వ్యవహారం ఉంది. చివరి ఛాందోగ్య బ్రాహ్మణమే ఛాందోగ్యోపనిషత్తు. సామవిధాన, జైమినీ బ్రాహ్మణములు కూడా ముఖ్యమైనవే.

బ్రాహ్మణములు విద్వాంసులను **"విద్వాంసో హి దేవాః'** అని గౌరవిస్తాయి. కాని అతిమానము (అహంకారం) పరాభవానికి మూలమని హెచ్చరిస్తాయి. దేవ, ఋషి, పితృ ఋణాలు తీర్చుకోవడానికి స్త్రీ పురుషులు ప్రేమ పూర్వకంగా వివాహం చేసుకోవాలని సూచిస్తాయి. భార్య పరమ సఖునివంటిదనీ, ఆమె అర్ధాంగి యనీ, అపత్నీకుడు (భార్య ప్రక్కన లేకుండా) అగ్నిహోత్రం ఆచరించకూడదనీ ఉపదేశిస్తాయి. అపుత్రునికి (పుత్రులు లేనివారికి) వృద్ధాప్యంలో కష్టాలు వస్తాయి కనుక ఉత్తమ సంతాన నిర్మాణం అవసరమంటాయి. స్త్రీలు లక్ష్మీ స్వరూపులుగా, మంగళదాయినులుగా వర్ణింపబడ్డారు. **"న వై స్త్రియం ఘ్నంతి" (శత. 11-4-3-2)** - స్త్రీలను హింసింపరాదని పురుషుల నాదేశిస్తాయి. పాతివ్రత్యం, వీరమాతృత్వం స్త్రీల కాదర్శంగా ఉండాలని స్త్రీల కుపదేశిస్తాయి.

బ్రాహ్మణాలు నీతికి ప్రాధాన్యత నిస్తాయి. సత్యాన్ని ఉత్కృష్ట ధర్మంగా పేర్కొంటాయి. **"యః సకృత్ పాపం కుర్యాత్ కుర్యాదేవ స్తతోऽ పరమ్"** ఒక పాపం మరొక పాపానికి దారి తీస్తుందని హెచ్చరిస్తాయి. వేదవిహిత కర్మలను శ్రద్ధతో చేయమంటాయి. **"శిరో వా ఏతద్యజ్ఞస్య యదాతిథ్యమ్" (ఐత. 1-25)** ఆతిథ్యం ఉత్తమ ధర్మమని చెబుతాయి. ఈ విధంగా బ్రాహ్మణాలలో గృహస్థ ధర్మాలు విశేషంగా వివరింపబడ్డాయి.

## ఆరణ్యకములు

బ్రాహ్మణాలు గృహస్థ ధర్మాలను వివరించునట్లే ఆరణ్యకాలు వానప్రస్థ సంన్యాస ధర్మాలను వివరిస్తాయి. ముఖ్యంగా వానప్రస్థుల యజ్ఞయాగాది విధానాన్ని వర్ణిస్తూ వాటికి అధిదైవికార్థంతోబాటు ఆధ్యాత్మికార్థాన్ని వ్యాఖ్యానిస్తాయి. బోధాయన ఋషి - **"అరణ్య ఏవ పాఠయిత్వా దారణ్యక మితీర్యతే"** - అరణ్యములలో చదువతగినదిగాన దీనికి ఆరణ్యకమని పేరు వచ్చిందంటారు. సాయణాచార్యులవారు కూడా యిట్లే నిర్వచించారు. **"అరణ్యాధ్యయనాది తద్ ఆరణ్యక మితీర్యతే ।'** అంటారు.

తైత్తరీయారణ్యకం కాలానికి (సమయానికి) ఎక్కువ ప్రాధాన్యత నిస్తుంది. కాలం మహానదివంటి దంటుంది. దీనిలో ఋతువులు, ఋతుచర్యలు వర్ణింపబడ్డాయి. ఇది పాపకార్యాలను వర్జించి పుణ్యకార్యాలను ఆచరించాలని ప్రేరణనిస్తుంది. పంచమహాయజ్ఞాల గురించి, వర్ణాశ్రమ ధర్మాల గురించి వర్ణిస్తుంది. అరణ్యకములలోని మరొక ప్రతిపాద్య విషయం ప్రాణవిద్య. ఋగ్వేదంలోని ప్రాణవిద్యకు చెందిన మంత్రాలకు విశేష వ్యాఖ్యానం చేయబడింది. ఇది ప్రాణాన్ని 'గోప' శబ్దంతో పేర్కొంటుంది. ఉదయ కాలంలో ప్రాణం ఇంద్రియాలను శరీరంలో వ్యాపింపజేస్తుంది. కాన, అది ప్రతననము. ఆ కారణం చేత ఉదయకాలానికి ప్రాతః కాలమనే పేరు వచ్చిదంటుంది. సాయంకాలం అది ఇంద్రియాలను తిరిగి సంకోచింపచేస్తుంది. దానినే సమాగకం అంటారు. ఆ కారణం చేతనే సాయంకాలమనే పేరు వచ్చిదంటుంది (ఐత. ఆ. 103-104) ఐతరేయారణ్యకం.

నాలుగు వేదాలకు వేరువేరుగా ఆరణ్యకాలున్నాయి. పూర్వం చాలా

ఆరణ్యకాలున్నట్లుగా శాస్త్రాలలో కనబడుతుంది. కాని, నేడు ఏడు ఆరణ్యకాలు మాత్రమే లభిస్తున్నాయి. వీటిలో ఋగ్వేదానికి చెందిన ఐతరేయారణ్యకం మిక్కిలిగా ప్రసిద్ధిని చెందింది. ఈ ఆరణ్యకంలో మొదటి మూడు భాగాలకు ఇతరాపుత్రుడైన ఐతరేయ మహీదాసుడు, నాల్గవ దానికి ఆశ్వలాయనుడు, అయిదవ భాగానికి శౌనకుడు ఋషులుగా చెప్పబడ్డారు. ఇది 18 అధ్యాయాల గ్రంథం. దీనిలో ముందుగా మహా వ్రతయాగం వివరింపబడింది. ఇది గవామయ సత్రంలో మొదటి దినం ఆచరించే యాగం. తరువాత ఉక్థ, నిష్కైవల్య, శస్త్ర, ప్రాణవిద్యా, పురుష వివేచనాదులు వర్ణింపబడ్డాయి. పిమ్మట నిర్భుజ (సంహిత) ప్రతృణ (పద పాఠ) సంహితల భేదం, సంధి, స్వర, స్పర్శ, ఊష్మవర్ణా భేదం వివరింపబడింది. ఈ భాగానికి 'సంహితోపనిషత్' అని పేరు. దీనిలో కొందరు ఋషికల (స్త్రీ ఋషుల) పేర్లు కనబడతాయి. కౌషీతకీ ఆరణ్యకము కూడా ఋగ్వేదానికి చెందినదే.

యజుర్వేదానికి చెందిన వాటిలో శుక్లయజుర్వేదానికి బృహదారణ్యకము, కృష్ణయజుర్వేదానికి తైత్తరీయారణ్యకము మిక్కిలి ప్రసిద్ధిని చెందాయి. తైరీయోపనిషత్తు, నారాయణీయోపనిషత్తులు వీటిలోనివే. తైత్తరీయారణ్యకం (6-1)లో సహగమనం చేయబోవుచున్న స్త్రీని వలదని వారించుచు, పతి ధనుర్బాణాదులను మాత్రము గ్రహించి చితిని విడిచి రావలసినదని పెద్దలు చేయు ఉపదేశము ఒకటి కనబడుతుంది. దీనినిబట్టి ఆనాడే సతీసహగమనాన్ని ఋషులు వ్యతిరేకించారని అర్థమౌతున్నది.

సామవేదానికి చెందిన ఆరణ్యకాలలో తలవకార ఆరణ్యకం ప్రసిద్ధిని చెందింది. దీనినే జైమినీయుపనిషద్బ్రాహ్మణమనియు తలవకారోపనిషత్తనియు అంటారు. కేనోపనిషత్ దీనిలోని అంతర్భాగమే.

అథర్వవేదానికి చెందిన ఆరణ్యకము లేవియు లభించటం లేదు. బ్రాహ్మణ గ్రంథాలలో వలెనే వీటిలో కూడా చారిత్రిక విషయాలు కొన్ని కనబడతాయి. కొందరు ఋషుల ప్రసంగాలు, కథలు ఉన్నాయి. కాశీ, కురుక్షేత్రం, ఖాండవం మొదలైన క్షేత్రాల వర్ణనలు ఉన్నాయి.

## అంగ-ఉపాంగాలు

వేదాల ఆవిర్భావ కాలంలో ఋషులు సాక్షాత్కృతధర్ములుగా ఉండేవారు. అట్టి పవిత్ర హృదయులకు వేదమంత్రాలు చదువుతున్నపుడే వాటి అర్థం అవగతమౌతుండేది. వేరుగా శబ్దకోశాల అవసరం గాని, వివరించి చెప్పవలసిన గురువుల అవసరంగాని అంతగా ఉండేదికాదు. కాలక్రమంలో మానవులలో యిట్టి యోగ్యత నశించిపోవటం ప్రారంభమయ్యింది. అప్పుడు ఋషులు ముందు తరాలవారు వేదార్థాలను తెలుసుకోవడానికి ఉపయోగపడే విధంగా వేదాంగాలను వ్రాసారు. ఇవి ఆరు.

**శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దసాం చ యః ।**
**జ్యోతిషామయనం చైవ వేదాంగాని షడేవ తు ॥**

1) శిక్ష, 2) కల్పము, 3) వ్యాకరణము, 4. నిరుక్తము, 5) ఛందస్సు, 6) జ్యోతిషము. ఇవి అన్నీ విద్యలు. వీటికి విభిన్న పాఠ్యగ్రంథాలున్నాయి. వీటిని వేదాంగము లన్నంతమాత్రాన యివి వేదాలకు కాళ్ళు, చేతులు వంటి అవయవాలు కాదు. శాస్త్రాలలో ఏ ఏ సాధనాల వల్ల ఒక వస్తువు యొక్క స్వరూపజ్ఞానం కలుగుతుందో వాటిని అంగములని నిర్వచింపబడింది. కనుక యివి వేదార్థాన్ని తెలుసుకునే సాధనాలు (విద్యలు) మాత్రమే.

పై ఆరు వేదాంగాలను బాగా అధ్యయనం చేసిన వ్యక్తికి వేదార్థం చక్కగా బోధపడుతుంది. లేకుంటే వేదాలు ఏమి ఉపదేశం చేస్తున్నాయో తెలియదు. కనుక వాటిని గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాము.

### శిక్ష

దీని పూర్తిపేరు **'వర్ణోచ్చారణ శిక్ష'** – అక్షరాలను ఎలా ఉచ్చరించాలో (పలకాలో) తెలిపే శాస్త్రం. ఏఏ అక్షరాలను ఏఏ విధంగా ఉచ్చరించాలో, ఏ స్థానం నుండి వాటిని పలకాలో, ఏ ప్రయత్నంతో వాటిని ఉచ్చరించాలో ఈ శాస్త్రంలో చెప్పబడుతుంది.

అక్షరాలను తప్పుగా పలికితే ఆ పదంయొక్క అర్థమే మారిపోతుంది.

ఉదాహరణకు 'స'కారాన్ని 'శ' కారంగాను, 'శ' కారాన్ని 'స' కారంగాను పలికితే-

సకలః = సర్వం | శకల ః = చిన్న ముక్క

స్వజనః = మనవారు | శ్వజనః = కుక్క యొక్క పిల్లలు

అశ్వః = గుఱ్ఱము | అస్వః = మనవారు కానివారు

శాస్త్రీ = శాస్త్రవేత్త | సాస్త్రీ = ఆ స్త్రీ

సాధారణంగా మన తెలుగువారు 'శ' నుకూడా 'స' గానే పలుకుతూ ఉంటారు. ఇది సరికాదు. శిక్షాశాస్త్రం ప్రకారం (**ఇ చు య శాః తాలవ్యాః** - అనే సూత్రం ప్రకారం) - 'శ' కారాన్ని ఉచ్చరించేటప్పుడు తాలువు (ముందరి పళ్ళకు పై బాగాన ఉండే చిగురు) నకు నాలుకను తాకించి పలకాలి. అంటే 'చ' కారాన్ని పలికేటప్పుడు నాలుక ఎక్కడ తాకుచున్నదో 'శ' కారాన్ని పలికేటప్పుడు కూడా నాలుక అక్కడ తాకాలి. 'స' కారాన్ని '**ౡ తు ల సా దన్త్యాః**' అనేసూత్రాన్ననుసరించి ముందరి పళ్ళకు జిహ్వను తాకించి పలకాలి. ఈ విధంగా అక్షరాలను ఏ స్థాన ప్రయత్నాలతో ఉచ్చరించాలో ఈ శాస్త్రంలో చెప్పబడింది. ఎంతటి విద్వాంసులైనా ఉచ్చారణదోషాలుంటే శోభించరు. కనుక యిది అందరకు అవసరమే. అందుచే విద్యాభాసంలో నిది మొదటి పుస్తకంగా (విద్యగా) చెప్పబడింది.

వర్ణోచ్చారణ శిక్ష చాలా చిన్న పుస్తకం. వెలకూడా స్వల్పమే. సంస్కృత శిక్షణా పుస్తకాలమ్మే చోట యిది లభిస్తుంది. దానిని మీరంతా జాగ్రత్తగా చదివి అభ్యాసం చేసి స్పష్టంగా ఉచ్చరించ యత్నించండి. పిల్లలకు స్పష్టంగా ఉచ్చరించ నేర్పండి.

ముఖ్యంగా వేదాధ్యయనం చేసేవారికి ఈ శిక్షా శాస్త్రాధ్యయనం అనివార్యం. ప్రాచీనకాలంలో 30కి పైగా శిక్షాశాస్త్రాలున్నట్లు కనబడుతుంది. ప్రస్తుతం కొన్నే లభిస్తున్నాయి. వాటిలో 'పాణినీయ శిక్షా' ఉత్తమమైనదిగా విద్వాంసులు చెబుతారు.

## కల్పము (కల్పసూత్రాలు)

'కల్పో వేద - విహితానాం కర్మణా మానుపూర్వ్యేణ
కల్పనా - శాస్త్రమ్" (ఋక్ ప్రాతిశాక్య, వర్గ - 2)

వేదాలలో చెప్పబడిన విహిత కర్మల (యజ్ఞముల) యొక్క క్రమ పూర్వక వ్యవస్థిత కల్పనాశాస్త్రాన్ని కల్పశాస్త్రం అంటారు. ఈ శాస్త్రం చదివిన వారికే వైదిక కర్మలలో వేదమంత్రాల యొక్క వినియోగం అర్థమౌతుంది. ఆ విధంగా వేదార్థాన్ని తెలుసుకోవడానికి ఈ శాస్త్రం సహాయపడుతుంది గనుక దీనిని వేదాంగాలలో చేర్చటం జరిగింది. ఈ శాస్త్రమంతా సూత్రాలలో ఉంటుంది. సూత్రం అంటే -

**స్వల్పాక్షర మసన్దిగ్ధం సారవద్ విశ్వతో ముఖమ్ ।**
**అస్తోభమనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః ॥**

ఒక విషయాన్ని తక్కువ అక్షరాలలో (పదములలో) చెప్పటం. అయితే ఆ పదము సందేహరహితంగా, సారగర్భంగా, విశాలమైన అర్థాన్ని ప్రకటించేదిగా, సరళంగా అర్థమయ్యేదిగా, దోషరహితంగా ఉండాలి. కల్పసూత్రాలు 4 రకాలుగా ఉంటాయి.

1. శ్రౌతసూత్రాలు 2. గృహ్యసూత్రాలు 3. ధర్మసూత్రాలు 4. శుల్వ సూత్రాలు

**1. శ్రౌతసూత్రాలు :** వేదాలలోను, బ్రాహ్మణ గ్రంథాలలోను విస్తారంగా వర్ణింపబడిన యజ్ఞయాగాది క్రతువులయొక్క సారం ఈ శ్రౌతసూత్రాలలో చెప్పబడింది.

పూర్వం వైదిక యుగంలో (మహాభారతకాలం వరకు కూడా) కర్మకాండ ప్రధానంగా ఉండేది. ప్రజలలో ఆసురీ ప్రవృత్తులను అణచిపెట్టి దైవీశక్తులను జాగృతపరచటానికి వైదిక కర్మకాండ ప్రచలితమయ్యింది. దీనిలో భాగంగా శ్రౌతవిధి ననుసరించి పెద్ద పెద్ద యజ్ఞవేదికలను నిర్మించేవారు. అగ్న్యాధానపూర్వకంగా తూర్పుదిశలో ఆహవనీయాగ్నిని, పశ్చిమదిశలో గార్హపత్యాగ్నిని, దక్షిణదిశలో దక్షిణాగ్నిని స్థాపించేవారు. హోతా, అధ్వర్యు, ఉద్గాత, మరియు బ్రహ్మ అనే ఉపాధులతో నలుగురు ముఖ్య ఋత్విజులను ఎన్నుకొనేవారు. వారికి అనుయాయులుగా మరికొందరు ఋత్విజులను ఏర్పాటు చేసుకొని అందరి సహకారంతో పెద్ద పెద్ద యజ్ఞాలను వారాలు

నెలలుకూడా ఆచరించేవారు.

ఈ శ్రౌతయజ్ఞాలు చాలా రకాలుగా ఉండేవి. వాటిలో కొన్ని:- దర్శ, పౌర్ణమాస, దాక్షాయణ, అగ్నిష్టోమ, చాతుర్మాస్య, నిరూఢ, పశుబన్ధ, సోమయాగ, ఏకాహ, అహీన (2 నుండి 11 దినములు), సత్ర (12 నుండి 360 దినములు), గవామయన (పూర్తి సంవత్సరకాలం), వాజపేయ, రాజసూయ, అగ్నిచయన, సౌత్రామణీ, అశ్వమేధ, పురుషమేధ, అభిచార యాగ, అహీన - అతిరాత్ర, అప్తోర్యమ, ప్రవర్గ్య మొదలైనవి.

ఈ యజ్ఞాలవల్ల వేరు వేరు ప్రయోజనాలున్నాయి. ఇవి వేరు వేరు విద్యావిజ్ఞానాలను బోధిస్తాయి. విజ్ఞాన శాస్త్రానికి ప్రయోగశాలలు (లేబరేటరీస్) ఏ విధంగా సహకరిస్తాయో అట్లే వేదంలోని జ్ఞాన విజ్ఞానాలకు వివిధ యజ్ఞాలు వివిధ ప్రయోగశాలలుగా సహకరిస్తా యంటారు. కావుననే కల్పసూత్రాలను వేదాంగాలలో చేర్చటం జరిగింది. వీటిలోని వివిధ యజ్ఞవేదికల నిర్మాణం రేఖా గణితాన్ని సంకేతం చేస్తుంది. పాత్రలు, క్రియలు మొదలైనవన్నిటి వెనుక విజ్ఞానం దాగి ఉంది. దురదృష్టవశాత్తు నాస్తికమతాల ప్రచారంవల్ల, విదేశీయుల విమతస్థుల పాలనవల్ల మనం యజ్ఞవిజ్ఞానానికి పూర్తిగా దూరమైపోయాము. ప్రస్తుతం ఈ విషయంలో పరిశోధనలు చేసేవారు కూడా కనబడటం లేదు. అప్పుడప్పుడు అక్కడక్కడ సోమయాగం వంటివి నామమాత్రంగా జరుగుతున్నాయి.

ఇటువంటి పెద్దపెద్ద శ్రౌతయాగాలవల్ల వైజ్ఞానికంగా కలిగే లాభమేమంటే వాతావరణం శుద్ధమౌతుంది. తద్వారా సమయానుకూల వర్షాలు, తీవ్రతలేని శీతాతపాలు, అనుకూల ఋతువులు ఏర్పడతాయి. దానితో మానవులకు, ప్రాణులకు సుఖ సంతోషాలు కలుగుతాయి.

ఆధ్యాత్మికంగా:- ఈశ్వరీయ జ్ఞానమైన వేదాల రక్షణ, వేద సిద్ధాంతాల ప్రచారం జరుగుతుంది. మానవులను ధర్మాత్ములుగా తీర్చిదిద్దే ప్రబోధాలు జరుగుతాయి. విద్వాంసుల, విజ్ఞాన వేత్తల, కళాకారుల సత్కారం జరుగుతుంది. తద్వారా ఆయా విద్యలకు ప్రోత్సహం లభించి అవి వికసిస్తాయి.

రాజనైతికంగా : రాజులు మహారాజులు చేయతగిన రాజసూయ

అశ్వమేధాది యాగాలవల్ల ధనవంతులనుండి ధనం కట్నాల రూపంలో కోశాగారానికి చేరుతుంది. అది తిరిగి విద్వాంసులకు కళాకారులకు పేదవారికి యథాయోగ్యంగా పంచబడుతుంది. తర తమ భేదాలు శాంతించి సంఘటన బలపడుతుంది. దేశం అన్ని రంగాలలోను ఉన్నతి చెందుతుంది.

అట్టి ధార్మికయుగం మరల ఎన్నటికి వస్తుందో !

శ్రౌతసూత్రాలలోముఖ్యమైనవి - ఋగ్వేదానికి ఆశ్వలాయన, శాంఖాయన, కౌషీతక శ్రౌతసూత్రాలు ; శుక్ల యజుర్వేదానికి కాత్యాయన శ్రౌతసూత్రాలు ; కృష్ణ యజుర్వేదానికి - బోధాయన శ్రౌతసూత్రాలు ; సామవేదానికి ఆర్షేయ, జైమనీయ శ్రౌతసూత్రాలు ; అథర్వవేదానికి - వైతాన శ్రౌతసూత్రాలు.

2. **గృహ్యసూత్రాలు :** కర్మకాండలో ద్వితీయ భాగంగా గృహ్యకర్మ లుంటాయి. గృహస్థులు పంచమహాయజ్ఞాలను విధిగా చెయ్యాలి. వాటితోబాటు షోడశ సంస్కారాలు చేసుకోవాలి. వీటిని గురించి ముందు ప్రకరణాలలో వివరంగా తెలుసుకుందాము. ఈ శుభకార్యా లన్నిటిలో చిన్న అగ్నిహోత్రం చేయబడుతుంది. అది శ్రౌతయజ్ఞాలలో వలె బహిరంగ ప్రదేశంలోకాక గృహంలోనే చేసుకోవాలి. అట్టి షోడశ సంస్కారవిధిని తెలిపే వాటిని గృహ్యసూత్రా లంటారు. ఆశ్వలాయన, పారాశ్కర, బోధాయన, గోభిలాయనాది మహర్షులు ఎంతోమంది గృహ్యసూత్రాలను వ్రాసారు. కాలాంతరంలో కొందరు వీటిలో మార్పులు చేర్పులు చేసారు. వీటన్నిటికన్న మహర్షి దయానంద సరస్వతిగారు వ్రాసిన 'సంస్కారవిధి' ఉత్తమోత్తమంగాఉంటుంది. అది పూర్తిగా వైదిక పద్ధతిలో వైజ్ఞానికంగాను, హేతుబద్ధంగాను ఉంటుంది. మనవంటి సామాన్యులు దాని ననుసరించుటయే మంచిది.

3. **ధర్మసూత్రాలు :** వీటిలో వర్ణాశ్రమ ధర్మాలు వివరింపబడ్డాయి. సామాజిక నియమాలు, రాజప్రజా ధర్మాలు, కౌటింబిక దాయబాగాది నియమాలు, నిత్యనైమిత్తిక కర్మలు, వైయుక్తిక పారివారిక సామాజిక సంబంధమైన కర్తవ్యాలు ఉపదేశింపబడ్డాయి. ఏవైనా తప్పులు, పొరపాట్లు జరిగితే వాటికి ప్రాయశ్చితంగా ఏమి చేయవలెనో చెప్పబడింది.

ప్రాచీన కాలంలో చాలా ధర్మసూత్ర గ్రంథాలున్నట్లు మన సాహిత్యంలో

కనబడుతుంది. కాని, ప్రస్తుతం కొన్ని మాత్రమే లభిస్తున్నాయి. వీటిలో వశిష్ఠ ధర్మసూత్రాలు అత్యంత విశిష్టమైనవి. ఈ గ్రంథం చిన్నదైనా మహత్త్వపూర్ణమైనది. మానవులెట్లు సదాచార పరాయణులు కావాలో ప్రాపంచిక ఆశాలోభాలనుండి తనను తాను ఎట్లు రక్షించుకోవాలో దీనిలో ఉపదేశించబడింది.

గౌతమ ధర్మసూత్రాలు ప్రాచీనతమమైనవంటారు. మనుస్మృతికి మూలమైన మానవధర్మసూత్రాలు ఇప్పుడు లభించటం లేదు. ఇవి వేదాలలో నిగూఢంగా ఉన్న ధర్మాలను విశదీకరిస్తాయి కనుక వీటిని కూడా వేదాంగాలలో (కల్పగ్రంథాలలో) చేర్చారు.

4. **శుల్బ సూత్రాలు :** శుల్బ (లేదా శుల్వ) అంటే కొలత అని అర్థం. దీనిలో వివిధ యజ్ఞాలకు యజ్ఞకుండాల నిర్మాణాన్ని గురించి చెప్పబడింది. వీటిలో రేఖాగణితానికి చెందిన విజ్ఞాన విషయాలు కూడా ఉన్నాయని విద్వాంసులంటారు.

ఈ సూత్రగ్రంథాలన్నీ కల్పములోని భాగాలే. ఇవన్నీ వేదార్థాన్ని తెలుసుకోవడానికి కూడా సహకరిస్తాయి.. కనుక వీటిని వేదాంగాలలో చేర్చటం జరిగింది.

## వ్యాకరణము

వ్యాకరణం వేద–పురుషుని ముఖంగా (ముఖం వ్యాకరణం స్మృతమ్' అని) చెప్పబడింది. వ్యాకరణం అంటే పదములను వివేచించి వాటి అర్థాన్ని స్పష్టం చేసేది. ఈ శాస్త్రం వేద పదములకేకాక సమస్త సంస్కృత వాఙ్మయానికి దీపిక వంటింది. వ్యాకరణ శాస్త్రాలు అనేకం ఉన్నాయి. వాటన్నిటిలోను పాణినీయ వ్యాకరణానికే ప్రథమ స్థానం ఉంది. ఎందుచేతనంటే ఆ శాస్త్రంలోని సూత్రాల క్రమం, సరళత, స్పష్టత, సంక్షిప్తత మరే వ్యాకరణంలోను లేదు. ముఖ్యంగా వేదపదముల అర్థాన్ని చక్కగా వివేచించి చూపిస్తుంది పాణినీయ వ్యాకరణం. అందుచేతనే నేటి ఆర్ష గురుకులాలలో పాణినీయ వ్యాకరణాన్నే పాఠ్యక్రమంగా చేసుకొని బోధిస్తున్నారు.

గురుకులంలో చేర్చుకున్న విద్యార్థులకు ముందు 'వర్ణోచ్చారణ శిక్ష' నేర్పుతారు. అనంతరం సామాన్య వ్యవహారిక సంస్కృతం నేర్పుతూ పాణినీముని

రచించిన అష్టాధ్యాయి వ్యాకరణ సూత్రాలను కంఠస్థం చేయిస్తారు. పాణినీ మహర్షి 4,000 సూత్రాలతో ఈ వ్యాకరణ గ్రంథాన్ని రచించారు. అది 8 అధ్యాయాలుగా ఉండటంచే అష్టాధ్యాయి అనే పేరుతో ప్రసిద్ధిని పొందింది. అష్టాధ్యాయి సూత్రాలు కంఠస్థం అయిన తరువాత ధాతుపాఠాన్ని కంఠస్థం చేయిస్తూ ప్రథమావృత్తిగా ప్రతీ సూత్రానికి అర్థం చెబుతూ అది ఏరకంగా ఉపయోగపడుతుందో సోదాహరణంగా విశదీకరిస్తారు. అనంతరం ద్వితీయావృత్తిగా 'కాశికా' అనే గ్రంథాన్ని చదివిస్తూ మరింత వివరంగా సూత్రాల ప్రయోగాన్ని చెబుతారు. తదుపరి తృతీయావృత్తిగా పతంజలి మహర్షి వ్రాసిన మహాభాష్యాన్ని చదివిస్తారు. దీనితో విద్యార్థికి వ్యాకరణ సూత్రాల అర్థం వాటి మహత్మ్యం బాగా అర్థమౌతుంది. అనంతరం నిరుక్తాన్ని చదివిస్తారు.

## నిరుక్తము

నిరుక్తం అంటే నిర్వచన-విద్య. ఏ శాస్త్రంవల్ల సంభావిత అవయవార్థ పూర్ణత జరుగుతుందో అదే నిరుక్తం.

వ్యాకరణం ద్వారా శబ్దముల (పదముల) రచనా విధానం చెప్పబడుతుంది. ఆ శబ్దాన్ని ఏ విధంగా ఉచ్చరించాలో వర్ణోచ్చారణ శిక్షలో తెలుపబడుతుంది. కల్పంలో వేద మంత్రాల వినియోగం ఏ విధంగా జరుగుతుందో, వినియోగపరమైన అర్థమేదో, వినియోగ మెందుకో తెలుపబడుతుంది. అదేవిధంగా నిరుక్తంలో అర్థనిర్వచనం (డెఫినిషన్) చెప్పబడుతుంది. సామాన్యంగా భాషలో అర్థం ప్రధానంగాను, శబ్దం (పదం) గౌణంగాను ఉంటుంది.

వేదమంత్రముల కర్థం తెలుసుకునేటప్పుడు కేవలం పదముల ధాత్వర్థం తెలిస్తే సరిపోదు. ఆ పదము యొక్క నిర్వచనాలు కూడా తెలిసి ఉండాలి. అందుచేత నిరుక్తాన్ని వ్యాకరణ శాస్త్ర పూరకం అనవచ్చును. ఇది లేకుంటే వ్యాకరణం అసంపూర్ణమే అవుతుంది. నిరుక్తశాస్త్రాలలో యాస్కమహర్షి వ్రాసినదే విశిష్టంగా ఉంది. యాస్కనిరుక్తం 3,000 సంవత్సరాలకు పూర్వానిదని చరిత్రకారుల అంచనా. అదే యిప్పుడు లభ్యమౌతున్నది. ఇది నిఘంటువుయొక్క భాష్యమని చెప్పవచ్చు. దీనిలో 734 వేదమంత్రాలు, 32

శాఖా మంత్రాలు ఉదాహరణ రూపంగా వ్యాఖ్యానించబడ్డాయి. ఎన్నో సందేహాలకు సమాధానం చెప్పబడింది.

## ఛందస్సు

తెలుగులో పద్యాల కెట్లు ఛందస్సులుంటాయో అట్లే వేదమంత్రాలకు ఛందస్సు లుంటాయి. "ఛన్దః పాదౌ తు వేదస్య" ఛందోవిద్య వేదాలకు పాదముల వంటిది. కాళ్ళు లేకపోతే మనిషి నిలబడటం గాని, నడవటంగాని చేయలేడు. అట్లే ఛన్ద జ్ఞానం లేకుంటే వేదార్థం తెలుసుకోవడం కష్టమౌతుంది.

ఛన్దజ్ఞానం వల్ల ఒక్కొక్క పాదంలో ఎన్ని అక్షరాలుంటాయో ఏ క్రమంలో ఉంటాయో తెలుస్తుంది. దానివల్ల పారాయణం తేలికౌతుంది. ఇది మంత్రార్థానికి కూడా సూక్ష్మరూపంలో సహాయపడుతుంది. అనేక చోట్ల మంత్రార్థం స్పష్టం కావడానికి ఛన్దజ్ఞానం అవసరమౌతుందని విద్వాంసులంటారు.

వేద మంత్రాలను ఛందస్సుతో బంధించటంవలన వానిలో కొన్ని అక్షరములు గాని, పదములు గాని ప్రక్షిప్తములు చేయలేరు. ఎవరైనా చేసినా దొరికిపోతాయి. కాత్యాయన మహర్షి ఏమంటారంటే " ఏ వ్యక్తి వేదమంత్రముల ఛన్ద, ఋషి, దేవతల జ్ఞానం కలిగిఉండడో అతడు చేసే అధ్యయన - అధ్యాపనాలు, యజన - యాజనాలు నిష్ఫలములౌతా" యంటారు. వేదమంత్రాలు ముఖ్యంగా సప్త ఛందస్సులలో ఉంటాయి. అవి - 1) గాయత్రీ, 2) ఉష్ణిక్, 3) అనుష్టుప్, 4) బృహతీ, 5) పంక్తీ, 6) త్రిష్టుప్, 7) జగతీ వీటిలో కూడా ఉపవిభాగాలుంటాయి. ఉదా : పాదనిచృద్, నిచృద్, భూరిగ్, వర్ధమానా మొదలగునవి.

ప్రతీ వైదికుడు (వేద ధర్మానుయాయి) వేదమంత్రాలను సరిగా ఉచ్చరించడానికి, వేదార్థాన్ని - వేదరహస్యాన్ని తెలుసుకోవడానికి, మంత్రాలలోని ప్రక్షిప్తాలను తొలగించడానికి, వైదిక శాస్త్రోక్త కర్మకాండను (యజ్ఞయాగాదులను) చక్కగా అనుష్టించడానికి ఛందః శాస్త్రాధ్యయనం తప్పక చేయాలనీ, లేకుంటే అతని స్వాధాయం కుంటితనంతో కూడుకున్నదే అవుతుందనీ వేదవిద్వాంసులంటారు.

# జ్యోతిషము

వేదాంగాలలో చివరిది (ఆరవది) జ్యోతిషము.

జ్యోతిషము అంటే జ్యోతిర్మయ సూర్య నక్షత్రాది గోళముల కథనము. ఖగోళవిజ్ఞానం (ఆస్ట్రాలజీ) అంతా ఈ జ్యోతిశ్శాస్త్రాంతర్గతమే. సూర్య చంద్ర నక్షత్రాదుల పుట్టుక, వాటి గతి, ఋతుచక్రము, సృష్టి చక్రము, సూర్య చంద్ర గ్రహణాలు, కాలగణన మొదలగునవన్నీ జ్యోతిషముగానే ఎంచబడతాయి.

ప్రకాశమంటే ఏమిటి ? దాని గతి, దానికి అవధి ఉందా లేదా? ప్రకాశం ఎన్ని రకాలు? జ్యోతిర్మయ గోళాల ఆకారం, పరిమాణం వాటి మధ్య దూరాలు, వాటి భ్రమణ వివరాలు మొదలైనవన్నీ ఈ శాస్త్రంలో చెప్పబడతాయి. ఇది ఒక ఖగోళ పరిశోధనా గ్రంథం అని చెప్పవచ్చు. వేదాల ఆధారంగానే ఈ జ్యోతిశ్శాస్త్రం వ్రాయబడినా వేదాభ్యాసంచేసే విద్యార్థులకు ఇది మార్గదర్శనం చేస్తుంది. వేదార్థాన్ని సుగమం చేస్తుంది.

'ప్రజ్ఞానాయ నక్షత్ర దర్శనం' (యజు. 30-10) సృష్టిని గూర్చిన విశేష జ్ఞానం కలగటానికి నక్షత్ర దర్శనం చేయమంటుంది వేదం. అందుచేతనే దీనిని వేదాంగాలలో చేర్చటం జరిగింది.

యజ్ఞయాగాది క్రతువులు సరియైన ఋతువులలో సరియైన తిథి నక్షత్ర సమయాలలో చేస్తే మంచి ఫలితాల నిస్తాయి. యజ్ఞాలేకాక వ్యవసాయాది లౌకిక కార్యాలుకూడా సరియైన సమయంలో ప్రారంభించి చేస్తేనే చక్కటి లాభాలను కలిగిస్తాయి. ఇక్కడ తిథి నక్షత్రా లంటే నేడు లోకంలో ప్రచలితమైయున్న ఫలితజ్యోతిషంకాదు. ఏ సమయంలో ప్రారంభించి చేస్తే ఆ యా యజ్ఞాలు వాతావరణానికి అనుకూలించి మంచి ఫలితాలను కలిగిస్తాయో అది ముహూర్తం అవుతుంది. 'కొన్ని తిథులు మంచివి, కొన్ని తిథులు మంచివి కావు. కొన్ని నక్షత్రాలు మంచివి, కొన్ని కావు' అనుకునేవన్నీ కేవలం మూఢ నమ్మకాలు. అథర్వవేదంలో 19వ కాండంలోని 7, 8 సూక్తాలలో అభిజిత్‌తో కలిపి 28 నక్షత్రాల పేర్లు పేర్కొంటూ యివన్నీ మంగళకరములేనని చెప్పబడింది. చివరగా -

**అష్టావింశాని శివాని శగ్మాని సహ యోగం భజన్తు మే ।**
**యోగం ప్రపద్యే క్షేమం చ, క్షేమం ప్రపద్యే యోగం చ**

నమే2హో రాత్రాభ్యామస్తు ॥ (అథర్వవేదం. 19-8-2)

మొత్తం 28 నక్షత్రాలూ కల్యాణకరములు, సుఖదాయకములునై నన్ను ప్రాప్తించి నన్ను సేవించును గాక. యోగ క్షేమములు రెండును పరస్పరము సంయుక్తములగుచు అన్ని దిన రాత్రములందును నాకు భోగముల నిచ్చుచుండును గాక !

కావుననే పెద్దలు 'మంచిపని చేయటానికి అన్ని దినములు (అన్ని క్షణాలు) మంచివేననియు, చెడ్డపని చేయటానికి ఏ దినమూ (ఏ క్షణమూ) మంచిది కాదనియు' చెబుతూ ఉంటారు.

పిల్లలు జన్మించినపుడు అప్పటి తిథి వార నక్షత్రాదుల ఆధారంతో జన్మకుండలి వ్రాయించి జాతకం కూడా వ్రాయిస్తూ ఉంటారు. ఇట్టి జాతకం పూర్తిగా విజ్ఞాన విరుద్ధం. దీనివల్ల లాభాలు కలుగకపోగా అనేక నష్టాలు జరిగాయి. జరుగబోయే దాని గురించి ముందుగానే భయపడటం, గ్రహాల శాంతి కొరకు వ్యర్థమైన వ్యయప్రయాసలు చేయటం జరుగుతుంది. చరిత్రను పరిశీలించి చూస్తే జన్మ పత్రికలవల్ల, ముహూర్తాలవల్ల, భవిష్యద్వాణివల్ల చాలా నష్టాలు జరిగాయి. ఏవో కొన్ని గ్రహాలు అనుకూలంగా లేవని శాంతులు, దానాలు చేయిస్తారు. మంచి జరిగితే మా పూజల వల్లనే మీకు లాభం కలిగిందంటారు. విపరీతం జరిగితే విధి బలీయం మేము చేయవలసిన ప్రయత్నం చేసామంటారు. నష్టజాతకుడని తెలిస్తే అప్పటినుండీ ఆ బాలునిపట్ల అశ్రద్ధ మొదలవుతుంది. అనేక రకాలుగా ఆ బాలుని కష్టపెడతారు. అదృష్ట జాతకుడని తెలిస్తే పురుషార్థం లోపిస్తుంది. చదువుకో నక్కరలేదనీ, కష్టపడ నక్కరలేదనీ, అదృష్టమే అన్నీ తెచ్చిపెడుతుందనీ అనుకుంటారు.

ఒక విషాదకర చారిత్రిక కథ ఏమంటే - ఒక రాజుగారి భార్యకు ప్రసవ నొప్పులు మొదలయ్యాయి. జాతకాలపై నమ్మకమున్న ఆ రాజుగారు జ్యోతిష్యులను పిలిపించి ఈ ముహూర్తంలో పుట్టిన బాలకుని జాతక మెట్లుంటుందని అడిగారట. దానికి ఆ జ్యోతిషులు లెక్కలు గణించి యిది చాలా చెడ్డ సమయం. ఒక గంట ఆగి ప్రసవించినట్లయితే అన్నీ శుభలక్షణాలు గల సంతానం కలుగుతుందని చెప్పారట. దానికి ఆ మూర్ఖరాజు తన భార్య ఒక గంటవరకు ప్రసవించకుండా ఉండటానికి రెండు కాళ్ళు దగ్గరగాచేర్చి కట్టివేసి తలక్రిందులుగా వ్రేలాడదీసాడట. దానితో ప్రసవనొప్పులు భరించలేక

ఆ రాణి, ఆమె గర్భంలోని శిశువు కూడా చనిపోయారట. ఇదెంత దారుణంగా ఉందో చూడండి.

ముహూర్తాలవల్ల కలిగిన మరొక మహా అనర్థమేమంటే - మహ్మద్ గజనీ సోమనాథమందిరంపై దండయాత్ర చేసాడు. దానిని ఎదుర్కోవటానికి రాజపుత్ర సైన్యం ముందుకు వచ్చింది. సంఖ్యలోను, బల పరాక్రమాలలోను గజనీ సైన్యం కన్న రాజపుత్రుల సైన్యమే ఎంతో అధికమైనది. కాని, ఫలితజ్యోతిషము కొంపముంచింది. కొందరు ఫలిత జ్యోతిషులు ముహూర్తం సరిగాలేదు, ఇప్పుడు ఎదుర్కొంటే మీరంతా ఓడిపోతారు, మంచి ముహూర్తం వచ్చేవరకు ఆగమన్నారు. ఆ కాలంలో ఫలిత జ్యోతిషుల మాట తిరస్కరించటానికి భయపడేవారు. అందుచే ముహూర్తం కోసం ఎదురుచూస్తూ నిలబడిపోయారు. దానితో గజనీ సునాయాసంగా మందిరంపై దాడి జరిపి శివలింగాన్ని ముక్కలు ముక్కలు చేసి అపార ధనరాశులను 46 ఒంటలపై తన దేశానికి తరలించుకు పోయాడు. వేలాది స్త్రీ పురుషులను బందీలుగా పట్టుకుని వారిని వారిదేశపు బజారులలో రెండేసి పైసలకు బానిసలుగా అమ్మివేసాడు.

ఇట్టిదే మరొక చారిత్రిక ఉదాహరణ - బంగ్లాదేశ రాజుకు ఫలిత జ్యోతిషంపై అంధభక్తి ఉండేది. వారి సలహా లేకుండా ఏ పనీ చేసేవాడుకాదు. ఇది గుర్తించిన బఖ్తియార్ ఖిల్జీ అనే తురుష్కరాజు ఆ జ్యోతిషులకు లంచం యిచ్చి వారిని తనకు అనుకూలంగా చేసుకొని బంగ్లాదేశంపై దండయాత్ర జరిపాడు. లంచాలు తిన్న జ్యోతిషులు "ముహూర్తం సరిగాలేదు. ఇప్పుడు యుద్ధం చేస్తే ఓడిపోతా"వన్నారు. ఆ అంధవిశ్వాసికి వేరే మార్గం లేక దేశాన్ని వదలి పారిపోయాడు. దానితో భఖ్తియార్ ఖిల్జీ యుద్ధం చేయనక్కరలేకుండానే బంగ్లాదేశానికి రాజైపోయాడు.

ఇట్టి మూఢనమ్మకాలు మనదేశంలోనేకాక ప్రపంచమంతా ఉన్నాయి. రోమన్ చక్రవర్తి బిటైలియమ్‌కు ఫలిత జ్యోతిషంపై అంధవిశ్వాస ముండేది. ఆ దేశ జ్యోతిషులు "మీ తల్లిగారెంత త్వరగా చనిపోతే మీ రాజ్యమంత స్థిరంగా ఉంటుం"దని జోస్యం చెప్పారు. దానిని నమ్మి రాజు తల్లికి ఆహారం పెట్టకూడదని శాసించాడు. ఫలితంగా ఆ తల్లి ఆకలితో అలమటిస్తూ మరణించింది.

మతేసా తూర్పు ఆఫ్రికాలోని యుగాండాకు రాజుగా ఉండేవాడు. ఆయన తల్లి సమేసోల్‌కు దురదృష్టవశాత్తు ఒకసారి పంటినొప్పి వచ్చింది. ఎన్ని మందులు వాడినా తగ్గలేదు. జ్యోతిషుల నడిగితే బువా ప్రాంతపు నివాసులను చంపివేస్తే మీ తల్లిగారి పన్ను నొప్పి తగ్గిపోతుందన్నారు. అంధవిశ్వాసియైన రాజు ఆజ్ఞాపించాడు. సైనికులు బువాకు చెందిన 25వేల మంది స్త్రీ పురుషులను చంపివేసారు. అయినా ఆ తల్లి పంటినొప్పి తగ్గలేదు.

ఫలిత జ్యోతిషంవల్ల ప్రపంచంలో ఎన్నెన్నో అనర్థాలు జరిగాయి. అయినా అమాయక ప్రజలు నేటికీ దానిని వదలిపెట్టటం లేదు.

క్రీ.శ. 1962వ సంవత్సరం ఫిబ్రవరిలో అష్టగ్రహకూటమి ఏర్పడింది. 15వేల సంవత్సరాల తరువాత ఏర్పడుచున్న ఈ అష్ట గ్రహకూటమివల్ల చాలా అనార్థలు జరుగగలవని ఫలిత జ్యోతిషులు ప్రపంచ ప్రజలను భయభ్రాంతులను చేసివేసారు. మహా ప్రళయమే రాగలదని చెప్పారు. కాని, అట్టివి ఒకటికూడా జరుగలేదు. ఎట్టి గ్రహకూటములూ లేని సమయాలలోనే క్రీ.శ. 1914 నుండి 1918 మరియు 1939 నుండి 1945 వరకు రెండు ప్రపంచ యుద్ధాలు జరిగాయి. అపార ప్రాణనష్టం, ధననష్టం జరిగాయి.

గ్రహాలు వాటి వాటి పరిధులలో వాటి వాటి వేగాలతో తిరుగుతూ ఉంటాయి. అప్పుడప్పుడు గడియారంలో మూడు ముళ్ళూ ఒక చోటికి చేరినట్లు గ్రహాలన్నీ ఒక వైపుకు రావచ్చు. అంతమాత్రన ప్రళయం రాదు. పరమేశ్వరుని వ్యవస్థ అందుకు తగినట్లుగా ఉంటుంది. ఆందోళన చెందవలసినపనిలేదు. అట్లే, ఒక వ్యక్తి జన్మించినపుడు ఆయా గ్రహాలు ఏఏ స్థానంలో ఉన్నాయో తెలుసుకోవచ్చు. కాని, కొన్ని స్థానాలు మంచివి, కొన్ని మంచివికావు అనుకోవటం అజ్ఞానం. పరమేశ్వరుడు సర్వంలో సమానంగా వ్యాపించియున్నాడు. సర్వానికి ఆధారుడు అతడే – **'స దాధార పృథివీమ్ ద్యా ముతేమామ్'** అని వేదం చెబుతుంది. కనుక భయ మెందుకు?

జ్యోతిష గ్రంథాలలో 'సూర్యసిద్ధాంతం' చాలా ప్రాచీనమైనది. మరియు విశిష్టమైనది. కాని, అది యిప్పుడు లభించటంలేదు. దాని సంక్షిప్తరూపంగా మరొక 'సూర్యసిద్ధాంతం' యిప్పుడు లభిస్తున్నది. 'ఆర్యభట్టీయం', 'బృహస్పతి సిద్ధాంతం' మొదలైన జ్యోతిషగ్రంథాలు చాలానే ఉన్నాయి. వాటిలోని గణితాన్ని

(లెఖ్ఖలను) చూసి ఆధునిక వైజ్ఞానికులు విస్తుపోతున్నారు. నేడు ఎంతో ఖరీదైన నక్షత్రశాల లుంటేకాని తెలుసుకోలేని గ్రహ నక్షత్రాదుల పరిభ్రమణ లెఖ్ఖలు ఆనాడు ప్రాచీనులు ఏ రకంగా ఏ పరికరాల ద్వారా తెలుసుకోగలిగారా ? అని ఆశ్చర్యపోతున్నారు. వారి ప్రజ్ఞకు ప్రపంచ ఖగోళ శాస్త్రజ్ఞులంతా జోహారు లర్పిస్తున్నారు. ఇది భారతీయులమైన మనందరికి గర్వకారణం.

మనం ముఖ్యంగా చాంద్రమాన గణన ననుసరిస్తాం. ఈ గణన పండితులకు పామరులకు కూడా అనుకూలంగా ఉంటుంది. దీనిలో తిథి వార నక్షత్ర యోగ కరణా లనే అయిదు అంగాలు (విషయాలు) ఉంటాయి. అందువల్లనే దీనికి పంచాంగమనే పేరు వచ్చింది. అయితే సామాన్య పంచాంగాలలో తిథి వార నక్షత్రా లుంటాయికాని యోగ కరణా లుండవు. వాటి వివరాలు ప్రభుత్వం ప్రచురించే రాష్ట్రీయ పంచాగంలో ఉంటాయి. వాటినికూడా మనం తెలుసుకొని మన సంకల్పంలో చెప్పుకుంటూ ఉంటే ఆదర్శంగా ఉంటుంది.

ఆంగ్లేయుల పాలనలో మనం ఆంగ్ల తేదీలకు అలవాటు పడిపోయాం. జన్మదినాలు కూడా ఆంగ్లతేదీల ననుసరించి జరుపు కుంటున్నాం. ఇది సరియైన పద్ధతికాదు. ఎందుచేతనంటే - ఒక బాలుడు పౌర్ణమి రోజున జన్మిస్తే ఆంగ్ల తేదీల ప్రకారం జన్మదినం జరుపుకుంటే అది పౌర్ణమికాక మరొక దినం అవుతుంది. అప్పుడది సృష్టి క్రమానికి భిన్నంగా జరుపుకొన్నట్లవుతుంది. కనుక మేధావు లాలోచించి చాంద్రమాన తిథి నక్షత్రాల ననుసరించి జన్మదినాలు మొదలగునవి జరుపుకోవటం మంచిది.

జన్మదినం రోజున పరమేశ్వర స్తుతి ప్రార్థనలు చేసి అగ్నిహోత్రం చేసుకుంటే మంచిది. తిథి నక్షత్రాలతోను వాటి దేవతా నామములతోను విశేషహోమం చేసుకుంటే ఆదర్శంగా ఉంటుంది. మనస్సు, వాతావరణం ప్రసన్నమౌతాయి. ఆ దినం దీపాలు ఆర్పటంమాని దీపాలు వెలిగిస్తే ఆ వెలుగు జీవితంలోకి ప్రవేశిస్తుంది. మన ఋషులు ఏర్పరచిన సంస్కృతి మానవుని దేవతను చేయుటకొరకే.

మనం ఇంతవరకు మన ధర్మగ్రంథాలైన వేదాలను గురించి, వేదశాఖలను గురించి, వేదాంగాలైన శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త ఛందో జ్యోతిషాలను గురించి సంక్షిప్తంగా తెలుసుకున్నాము. ఇక మనం వేదాలకు గల ఉపాంగాలను గురించి తెలుసుకుందాము.

# ఉపాంగములు (దర్శనములు)

సామాన్యంగా శరీరంలోని భాగాలను, అవయవాలను అంగము లంటారు. వాటికి సహకరించేవాటిని ఉపాంగాలంటారు. కాని, మన ధర్మశాస్త్రాలలో అంగములంటే పై ప్రకరణంలో చెప్పుకున్న శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త ఛందో జ్యోతిషము లనే ఆరు గ్రంథాలు. ఇవి వేదార్థాన్ని తెలుసుకోవడానికి మిక్కిలిగా ఉపయోగపడతాయి. కనుక వీటిని వేదాంగాలన్నారు. అట్లే, వైశేషిక న్యాయ సాంఖ్య యోగ పూర్వమీమాంసా ఉత్తరమీమాంస లారింటిని ఉపాంగాలన్నారు. ఇవికూడా వేదార్థాన్ని గ్రహించడానికి ఉపయోగపడతాయి. వీటిని షట్ శాస్త్రాలని కూడా అంటారు. వీటికి దర్శనాలని మరొక పేరు. ఇవి సృష్టిని చక్కగా చూపిస్తాయి. అంటే జ్ఞాన పూర్వకంగా దర్శింపచేస్తాయి. కనుక వీటికి దర్శనాలనే పేరు పెట్టారని తత్త్వవేత్త లంటారు. ఇవి నిజంగా మన బుద్ధికి పదునుపెట్టి సృష్టి రహస్యాలను తెలిపే అద్భుత పరికరాలు - ఉపాంగాలు. మన వైదికధర్మం ఆస్తిక దర్శనాలైన వైశేషిక న్యాయ సాంఖ్య యోగ మీమాంసా వేదాంత దర్శనా లనే ఆరింటినే అంగీకరిస్తుంది. మన దేశంలో వ్రాయబడినవైనా చార్వాక జైన బౌద్ధ దర్శనాల నంగీకరించదు. ఎందుకన అవి పరమేశ్వరు నంగీకరించవు. మన వైదిక ధర్మలక్ష్యం కేవలం దుఃఖ నివృత్తిమాత్రమేకాదు. దుఃఖ నివృత్తితో బాటు పరమానంద ప్రాప్తిని పొంది చిరకాలం ఆ ఆనందాన్ని అనుభవిస్తూ స్వేచ్ఛగా విహరించటం. అభ్యుదయంతోబాటు ఉత్తమ సుఖ ప్రాప్తిని పొందటం. అందుకు దర్శన జ్ఞానం అద్భుతంగా ఉపకరిస్తుంది. వీటిని గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాము.

## వైశేషిక దర్శనం

మనవంటి సామాన్యులు మొదట చదువతగిన దర్శనగ్రంథం వైశేషికం. దీని రచయిత కణాద మహర్షి. ఈయన అపరిగ్రహవ్రత శీలుడు. రైతులు పంటలను కోసుకొని తీసుకువెళ్ళిపోయిన తరువాత పొలాలలో రాలిన ధాన్యపు గింజలను పక్షులవలె ఏరుకుని భుజించి కడుపునింపుకొనే వాడట. అందుకని ప్రజలు కణ + అదుడు = కణాదు డనే పేరుతో పిలుచుకునే వారట. కాలాంతరంలో ఆ పేరే ఆయనకు స్థిరపడిపోయింది. ఇది కీస్తుపూర్వం 6వ

శతాబ్దంలో వ్రాయబడినట్లు చరిత్రకారులు చెబుతారు. ఎట్టి ఆధునిక విజ్ఞాన పరికరాలులేని ఆనాడు కణాద మహర్షి దైవం నిర్మించి యిచ్చిన యింద్రియా లనే పరికరాల సాయంతో బుద్ధి అనే ప్రయోగ శాలలో సృష్టిలోని పదార్థాలను పరిశోధించి వ్రాసిన అద్భుత వైజ్ఞానిక గ్రంథం – వైశేషిక దర్శనం.

కణాదమహర్షి సృష్టిలోని మూల ద్రవ్యాలను తొమ్మిదిగా లెక్కిస్తాడు. అవి – పృథి వ్యాప స్తేజో వాయు రాకాశము లను పంచభూతములు మరియు కాలము, దిక్కు, ఆత్మ, మనస్సులు. ఆయన సృష్టిలో మొత్తం 24 గుణాలను గుర్తించాడు. ఏ ద్రవ్యంలో ఏ యే గుణాలున్నాయో తెలిపాడు. కేవలం ప్రతిపాదించడమే కాక ప్రతీ పదార్థాన్ని పరీక్షించి నిరూపించాడు. కర్మను నిర్వచించాడు. సామాన్య విశేష సమవాయాలను కూడా పదార్థాలుగా లెక్కించి వాటిని గురించి వివరించి చెప్పాడు. వీటన్నిటి యొక్క సాధర్మ్య వైధర్మ్యాలను గురించి చక్కగా తెలిసికొన్నపుడే నిశ్శ్రేయసం (ముక్తి) ప్రాప్తిస్తుందన్నాడు. మరెన్నెన్నో వైజ్ఞానిక విషయాలు ఈ శాస్త్రంలో ఉన్నాయి.

మహర్షి కణాదుడు ధర్మానికి చెప్పిన నిర్వచనం విశిష్టంగా ఉంటుంది. – **"యతో౽భ్యుదయ నిఃశ్రేయస సిద్ధిః స ధర్మః" (వై.ద. 1-1-2)** – దేనివల్ల అభ్యుదయ నిః శ్రేయసాలు సిద్ధిస్తాయో అది ధర్మం" అంటాడు. అభ్యుదయం అంటే ఇహలోక పరలోక ఉన్నతులు. నిఃశ్రేయస మంటే గొప్ప శ్రేయస్సు - ముక్తి. సర్వ దుఃఖాల నుండి విముక్తిని చెంది పూర్ణానందాన్ని పొందటం. అందుకు పదార్థ విజ్ఞానం అవసరమంటాడు మహర్షి. పదార్థాలలోని సాధర్మ్యాలను (సమాన ధర్మాలను) వైధర్మ్యాలను (విశేష ధర్మాలను) చక్కగా తెలుసుకున్నవాడే దుఃఖాలనన్నిటిని అధిగమిస్తాడంటాడు ఈ మహర్షి.

ద్రవ్యాలలో ప్రపంచానికి మూల కారణాలైన పంచభూతాలనేకాక కాలాన్ని, దిక్కును, ఆత్మను, మనస్సును కూడా ద్రవ్యాలుగానే పరిగణిస్తాడు కణాద మహర్షి. నేటి వైజ్ఞానికులుకూడా కాలము దిక్కు (టైమ్ అండ్ స్పేస్) ప్రతి పదార్థానికి ఉంటాయంటారు. మనోవిజ్ఞానవేత్తలు మనస్సును ఒక ద్రవ్యంగా అంగీకరించి దాని గుణ కర్మ స్వభావాలను తెలుసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. వీటిలో ఆత్మతప్ప మిగిలిన వన్నీ జడపదార్థాలే. అంటే జ్ఞానం లేనివే. ఈ

సృష్టిని జాగ్రత్తగా పరిశీలిస్తే కేవలం జడపదార్థాలే కాక జ్ఞానం కలిగిన ఆత్మలు అనేకం మనకు కనబడతాయి. వీటిని జీవాత్మ లంటారు. ఇవి ఒక్కొక్క శరీరంలో ఒక్కొక్కటి ఉంటుంది. ఇచ్ఛా ద్వేష ప్రయత్న సుఖ దుఃఖ జ్ఞానాలను కలిగి ఉంటుంది. నిమేష ఉన్మేష శ్వాస ప్రశ్వాసాది జీవన క్రియలు కనబడతాయి. ఇట్టి జీవులతో బాటు బృహత్ చేతన పదార్థం మరొకటి సర్వాంతర్యామిగా ఉంది. అదే పరమాత్మ.

ఆ పరమాత్మయే జడ ప్రకృతిని ప్రపంచంగా మార్చింది. జీవులకు వారు చేసిన కర్మలకు ఫలంగా తగిన దేహాలను సృజించింది. అందు ఉత్తమ ప్రాణిగా మానవుని సృజించింది. అట్టి మానవునికి వేదజ్ఞానం యిచ్చి ఇహలోక సుఖాలకు, ముక్తికి మార్గం చూపింది.

ప్రపంచ పదార్థాలకు పేర్లు పెట్టింది కూడా వేదమే నంటాడు కణాదమహర్షి. సృష్టిలో తాను గుర్తించిన పదార్థాలకు పెట్టిన పేర్లు వేదమూలకములేనంటూ అనేక చోట్ల **'తస్మాదాగమికమ్'** అని సూత్రీకరించాడు. **'తద్వచనా దామ్నాయస్య ప్రామాణ్యమ్'** (వై.ద. **1-1-3**) అంటూ ప్రారంభించి **తద్వచనా దామ్నాయస్య ప్రామాణ్యమ్** (వై.ద. **10-2-10**) అంటూ ముగిస్తాడు పరమ ఆస్తికుడైన కణాదమహర్షి. "వేదాలలో బీజరూపంలో చెప్పబడిన పదార్థవిజ్ఞానాన్నే నేను వివరించి చెప్పాను. ఒకవేళ నా శాస్త్రంలో వేదానికి భిన్నంగా ఏదైనా విషయం కనబడితే దానిని మీరు అంగీకరించనవసరంలేదు. ఈ విషయంలో వేదమే పరమ ప్రమాణం (అంతిమ నిర్ణయం)" అని ఈ వాక్యం యొక్క భావం.

ఈ దర్శనానికి ప్రశస్తపాదమహర్షి వ్రాసిన భాష్యం విశిష్టంగా ఉంటుందని విద్వాంసులంటారు.

## న్యాయదర్శనం

**'ప్రమాణై రర్థ పరీక్షణం న్యాయః'** - ప్రమాణములతో వస్తువు యొక్క వాస్తవికతను తెలుసుకోవటాన్ని 'న్యాయం' అంటారు. సత్యాన్ని తెలుసుకోవటానికి తర్కించవలసి వస్తుంది. ఆ తర్కం ఎలా చేయాలో, ఏ విధంగా తర్కిస్తే

సత్యం బోధపడుతుందో ఈ శాస్త్రంలో చెప్పబడింది. దీని రచయిత గౌతమ మహర్షి. ప్రమాణ ప్రమేయాది 16 పదార్థాల (విషయాల) ను చక్కగా తెలుసుకోవటంవల్ల నిఃశ్రేయసం కలుగుతుందంటూ ఈ శాస్త్రాన్ని ప్రారంభించటం జరిగింది. వీటిలో అన్నిటికన్న ముఖ్యమైనది ప్రమాణజ్ఞానం. ప్రమాణం అంటే జ్ఞాన సాధనం. ఇవి మొత్తం ఎనిమిదయినప్పటికి నాలుగుగా వర్గీకరించవచ్చును. అవి -

**1. ప్రత్యక్షము :**

**ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞాన మవ్యపదేశ్య మవ్యభిచారి వ్యసాయాత్మకం ప్రత్యక్షమ్ (న్యాయదర్శనం. 1-1-4)**

ప్రతీ యింద్రియంతో కలిగే జ్ఞానం ప్రత్యక్ష మనబడుతుంది. ఈ జ్ఞానం యింద్రియాలకు వాటి విషయాలతో సంబంధ మేర్పడినపుడు కలుగుతుంది. కాని, అది భ్రమాత్మకము కాని, సంశయాత్మకము కాని, వస్తువు యొక్క పేరు వినగానే మనస్సులో కలిగేదిగా కాని ఉండకూడదు.

**2. అనుమానము :**

**'అథ తత్పూర్వకం త్రివిధమనుమానం
పూర్వవచ్ఛేషవత్సామాన్యతో దృష్టం చ' (న్యాయ. 1-1-5)**

ఇది కొంత ప్రత్యక్షపూర్వకంగా ఉంటుంది. ఉదా : పొగను చూచి అక్కడ నిప్పు ఉన్నట్లు అనుమానించటం. ఈ అనుమానము మూడు రకాలుగా ఉంటుంది.

**అ) పూర్వవదనుమానము** – కారణమును చూచి కార్యము నూహించటం. – దట్టమైన మేఘాలను చూచి వర్షము నూహించటం.

**ఆ) శేషవదనుమానము** – కార్యమును జూచి కారణము నూహించటం. నదీ ప్రవాహాన్ని చూచి పైన వర్షము కురిసినట్లూహించటం, పుత్రుని జూచి తల్లిదండ్రుల నూహించటం.

**ఇ) సామాన్యతో దృష్టము** – ఎవరైనా కొండపైన కనబడితే వారు ఎక్కేటప్పుడు మనం చూడకపోయినా వారు కొండను ఎక్కినట్లు ఊహిస్తాము కదా !

3. ఉపమానము : "ప్రసిద్ధ సాధర్మ్యాత్ సాధ్య సాధన ముపమానమ్" (న్యాయ. 1-1-6) - రెండు వస్తువులలోనుండు సాదృశ్యజ్ఞానంతో తెలియని వస్తువును తెలియ చెప్పటం.

ఉదా : గ్రామాలలో ఉండే గోవులవలెనే అడవిలో ఉండే గవయువా (అడవియావు) లుంటాయని తెలియ చెప్పటం. అడవికి వెళ్ళిన వ్యక్తి అక్కడ ఆవువంటి జంతువును చూచి అది గవయవ మని గుర్తించటం.

4. శబ్దప్రమాణము : 'ఆప్తోపదేశః శబ్దః' (న్యాయ. 1-1-7) ఆప్తులంటే - పూర్ణవిద్వాంసులు (బాగా తెలిసినవారు), ధర్మాత్ములు, పరోపకార ప్రియులు, సత్యవాదులు, జితేంద్రియులు, పక్షపాతం లేనివారు. అట్టి పెద్దలు చెప్పు వాక్యములు ప్రమాణముగా స్వీకరించవచ్చును. ఉదా : వాల్మీకిఋషి వ్రాసిన రామాయణము, వ్యాసమహర్షి వ్రాసిన భారతము (అయితే వీటిలో ప్రక్షిప్తములు లేకుండా ఉండాలి). పరమ ఆప్తుడు పరమేశ్వరుడు చెప్పిన వేదము శబ్దప్రమాణములన్నిటికన్న గొప్ప ప్రమాణం.

గౌతమ మహర్షి ఈ నాలుగు ప్రమాణాలతోబాటు ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావము అనే మరొక నాలుగు ప్రమాణాలను తమ దర్శనంలో వివరించారు. అయితే, ఈ నాలుగు ప్రమాణాలు పై నాలుగింటిలో యిమిడిపోతాయి. అందుచే వాటిని వివరించటం లేదు.

ఈ శాస్త్రం ముఖ్యంగా యుక్తికీ, తర్కానికి సంబంధించినది. శాస్త్రార్థాలు చేసేవారి కిది చాలా అవసరం. ఇది తర్క ప్రధానమైనప్పటికీ ఆత్మ పరమాత్మల నంగీకరిస్తుంది. ఇచ్ఛా ద్వేష ప్రయత్న సుఖ దుఃఖ జ్ఞానాలు జీవాత్మకు లక్షణాలని ప్రతిపాదిస్తుంది. పరమాత్మ సర్వవ్యాపకము, సృష్టి స్థితి లయాలకు కర్త, జీవులు చేసే కర్మలకు ఫలదాత అని అంగీకరిస్తుంది. పదార్థాల యథార్థజ్ఞానం కలగటంవల్ల మిథ్యాజ్ఞానం తొలగిపోయి క్రమంగా జీవునిలోని రాగ ద్వేష మోహ లోభాదులు నివృత్తి చెందుతాయనీ, తద్వారా అతని కర్మలు పవిత్రమై పరమాత్మ సాక్షాత్కారాన్ని కలిగిస్తాయనీ, దానితో అతడు సమస్త దుఃఖాలనుండి విడివడి ముక్తిని పొందుతాడనీ ఈ శాస్త్రం బోధిస్తుంది. ఈ శాస్త్రాధ్యయనంవల్ల ధార్మిక విషయాలనే గాక వ్యవహార విషయాలనుకూడా

తర్కించి సత్యాన్ని తెలుసుకోగల సూక్ష్మ బుద్ధి లభిస్తుంది. అన్నిరంగాలలోను ఉన్నతి కలుగుతుంది. ఈ దర్శనంపై వాత్స్యాయన మహర్షి వ్రాసిన ప్రామాణిక భాష్యం విశిష్టంగా ఉంటుంది.

## సాంఖ్యదర్శనం

సాంఖ్యం అంటే సంఖ్యాసంబంధమైనదని (25 తత్వములను తెలుపునదని) అర్థం. ఈ దర్శనంలో 25 తత్వములను గురించి చెప్పబడింది అందుచే ఈ శాస్త్రానికి సాంఖ్యశాస్త్రం అనే పేరు వచ్చింది. కాలాంతరంలో సాంఖ్యం అంటే వివేచనయనీ, ముఖ్యంగా ప్రకృతి పురుష వివేచనయనీ, అట్టి వివేచనాత్మక శాస్త్రమనీ లోకంలో స్థిరపడిపోయింది. ఈ సాంఖ్యదర్శన కర్త కపిలమహర్షి, దర్శనాలన్నిటికన్న యిదే ప్రాచీనతమ దర్శనమని చరిత్రకారులు చెబుతారు.

కపిలమహర్షి జన్మస్థానం సరస్వతీనదీ తీరమనియు, కర్దమ ప్రజాపతికి – మనువు పుత్రికయైన దేవహూతికి జన్మించిన సంతానమనియు మన ప్రాచీన గ్రంథాలలో వ్రాయబడి ఉంది. పూర్వం ఉత్తర భారతదేశంలో 'సరస్వతీ' అనే పేరుతో ఒక పెద్ద నది ఉండేదనీ, భూకంపాలవల్లనో, భూమిలో ఏర్పడిన మార్పులవల్లనో అది తన అస్తిత్వాన్ని కోల్పోయిందనీ చరిత్రకారు లంటారు. ఇప్పటికీ ఆ నది చిహ్నాలు కొన్ని కనబడుతున్నాయి. అంబాలా జిల్లాలో ఉత్తరాన (ఈశాన్యమూల) సిరిమూర్ రాజ్యంలో (నాహన్ స్టేట్‌లో) ఈ నది ప్రవహించిన చిహ్నాలున్నాయి. 'శివాలక' పర్వత పంక్తిలో 'ఆదిబద్రీ' అనే కనుమనుండి సరస్వతీనది బయటపడి సమతలమున ప్రవహించింది. 5, 6 మైళ్ళ పైన హరిపుర కనుమ నుండి మరియొక శాఖ బయలుదేరి వచ్చి ఈ నదిలో కలుస్తూ ఉండేది. ఆ నదీప్రవాహ తీరంలో రేణుక యనెడి సరస్సునకు కొద్ది దూరంలో ఒక పెద్ద కొండపై రెండు చిన్న చిన్న శిఖరాలున్నాయి. అందులో ఒక దానిపేరు 'కపిలటిబ్బ' రెండవదాని పేరు 'జమదగ్ని'. ఆ కపిలటిబ్బ పైననే కర్దమ ప్రజాపతి వసించియుండవచ్చును. అచ్చటనే కపిల మహర్షి జన్మించి యుండవచ్చును.

ఈ శాస్త్రంలో ముఖ్యంగా ప్రకృతి – పురుష వివేచన చేయబడింది. సత్వము, రజస్సు, తమస్సు అనబడే మూడు రకాల పరమాణువులు

సామ్యావస్థలో ఉన్నపుడు అది ప్రకృతి అనబడుతుంది. అట్టి ప్రకృతితో పరమేశ్వరుడు (జీవులకు కర్మఫలాల నివ్వటానికి) ఈ విశ్వాన్ని సృజిస్తాడు. ఆ సృష్టి ఈ క్రింది క్రమంలో జరుగుతుందని కపిల మహర్షి అంటాడు.

**సత్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః** – సత్వ రజ స్తమస్సులు మూడూ గుణాలని మన శాస్త్రాలలో చెప్పబడినా అవి గుణాలుకావు. ద్రవ్యాలే. అంటే సూక్ష్మమైన పరమాణువులు. వీటిలో సంయోగ విభాగ చలత్వాది గుణాలు స్వాభావికంగా ఉంటాయి. ఇవి ద్రవ్యాలయినప్పటికీ గుణాలని ఎందుకన్నారంటే గుణపదమునకు త్రాడు అనే అర్థంకూడా ఉంది. ఈ మూడూ జీవుని ప్రకృతితో తాళ్ళుమాదిరిగా బంధిస్తున్నాయి. కనుక వీటిని గుణా లన్నారు. ఈ మూడు ద్రవ్యాలు సామ్యావస్థలో ఉంటే – అంటే హెచ్చుతగ్గులుగా పరస్పరం కలవకుంటే సృష్టి ఏర్పడదు. అప్రకేతంగా – గాడాంధకారంగా ఉంటుంది. ఆ స్థితిని ప్రళయమంటారు. ఆ సామ్యవస్థలోనున్న పరమాణువులను హెచ్చుతగ్గులుగా కలుపుతూ పరమేశ్వరుడు ఈ సృష్టిని చేస్తాడు. ఆ క్రమంలో వరుసగా ఈ క్రింది మార్పులు జరుగుతాయి.

**ప్రకృతేర్మహాన్** – ప్రకృతినుండి మొదటి పరిణామంగా 'మహతత్వ' మనే పదార్థం పుడుతుంది.

**'మహతోఽహంకారః'** మహతత్వాన్నుండి తరువాత పరిణామంగా 'అహంకార' మనే పదార్థం పుడుతుంది. (ఇచ్చట అహంకార మంటే మానవులలో కనబడే గర్వప్రవృత్తికాదు. ఇది ఒక జడమైన సూక్ష్మపదార్థం).

**'అహంకారాత్ పంచ తన్మాత్రాణి ఉభయ మింద్రియం'**

అహంకార మనబడే పదార్థాన్నుండి పంచ తన్మాత్రలు మరియు ప్రాణులలో గుర్తింపబడే జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు, మనస్సు. ఇవి అన్నీ కలిసి 16 ఏర్పడతాయి.

**తన్మాత్రేభ్యః స్థూల భూతాని** – పై వాటిలోని పంచ తన్మాత్రల నుండే మనకు ఇంద్రియ గోచరమయ్యే భూమి జలము అగ్ని వాయువు ఆకాశము అను పంచ స్థూలభూతాలు సృజింపబడ్డాయి.

ఈ విధంగా ఒకటైన ప్రకృతి 23 రకాలుగా మార్పు చెందింది. అప్పుడు

ప్రకృతిని కూడా కలుపుకుంటే 24 తత్వాలయ్యాయి. ఇవన్నీ జడములే. అంటే వీటిలో ఏ ఒక్కదానిలోనూ జ్ఞానం లేదు.

సృష్టిని పరిశీలించి చూస్తే జడపదార్థాలతోబాటు కొన్ని చేతన తత్వాలు కనబడుతున్నాయి. వాటిని జీవు లంటారు. అవి ఒకటికాక అనేకంగా ఉన్నాయి. అయినా ఆ జీవులన్నిటిని జ్ఞానం కలిగిన ఒక రకమైన తత్వంగా ఈ శాస్త్రంలో చెప్పబడింది. ఈ చేతన తత్వాన్నికూడా కలుపుకుంటే సృష్టిలో మొత్తం 25 తత్వాలు కనబడతాయి.

వీటిలోని చేతన తత్వానికి ఈ శాస్త్రం 'పురుషుడు' అని పేరు పెట్టింది. ఈ పురుషుడు ప్రకృతితో ఏర్పడిన పదార్థాల కన్నిటికంటెను భిన్నంగా ఉంటాడు. అంటే – శరీరంలో ఉండికూడా శరీరంకన్న ఇంద్రియాలకన్న మనస్సుకన్న బుద్ధికన్న వేరుగా శ్రేష్ఠంగా ఉంటాడు. ఇతడు నిత్యుడు – ఎప్పటికీ ఉంటాడు. చావు పుట్టుకలు శరీరాలకే కాని జీవున కుండవు.

పురుషుని సాన్నిధ్యంతో బుద్ధి జ్ఞానివలె సమస్త కార్యాలు చేస్తుందనీ, బుద్ధిచే చేయబడిన కార్యాలకు తానే కర్తనని జీవు డనుకుంటాడనీ సాంఖ్యులు చెబుతారు. ఈ విధంగా బుద్ధికీ, తనకు గల భేదాన్ని గుర్తించేవరకు జీవుడు ప్రకృతిబద్ధుడై ఉంటాడనీ, ఈ భేదాన్ని గుర్తించి సాక్షాత్కారం చేసుకున్న జీవుడు బంధవిముక్తుడై ముక్తిని (కైవల్యాన్ని) పొందుతాడనీ ఈ శాస్త్రం చెబుతుంది.

కొందరు ఈ దర్శనంలోని 'ఈశ్వరాసిద్ధేః' (సాంఖ్య (1–92) అను సూత్రాన్ని చూచి దీనిని నాస్తిక దర్శనం – ఈశ్వరుని అంగీకరించని శాస్త్రం అంటారు. ఇది సత్యంకాదు. ఆ సూత్రం యొక్క ప్రకరణాన్నిపరిశీలిస్తే ఈశ్వరుడు ప్రత్యక్ష ప్రమాణంతో సిద్ధింపడనియే ఆ సూత్రాని కర్థం అవుతుందికాని ఈశ్వరుడు లేనే లేడని కాదు. కపిల మహర్షి ఈశ్వరుని అంగీకరించకుంటే 'ఈశ్వరాభావాత్' అని వ్రాసేవారు. ఇంతేకాక, ఈ దర్శనంలోని ప్రథమాధ్యాయం చివరిలోని (1–160 నుండి 1–164 వరకుగల) సూత్రాలలో పరమేశ్వరుడు ప్రకృతి, పురుషుల (జీవుల) కన్న భిన్నమైన స్వరూపం కలవాడనీ, ఈ జీవుడు కేవలం శరీర యింద్రియాదులకు సాక్షి అయితే పరమేశ్వరుడు జగత్‌కు సాక్షియనీ చెప్పబడింది. పరమేశ్వరుడు నిత్యముక్తుడనీ,

అత డిచ్చిన వేదజ్ఞానం పరమ ప్రమాణమనీ కూడా ఈ శాస్త్రం చెబుతుంది. కాన, ఇది ఆస్తిక దర్శనమే.

## యోగదర్శనం

యోగదర్శన కర్త పతంజలి మహర్షి సుమారు 3,000 సంవత్సరాలకు పూర్వం ఆ కాలం నాటికి వ్యాపకంలోనున్న యోగ పద్ధతుల నన్నిటినీ సమీక్షించి వేదాల మార్గదర్శనంలో ఈ శాస్త్రాన్ని రచించాడు. ఈ మహానుభావుడు చిత్త మాలిన్యాలను తొలగించటానికి యోగదర్శనాన్ని, శారీరక మాలిన్యాలను పోగొట్టడానికి వైద్యశాస్త్రమైన చరకాన్ని, భాషాదోషాలను అరికట్టడానికి వ్యాకరణ గ్రంథమైన మహాభాష్యాన్ని వ్రాసి తరతరాలకు మహోపకారం చేసాడు.

సాంఖ్యశాస్త్రం ప్రకృతి–పురుష వివేక జ్ఞానాన్ని కలిగించగా ఈ శాస్త్రం సాధన చేసి వాటిని సాక్షాత్కారం చేసుకునే మార్గాన్ని సూచిస్తుంది. కేవలం 195 సూత్రాలలో పతంజలి మహర్షి యోగాన్ని గూర్చిన పూర్తి సమాచారాన్ని ఈ శాస్త్రంలో పొందుపరచారు. యోగం అంటే కలయిక, ప్రాప్తం అనే వేరే అర్థాలున్నా ఈ శాస్త్రంలో యోగ పదం సమాధిని సూచిస్తుంది. సమాధి అంటే ఏమిటో కూడా ముందుగానే మహర్షి తెలిపారు. **"యోగః చిత్తవృత్తి నిరోధ"** (యోగదర్శనం 1–2). యోగం (సమాధి) అంటే చిత్త వృత్తులను నిరోధించడం. అంతఃకరణంలో (మనస్సులో) కలుగు ఆలోచనలను నిలిపివేయడం. తద్వారా ఆత్మ, పరమాత్మల సాక్షాత్కారం పొందటం. పరమానందాన్ని అందుకోవడం. పతంజలి మహర్షి ఈ శాస్త్రంలో చిత్తవృత్తులు అయిదు రకాలుగా ఉంటాయనీ, వాటిని అభ్యాస వైరాగ్యాల ద్వారా నిరోధించవచ్చుననీ సూచించారు. ఆ విధంగా నిరోధించినపుడు ద్రష్టయైన జీవుడు తన స్వస్వరూపంలో ఉంటాడు. మిగిలిన సమయమంతా చిత్తవృత్తులతో సారూప్యం (ఏకరూపత) చెందుతూ ఉంటాడు. వృత్తి నిరోధంకొరకు దీర్ఘకాలం నిరంతరాయంగా సాధనచేస్తూ ఉండాలి. ఆ సాధన ఏ విధంగా చేయాలో రెండవ అధ్యాయం (సాధన పాదం) చెబుతుంది.

**'తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియా యోగః'** – తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము క్రియాయోగ మంటూ ఈ

సాధన పాదం ప్రారంభమౌతుంది. తపస్సు అంటే ద్వంద్వ సహనం. శీతోష్ణాలను, సుఖదుఃఖాలను, మానవమానాలను, జయాపజయాలను, హానిలాభాలను సమాన దృష్టితో చూస్తూ సహించటం. లాభం కలిగినపుడు పొంగిపోక, నష్టం కలిగినపుడు క్రుంగిపోక స్థితప్రజ్ఞతతో ఉండటం.

స్వాధ్యాయం అంటే ప్రణవజపం. లేదా మోక్షశాస్త్రాల అధ్యయనం. ప్రణవం అంటే ఓంకారం. పతంజలి మహర్షి పరమేశ్వర స్వరూపాన్ని ఒక సూత్రంలో వివరించి అట్టి పరమేశ్వరుని నామం **(తస్య వాచకః ప్రణవః)** ఓమ్ అంటారు. ఆ ప్రణవనామాన్ని - **(తజ్జప స్తదర్థ భావనమ్)** అర్థ భావనతో జపం చేయమంటారు.

ఈశ్వర ప్రణిధాన మంటే పూర్ణ పురుషార్థంతో వేదవిహిత సత్కార్యముల నాచరించి ఆ కర్మలను, వాటి ఫలములను పరమేశ్వరున కర్పించటం. ఈ విధంగా ప్రారంభింపబడిన సాధన పాదం సాధనను గురించి చాలా విషయాలు చెబుతుంది. వానిలో ముఖ్యమైనవి అష్టాంగములు.

**"యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార**

**ధారణా ధ్యాన సమాధయో ఽ ష్టావంగాని " (యో.ద. 2-29)**

యమములు, నియమములు, ఆసనము, ప్రాణాయామము ప్రత్యాహారము, ధారణా, ధ్యానము, సమాధి అనునవి యోగమునకు అంగములు. అనగా సాధనములు. వీటిని మెట్లు అని కూడా చెప్పవచ్చును.

**యమములు :** అహింస ( ఏ ప్రాణినీ ఎప్పుడూ ఏ విధంగాను హింసపకుండటం), సత్యం (యథార్థాన్ని ప్రియంగా చెప్పటం), అస్తేయం (దొంగిలించకుండటం. అనుమతి లేకుండా యితరుల వస్తువులను తీసికొనకుండటం), బ్రహ్మచర్యం (సంతాన ప్రాప్తికొరకు మాత్రమే వీర్యాన్ని ఖర్చుపెడుతూ మిగిలిన సమయాలలో సంయమంగా ఉండటం), అపరిగ్రహం (తన అవసరమునకు మించిన వస్తువులను సంగ్రహించకుండా ఉండటం)-ఈ ఐదును యమములు.

**నియమములు :** శౌచము (జలముతో బాహ్య శరీర శుద్ధిని, సాత్త్విక మితాహారంతో ఉదరమును శుద్ధముగా ఉంచుకోవటం. మనస్సును

సత్యముతోను, బుద్ధిని జ్ఞానముతోను, ఆత్మను విద్యా తపస్సులతోను శుద్ధము చేసుకోవటం), సంతోషము (న్యాయముగా తనకు లభించిన వాటితో తృప్తిచెంది సదా ప్రసన్నముగా ఉండటం), తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము- ఈ ఐదును నియమములు.

**ఆసనం : 'స్థిర సుఖ మాసనమ్' (యో. 2-49)**

ఏ యిబ్బందీ లేకుండా స్థిరంగా సుఖంగా ఎక్కువ కాలం కూర్చుండటానికి అనువైనది ఆసన మని అర్థం. యోగేశ్వర శ్రీ కృష్ణుడు చెప్పినట్లు - శుచియైన ప్రదేశంలో ఎక్కువ ఎత్తుగాగాని, ఎక్కువ పల్లముగాగాని లేనివిధంగా ఒక ఆసనాన్ని (కూర్చుండుటకు తగిన పీటను లేదా నేలను) ఎంచుకోవాలి. దానిపై చేలాజిన కుశోత్తరములను పరచి (క్రింద ధర్భాసనం, దానిపైన మృగచర్మమో లేక ఉన్ని కంబలియో వేసుకొని, దానిపై శుభ్రమైన వస్త్రాన్ని పరచుకొని) సిద్ధం చేసుకోవాలి. అట్టి బాహ్యాసనంపై పద్మాసనం లేదా సిద్ధాసనం వేసుకొని కూర్చోవాలి.

**ప్రాణాయామం :** నేడు లోకంలో పలురకాల ప్రాణాయామాల ప్రచారం జరుగుతోంది. వాటివల్ల కొన్ని ఆరోగ్య లాభాలు కలుగుతున్నాయి. ఆరోగ్యం కోసం ఆ యా ప్రాణాయామాలను ఆచరించవచ్చు. కాని, యోగసాధనకు పతంజలి మహర్షి నాలుగు రకాల ప్రాణాయామాలను మాత్రమే సూచించారు. అవి - 1. బాహ్య ప్రాణాయామం (రేచక ప్రాణాయామం), 2. ఆభ్యంతర ప్రాణాయామం (పూరక ప్రాణాయామం), 3. స్తంభవృతి ప్రాణాయామం (కుంభక ప్రాణాయామం), 4. బాహ్యాభ్యంతర విషయాక్షేపీ (రేచక పూరకముల నపేక్షింపక శ్వాస ప్రశ్వాసముల గతిని ఎక్కడ కక్కడ నిలిపివేయటం).

ఈ ప్రాణాయామాల వివరణను పుస్తకం ద్వారా తెలుపుట కష్టమే. అనుభవజ్ఞుల సమక్షంలో అభ్యసించటమే ఉత్తమం.

**ప్రత్యాహారం :** మనస్సును ఇంద్రియ విషయాల వైపు పోకుండా నిగ్రహించటం. మనసును తన వశంలో పెట్టుకుంటే యింద్రియాలు వాటంతటవియే వశమౌతాయి.

**ధారణ : 'దేశబన్ధ చిత్తస్య ధారణా' (యో. 3-1)**

మనసును ఒకచోట నిలిపి ఉంచటం. నాభి, హృదయము, కంఠము, నాసికాగ్రభాగము, భృకుటి, బ్రహ్మరంధ్రము మొదలైన ఏదేని ఒక అనుకూల స్థానంలో మనసును బంధించి ఉంచటం.

**ధ్యానము : 'తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్' (యో. 3-2)**

చిత్తమును ధారణ చేసినచోట ఒకే విషయమును గూర్చిన జ్ఞాన ప్రవాహమును తైలదారవలె తెంపులేకుండా ప్రవహింపజేయటం ధ్యాన మనబడుతుంది. (పరమేశ్వరుని ముఖ్యనామమైన **ఓ3మ్** ను అర్థ భావనతో చింతన చేయటం ఎక్కువ అనుకూలంగా ఉంటుంది).

**సమాధి :**

**"తదేవార్థ మాత్రనిర్భాసం స్వరూప శూన్యమివ సమాధిః"**

(యో. 3-3)

పైన చెప్పిన ధ్యానమే పరిపక్వమై కేవలం ధ్యేయవస్తువైన పరమాత్మ జ్ఞానమున భాసిస్తూ తన స్వరూపాన్ని మరచిపోవటం సమాధి. అంటే, పరమాత్ముని ధ్యానంలో తనను తాను మరచిపోవటం. ధ్యాత, ధ్యానము, ధ్యేయము ఒకటిగా మారిపోవటం. కేవలం ధ్యేయమైన పరమేశ్వర స్వరూపమే భాసించటం. ఆ స్థితిలో జీవుడు పరమానందాన్ని అనుభవిస్తాడు. అట్టి అనుభవాన్ని పొందిన ఒక ఋషి ఆ ఆనందాన్ని ఈ విధంగా కీర్తిస్తాడు.

**సమాధి నిర్ధూత మలస్య చేతసో । నివేశిత స్యాత్మని**
**యత్సుఖం భవేత్ । న శక్యతే వర్ణయితుం గిరా ।**
**తదా స్వయం తదంతః కరణేన గృహ్యతే ॥**

"స్థిర సమాధిచే నిర్మలమైన చిత్తముతో ఆత్మపరమాత్మల దర్శించినపుడు కలుగు ఆ అతీంద్రియసుఖమును వర్ణించుటకు నా మాటలు చాలవు. ఎవరంతట వారే దానిని దర్శించి అనుభవించ వలసినదే." అంటాడు.

మూడవ అధ్యాయంలో - యోగాభ్యాసం చేస్తూ ఉంటే అనేక విభూతులు (అంటే సిద్ధులు) కలుగుతాయని చెప్పబడింది. అయితే ఆ సిద్ధుల ఆకర్షణలో పడి లక్ష్యాన్ని మరచిపోతే ఆ యోగి పతితుడైపోతాడు. కనుక కైవల్యస్థితి సిద్ధించే వరకు సాధన కొనసాగించాలని నాల్గవ అధ్యాయం (కైవల్యపాదం)లో

తంజలి మహర్షి సూచిస్తాడు.

మహర్షి వ్రాసిన యోగసూత్రాలన్నీ మణిపూసల వంటివే. ప్రతీ వ్యక్తీ దివి ఆచరించ తగినవే. తనను తాను తెలుసుకోవడానికే పరమేశ్వరుడు నకు మానవజన్మ నిచ్చాడు. అది తెలుసుకోకపోతే గొప్ప నష్టమే జరుగుతందని పనిషత్తులు హెచ్చరిస్తున్నాయి. కనుక ప్రతీవ్యక్తి ఈ శాస్త్రాన్ని చదివి చరించాలి.

## మీమాంసాదర్శనం (పూర్వ మీమాంసా)

ఈ దర్శన కర్త జైమిని మహర్షి. ఈయన వ్యాసమహర్షి శిష్యుడు. అన్నిటికన్న యిది పెద్ద శాస్త్రం. ఈ శాస్త్రంలో 2,644 సూత్రాలున్నాయి. **'అథాతో ధర్మజిజ్ఞాసా'** – అంటూ ప్రారంభమైన ఈ దర్శనం ధర్మము మరియు ధర్మి గురించి వివరిస్తుంది. వైదిక కర్మకాండలో (యజ్ఞాలలో) వేదమంత్రాల వినియోగాన్ని, వివిధ యజ్ఞాల కల్పనను ఈ దర్శనం వివరిస్తుంది. యోగదర్శనం అంతఃకరణ శుద్ధికి ఉపాయాలను సూచించినట్లే ఈ దర్శనం పారివారిక జీవనంనుండి రాష్ట్రీయజీవనం వరకు గల కర్తవ్యాకర్తావ్యాలను వివరిస్తుంది. వాటిని అనుసరించినపుడే దేశంయొక్క సర్వతోముఖ ఉన్నతి సిద్ధిస్తుంది. అశ్వమేధాది యజ్ఞాలు ఈ విషయాన్ని తెలియపరచటానికే రచింపబడ్డాయి.

ఈ దర్శనం వేదాన్ని పరమ ప్రమాణంగా పేర్కొంటుంది. వేద విహిత కర్మలే ధర్మ మంటుంది. వైశేషిక దర్శనం **'తద్వచనాదామ్నాయస్య ప్రామాణ్యమ్'** (1-1-3) అని చెప్పినట్లే ఈ దర్శనం **'చోదనా లక్షణోఽర్థో ధర్మః'** (మీ. 1-1-2) వేదవిహిత పదార్థమే ధర్మ మంటుంది. వాస్తవంగా క్రియాత్మక ధర్మమే యజ్ఞం. అట్టి యజ్ఞాన్ని గూర్చిన విమర్శ (చర్చ) ఈ దర్శనం చేస్తుంది. యజ్ఞాది క్రతవులకు వేదమంత్రాలకు దగ్గర సంబంధముంది. సంపూర్ణ కర్మకాండ వేదమంత్రాల వినియోగంపై ఆధారపడి ఉంటుంది. ఈ మీమాంసా దర్శనంలో మంత్రాల వినియోగ విధానం చెప్పబడింది. అందుచే వేదం పరమ ప్రమాణ మంటుంది. ఇది వేదమంత్రాల సార్థకతను వివరిస్తుంది.

వైదిక యజ్ఞాలలో ముఖ్యమైనవి మూడు. దర్శపూర్ణమాస, జ్యోతిష్టోమ

(సోమయాగ), అశ్వమేధములు. ఈ మూడును ప్రకృతి యాగములు కావటం చేత ప్రధానమైనవి. వీటి వికృతి యాగములు అగ్నిష్టోమాదులు. ఇవి అంత ప్రధానములు కావు. జైమిని మహర్షి వేదమంత్రాల వినియోగంలో శృతి, లింగ, వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్యలను మౌళికమైనవిగా పేర్కొని వాటిని ఈ దర్శనంలో వ్యాఖ్యానించాడు.

ఈ దర్శనంలో ఋత్విజుల కర్మలు, సంవత్సర యజ్ఞాదులలోని వైజ్ఞానికత, మంత్ర లక్షణం, వేద లక్షణం, వేదాలకు బ్రాహ్మణగ్రంథాలకు ఉండే తేడా, వేద ప్రామాణికత వివరింపబడ్డాయి. మంత్రాల స్వర సహిత పాఠం మరియు యజ్ఞాదులలో ఏకస్వర పాఠం, ఏ వర్ణాల వారికి యజ్ఞాధికారం ఉంది ? అనే విషయాలపై విస్తృత చర్చ ఉంది. స్త్రీలకు, నిషాదులకు కూడా యజ్ఞాధికారం (యజ్ఞంచేసే అర్హత) ఉందని ఈ దర్శనం చెబుతుంది. **'మాంసపాక ప్రతిషేధః '** (మీ. 12-2-2) మాంసం అన్ని విధాల నిషేధించదగినదని చెబుతుందీ మీమాంసాదర్శనం.

## వేదాంతదర్శనం

మహర్షి వేదవ్యాసులవారిచే రచింపబడిన ఈ ఉత్తర మీమాంసా దర్శనం లోకంలో వేదాంత దర్శనంగా ప్రసిద్ధిని పొందింది. వేదాంతం అంటే వేదం యొక్క అంతిమ సిద్ధాంతం. పూర్వమీమాంసా కర్తయైన జైమినిమహర్షి వ్యాసులవారి శిష్యుడే కనుక అందు చెప్పబడినవి కూడా వ్యాసులవారి అభిప్రాయాలేనని గ్రహించాలి. **'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా'** (వే. 1-1-1) అంటూ ప్రారంభింపడిన ఈ దర్శనం బ్రహ్మను గురించి (పరమేశ్వరుని గురించి) విస్తృతంగా చర్చిస్తుంది. అందుచే ఈ దర్శనానికి 'బ్రహ్మసూత్రా'లని మరొక పేరు.

ఈ దర్శనంపై శంకర రామానుజ మధ్వాచార్యాది సాంప్రదాయక ప్రవర్తకులు భాష్యాలు వ్రాసారు. అవన్నీ వారి వారి సాంప్రదాయాలను బలపరచుకోవడానికి చేసిన బలాత్కార ప్రయత్నాలే. ఒకే గ్రంథం అద్వైత విశిష్టాద్వైత ద్వైతాది భిన్నభిన్న సిద్ధాంతాల నెందుకు ప్రతిపాదిస్తుంది? వీటి వల్ల వ్యాస మహర్షి యొక్క మౌళిక అభిప్రాయా లేమిటో తెలియకుండా

అయిపోయాయి. అందరి దర్శనకారులవలెనే వ్యాసమహర్షి వేదాన్ని పరమ ప్రమాణంగా అంగీకరిస్తారు. **'శాస్త్రయోనిత్వాత్'** (వేద. **1-1-3**) ఋగ్వేదాది శాస్త్రాలకు మూలకారణం బ్రహ్మ అంటారు. అంతకు ముందే బ్రహ్మ అంటే ఎవరో వివరిస్తూ - **'జన్మాద్యస్య యతః'** (వేద. **1-1-2**) ఈ సృష్టి స్థితి ప్రళయాలు ఎవని వల్ల జరుగుచున్నాయో అట్టి చేతన నిమిత్త కారణమే బ్రహ్మ అంటారు.

వేదాంతదర్శనం ప్రకారం - బ్రహ్మ (పరమేశ్వరుడు) సృష్టి స్థితి లయములకు ఏకమాత్ర కర్త. అట్లని అతడే ఉపాదానకారణం కూడా కాదు. ప్రకృతి అనేబడే ఉపాదానకారణంతో (మూలపదార్థంతో) పరమేశ్వరుడు ఈ సృష్టిని చేస్తాడు. అతడు సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వశక్తిమంతుడు, అనాది, అనంతుడు, జన్మ జరా మరణాది క్లేశ రహితుడు, ఆనంద స్వరూపుడు.

అట్టి పరమేశ్వరుడు జీవులమైన మనకొఱకు కర్మఫలాల నివ్వటానికి ఈ సృష్టిని చేస్తాడు. అతడు న్యాయకారి. ఈ విధంగా ఈ దర్శనం పరమేశ్వర జీవ ప్రకృతు లను మూడు తత్వాలున్నాయని చెబుతుంది. వేదంలో చెప్పబడిన త్రైతసిద్ధాంతాన్ని ఈ శాస్త్రం ప్రతిపాదిస్తున్నది. అద్వైత విశిష్టాద్వైత ద్వైత సిద్ధాంతాలు వేద సమ్మతములు కావు. కనుక ఈ వేదాంతదర్శనానికి కూడా అవి సమ్మతం కాదు. శాస్త్రీయమైన తర్కం ముందు అవి నిలువలేవు. ఈ విషయాన్ని ముందు ప్రకరణాలలో మరికొంత వివరంగా తెలిసికొందాము.

## షడ్దర్శనాల సారాంశం

పై ఆరు దర్శనాలు ఆరుగురు ఋషులు వ్రాసారు. ఈ ఆరుగురు సృష్టిని ఆరు కోణాలతో దర్శించి వ్రాసారు. వీటిలో పరస్పరం విరోధం లేకపోగా ఒకటికి మరొకటి పూరకంగా ఉన్నాయి. ఈ షడ్దర్శనాల సారాంశ మేమంటే-

1. ఈ సృష్టిలో మూడు అనాది పదార్థాలున్నాయి. అవి పరమేశ్వరుడు, జీవులు, ప్రకృతి.

2. సత్ పదార్థాలకు అభావం కాని, అభావ పదార్థాలకు సత్తాకాని ఎప్పటికిని కలుగదు. ఉనికిగల పదార్థం నశించదు. లేని పదార్థం క్రొత్తగా ఉనికిని పొందదు. **"నాసతో విద్యతే భావః నాభావో విద్యతే సతః"** (భగవద్గీత. **2-16**).

3. పరమేశ్వరుడు – సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, సర్వశక్తిమంతుడు, సృష్టి స్థితి లయ కర్త, జీవుల కర్మలకు న్యాయంగా ఫలితాల నిచ్చే కర్మఫలదాత.

4. జీవుడు – అల్పజ్ఞుడు, అల్పశక్తిమంతుడు, అల్పపరిమాణం కలవాడు. కర్మలు చేస్తూ, ఈశ్వరీయ వ్యవస్థతో కర్మఫలాలను పొందుతూ సంసార చక్రంలో తిరుగుతూ ఉంటాడు. ఇట్టి జీవులు ఒకటికాదు అనేకము.

5. ప్రకృతి – జడ పదార్థము. సత్వరజస్తమస్సు లనే మూడు రకాల పరమాణువుల సంఘాతము (సమూహము). ఇది సృష్టికి ఉపాదాన కారణము. దీనితోనే పరమేశ్వరుడు సృష్టిని నిర్మిస్తాడు. కాలాంతరంలో మరల సృష్టిని పరమాణువులుగా మార్చివేస్తాడు.

6. వేదం పరమేశ్వరీయ జ్ఞానం. అది స్వతః ప్రమాణం. పరమ ప్రమాణం.

7. జీవుడు వేదశాస్త్రాల మార్గదర్శనంలో సాధన చేస్తే త్రివిధ దుఃఖాల అత్యంత నివృత్తి కలుగుతుంది. సంసార చక్రబంధనం తొలగిపోతుంది. పరమానంద ప్రాప్తిని పొంది పరాంతకాలం వరకు ఆనందమగ్నుడు కావచ్చును.

8) పరమేశ్వరుడు నిరాకారుడు, సర్వవ్యాపకుడు కనుక ఎప్పటికిని శరీరధారి కాడు. నేటి లోకప్రచలిత అవతారవాదం వేద సమ్మతం కాదు.

# ఉపవేదాలు, ఉపనిషత్తులు

నాలుగు వేదాలకు నాలుగు ఉపవేదా లున్నట్లు మన ప్రాచీన గ్రంథాలలో కనబడతుతుంది. - **"తత్ర ఋగ్వేదస్య ఆయుర్వేద ఉపవేదః, యజుర్వేదస్య ధనుర్వేదః, సామవేదస్య గాంధర్వవేదః, అథర్వవేదస్య శస్త్ర శాస్త్రాణి"** - ఋగ్వేదానికి ఆయుర్వేదం, యజుర్వేదానికి ధనుర్వేదం, సామవేదానికి గాంధర్వవేదం, అథర్వవేదానికి శస్త్ర శాస్త్ర విద్యలు ఉపవేదాలు. అథర్వవేదానికి ఉపవేదం అర్థవేదంగా మరొకచోట చెప్పబడింది. కొందరు ఋగ్వేదానికి అర్థవేదం, అథర్వవేదానికి ఆయుర్వేదం ఉపవేదాలుగా చెబుతారు. దీనికి కారణం ఈ రెండు వేదాలలోను ఆయుర్వేద విషయాలుండటమే.

ఋషులు నిత్యజీవితంలో జనసామాన్యానికి ఉపయోగపడే విద్యలను వేదాలనుండి గ్రహించారు. వాటిని మనన చింతన పరిశోధనలు చేసి కొన్ని శాస్త్రాలు రచించారు. వాటికి ఉపవేదాలని పేరు పెట్టారు. అంటే వేదాలలో బీజరూపంలో ఉన్న విద్యలను ఉపవేదాలలో విస్తరింప చేసారు.

**ఆయుర్వేదం :** ఆయుర్వేద మంటే ఆయువును గురించిన జ్ఞానం. జీవుడు గర్భంలో ప్రవేశించినది మొదలు మరణ పర్యంతం ఉండే కాలాన్ని ఆయువు అంటారు. ఆ ఆయువులో వివిధ కాలాలలో (వయస్సులలో) శరీరంలో కలిగే మార్పులు, అందుకు తీసుకోవలసిన జాగ్రత్తలు, ఆరోగ్యంగా జీవించటానికి అనుసరించవలసిన నియమాలు ఈ వేదంలో చర్చించ బడ్డాయి. వివిధ వ్యాధులకు చికిత్సలు చెప్పబడ్డాయి.

చికిత్సలో 8 విషయాలుంటాయి. 1. శల్యచికిత్స, 2. శాలాక్య చికిత్స 3. కాయచికిత్స, 4. భూతవిద్య, 5. కౌమార భృత్యము, 6. అగదతంత్రము, 7. రసాయన తంత్రము, 8. వాజీకరణ తంత్రము. ప్రాచీన కాలంలో ఆయుర్వేద గ్రంథాలు వివిధ ఋషులు వ్రాసినవి చాలానే ఉండేవి. ప్రస్తుతం లభించువాటిలో సుశ్రుతము, చరకము, అష్టాంగ హృదయము ముఖ్యమైనవి. ఈ మూటిలో నామ భేదాలతో పై 8 చికిత్సులు వివరింపబడ్డాయి.

**1. శల్య చికిత్స (సర్జరి) :** శల్య చికిత్సకు మన భారతీయులే ఆద్యులు.

సుశ్రుతాచార్యులు రచించిన సుశ్రుతసంహిత చదివి ఆధునిక వైద్యులే ఆశ్చర్యపోతున్నారు. ఆ కాలంలోనే కంటి నరమును కూడా నిలువుగా రెండుగా విడదీయగల అతి సున్నిత సునిశిత పరికరాలుండేవి.

**2. శాలాక్య చికిత్స (తంత్రము) :** దీనిలో మెడకు పై భాగన (తలలో) గల భాగలన్నిటికి చికిత్సలు వివరింపబడ్డాయి. అంటే చెవి, ముక్కు, గొంతు (ఇ.యన్.టి.) కన్ను, మెదడు మొదలగు వాటి చికిత్సలు. ఇది కాయ చికిత్సలో భాగమే అనవచ్చు.

**3. కాయ చికిత్స :** దీనిలో శరీరంలోని అన్ని అవయవాలకు, వాటిలో కలుగు అన్నిరకాల వ్యాధులకు చికిత్సలు చెప్పబడ్డాయి.

**4. భూతవిద్య :** భూతవిద్య అంటే అమాయకులనుకునే దయ్యాల భూతాల విద్యకాదు. దీనిలో దైవికంగా కలిగే కొన్ని వ్యాధులకు, బాధలకు చికిత్సలు చెప్పబడ్డాయి. బలహీన మనస్కులకొచ్చే అనేక భయాలకు, భావనలకు (హిస్టీరియాలకు, ఫోబియాలకు) మరియు దుర్విచార, దుశ్చేష్టల వల్ల కలిగే రోగాలకు నివారణ మార్గాలు తెలుపబడ్డాయి.

అథర్వవేదంలో భూత తాంత్రిక విద్యలున్నాయనే భావాలు కొందరి కున్నాయి. కాని, అట్టివేమీ లేవు. ఇంతేకాక, అట్టి భావాలను అథర్వవేదం నిరశిస్తుంది. వేదశైలిని అర్థం చేసుకోకపోవటంవల్ల, వేదార్థాని కుపకరించే వేదాంగాలు చదవకపోవటంవల్ల, ఋషుల వేదవ్యాఖ్యాన గ్రంథాలైన బ్రాహ్మణ ఆరణ్యక గ్రంథాలు పరిశీలించకపోవటంవల్ల యిట్టి అనర్థభావాలు కలిగాయి. పం. క్షేమకరణదాస్ త్రివేదీ గారి అథర్వవేద భాష్యం చదివితే మీ కీ విషయాలు స్పష్టంగా తెలుస్తాయి.

**5. కౌమార భృత్యము :** (బాలచికిత్స – పీడియాట్రిక్స్) దీనిలో పిల్లల వ్యాధులకు చికిత్సలు తెలుపబడ్డాయి.

**6. అగద తంత్రము (విషచికిత్స–టాక్సికోలోజీ)** దీనిలో తేలు, పాము, జెఱ్ఱి మొదలగు విషజంతువులు కాటువేసినపుడు, కుక్క మొదలగునవి కరచినపుడు లేదా విషప్రయోగం జరిగినపుడు చేయవలసిన చికిత్సలు తెలుపబడ్డాయి.

7. **రసాయన తంత్రము :** వివిధ రసాయనాల ద్వారా శరీరాన్ని బలపరచి వార్ధక్యాన్ని దూరం చేసే పద్ధతులు ఇందులో చర్చించబడ్డాయి. కాయకల్పచికిత్స ఒక అద్భుత ఆవిష్కరణ.

8. **వాజీకరణ తంత్రము(ఫర్టిలిటీ) :** స్త్రీ పురుషులలో సంతానలేమికిగల కారణాలను తెలిసికొని వాటిని నివారించే చికిత్సలు ఇందులో చెప్పబడ్డాయి.

మన ఆయుర్వేద గ్రంథాలు ఆధ్యాత్మిక శాస్త్రాలుగా కూడా ఉపయోగపడతాయి. ఈ వైద్య గ్రంథాలలో మనస్సును, జీవాత్మను శరీరంలో భాగాలుగా చేసి చికిత్సలు చెప్పబడ్డాయి **(సత్త్వ మాత్మా శరీరం చ త్రయ మేతత్ త్రిదన్డవత్)** ఈ మూడూ ముక్కాలి పీటకు మూడు కాళ్ళవలె ఉంటాయనీ, చికిత్స ఈ మూటికీ చేయాలనీ ఈ శాస్త్రాలలో చెప్పబడింది.

సృష్టి రచనా క్రమం, ప్రాణిరచనాక్రమం, శరీర రచనాక్రమం మొదలైన వాటితోబాటు దార్శనిక విషయాలు కూడా ఉపదేశించబడ్డాయి. చరక సంహితలో నివి విశేషంగా కనబడతాయి. పూర్వం వృక్షాయుర్వేదం, పశుఆయుర్వేదం, అశ్వాయుర్వేదం వంటి వెన్నో చికిత్సాగ్రంథా లుండేవి. అవన్నీ కాలగర్భంలో ముఖ్యంగా విదేశీయుల ద్వేషాగ్నిలో నశించి పోయాయి.

## ధనుర్వేదం

యజుర్వేదానికి ఉపవేదం ధనుర్వేదం. పూర్వం క్షత్రియులు (రాజులు) కూడా గురుకులాలకు వెళ్ళి అక్కడి కఠిన నియమాలన్నిటిని పాటిస్తూ చదువుకొనేవారు. వేదశాస్త్రాలతోబాటు యుద్ధవిద్యలు నేర్చుకునేవారు. అట్టి వారికొరకే ఈ ధనుర్వేదం రూపొందించబడింది. దీనిలో అనేక రకాల శస్త్రాస్త్రాల ప్రయోగవిద్యతోబాటు వ్యూహరచన కూడా ఉండేది. ఆగ్నేయ వారుణాది అస్త్రాల ప్రయోగం, చక్రవ్యూహాది వ్యూహరచనలు రామాయణ భారతాలలో కనబడతాయి. కాని, దురదృష్టవశాత్తు ధనుర్వేద గ్రంథాలన్నీ లుప్తమైపోయాయి. నామమాత్రంగా ఒకటి రెండు లఘుగ్రంథాలు లభిస్తున్నా అవి చాలా సామాన్యంగా ఉన్నాయి.

మహర్షి దయానంద సరస్వతి గారు ప్రాచీన ధనుర్వేదాన్ని పునరుద్ధరించి

సైనికశక్తిని పెంచి ఆంగ్లేయులను పారద్రోలాలని చాలా కృషి చేసారు. కాని, ఎంత ప్రయత్నించినా అట్టి గ్రంథాలు లభించలేదు. ఎంతో కష్టం మీద ఒకటి రెండు పుటలు మాత్రం దొరికాయి. వారు వాటిని ప్రజలకు చూపిస్తూ ఈ గ్రంథం పూర్తిగా లభిస్తే ఆంగ్లేయులను చాలా తేలికగా వెళ్ళగొట్టవచ్చునని చెప్పేవారు.

ఆగ్నేయ, వారుణ, సమ్మోహనాది అస్త్రాలన్నీ వేరువేరు మందులతో కూడిన బాంబులు. ఏవో మంత్రాలు చదవినంత మాత్రాన ఏర్పడే ఆయుధాలు కావు. ఇచట మంత్రాలంటే ఆ బాంబుల నిర్మాణ రహస్యాలని అర్థం చేసుకోవాలి.

## గాంధర్వవేదం

గాంధర్వవేదం సామవేదానికి ఉపవేదం. సామవేదంలో బీజరూపంలో ఉన్న సంగీతవిద్యను ఈ వేదం విశదపరుస్తుంది. ఈ శాస్త్రం అనేక రాగ తాన పల్లవులను గురించి చెబుతుంది. వివిధ వాయిద్యాల విన్యాసం గురించి బోధిస్తుంది. సంగీతశాస్త్రాన్ని గూర్చిన గ్రంథాలు నేడు చాలానే లభిస్తున్నాయి. కాని, వీటన్నిటికి మూలమైన నారద సంహిత (గాంధర్వవేదం) లభించటం లేదు.

మన భారతీయ శాస్త్రీయ సంగీతం మానవులనే గాక శిశువులను పశువులను నాగులను కూడా అలరిస్తుంది. కనుకనే **'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః'** అన్నారు. అది వ్యాధులను బాధలను మరపించి ఆనందపరవశులను చేస్తుంది. ఆధునికులు చేసిన పరిశోధనలలో శాస్త్రీయ సంగీతం వినిపిస్తే ఆవులు పాలు ఎక్కువగా యిచ్చాయట. వాటికే పాశ్చాత్య సంగీతం (రాక్ మ్యూజిక్ వంటివి)వినిపిస్తే అవి పాలు తక్కువగా యివ్వటమే గాక ఆందోళనకు గురియయ్యాయట. దానితో శాస్త్ర వేత్తలు శాస్త్రీయసంగీతం వ్యాధులలో ఎంత ఉపశమనం కలిగించగలదో పరిశోధనలు చెయ్యటం ప్రారంభించారు. కొన్ని రాగాలతో నిద్ర చక్కగా పడుతున్నదనీ, కొన్ని రాగాలతో గుండె జబ్బులు ఉపశమిస్తున్నాయనీ, కొన్నిటితో అధిక రక్తపోటు అదుపులోనికి వస్తున్నదనీ గుర్తించారు. క్రమంగా సంగీతచికిత్స రూపుదిద్దుకుంటున్నది.

నేడు లలిత సంగీతం, సినీ సంగీతం, జానపద సంగీతం విస్తృతంగా

వ్యాప్తిచెందుతున్నాయి. వీటి వెనుకకూడా శాస్త్రీయ సంగీతమే పునాదిగా ఉంటున్నది. శాస్త్రీయ సంగీతజ్ఞానం ఉన్న గాయకులే ఆ యా గీతాలను చక్కగా పాడగలుగుతున్నారు. ఎంతటి కష్టమైన పాటనైనా ఏదైనా ఒక రాగంలోకి మలచి రక్తి కట్టిస్తున్నారు. మధురమైన కంఠ మున్నంతమాత్రాన సరిపోదు. సంగీతజ్ఞానం కూడా అవసరమని సంగీత విద్వాంసు లంటున్నారు. అట్టి సంగీతవిద్య సామవేదం నుండే పుట్టింది.

ప్రాచీన కర్మకాండకు చెందిన గ్రంథాలను పరిశీలిస్తే నామకరణ వివాహాది శుభకార్యాలన్నీ అగ్నిహోత్ర పూర్వకంగానే జరుపుకోవాలని నిర్దేశించబడింది. ఇంతేగాక, అగ్నిహోత్రానంతరం విధిగా వామదేవ్య గానం చెయ్యాలని చెప్పబడింది. ఇవి సామవేద (1-4-1, 2,3)మంత్రాలు. ఈ మంత్రాలకు ఋషి వామదేవుడు. అందుచే ఈ మంత్ర గానానికి వామదేవ్యగానం అనే పేరు వచ్చింది. ఈ మంత్రాలలో చిత్ర విచిత్ర సృష్టిని గావించిన పరమేశ్వరుని స్తుతిగానం ఉంది. వీటిని సంగీత స్వరములతో మేళవించి రాగరంజితంగా అగ్నిహోత్రానంతరం గానం చేసేవారు. అశ్వమేధాది బృహద్యజ్ఞాలలో సామవేద, సంగీతాలు తెలిసిన విద్వాంసుల నాహ్వానించి వారిచే సామగానం చేయించేవారు. ఆ విధంగా వేద విద్వాంసుల సత్కారంతోబాటు సంగీత విద్వాంసుల సత్కారం జరిగేది.

మన శాస్త్రీయసంగీతం మానవులను, ప్రాణులనేకాక ప్రకృతిని కూడా అలరింప (అనుకూలింప) చేస్తుంది. చరిత్రను పరిశీలిస్తే అక్బర్ కాలంనాటి మహాగాయకుడు తాన్‌సేన్ 'మేఘ మాలహార' రాగమాలాపించి వర్షాలు కురిపించాడట. 250 సంవత్సరాల పూర్వం దక్షిణ భారతంలోని ఎట్టయ్యాపురం (తిరుణల్‌వేలి జిల్లా) గ్రామంలో 12 సంవత్సరాలు వర్షాలు లేక మహాక్షామ మేర్పడిందట. అప్పుడు ప్రఖ్యాత సంగీతవిద్వాంసుడు ముత్తుస్వామి దీక్షితార్ గారు 'అమృతవర్షణీ' రాగమాలాపించి వర్షాలు కురిపించారట. కొన్ని సంవత్సరాల క్రిందట (1982 అక్టోబర్‌లో) మద్రాసు నగరంలో తీవ్రమైన నీటికొరత ఏర్పడింది. అప్పుడు మేఘమథనం ఫలించకపోతే ప్రభుత్వం ప్రసిద్ధ వైలన్ విద్వాంసుడు కునకోడి వైద్యనాథన్ గారిని ఆహ్వానించింది. తమ సంగీతంతో వర్షదేవతలను ప్రసన్నం చేయమని కోరింది. అందుకు ఆయన

అంగీకరించి రెడ్‌హిల్స్ సరస్సులో మోకాళ్ళలోతు నీటిలో నిలబడి కొన్ని దినముల పాటు వివిధ రాగాల నాలాపించారు. ఆ విధంగా 9 దినములు ప్రయత్నించగా 9వ దినమునుండి సంతృప్తిగా వర్షాలు పడ్డాయి. అప్పుడు మద్రాసు (చెన్నై) పౌరుల ఆనందానికి అవధులు లేవు.

దానితో విలేఖరులు వైద్యనాథన్ గారిని వివరణకోరగా వారు - "అమృతవర్షిణీ రాగంతో సముద్రంలో వేడిపుట్టి నీటియావిరి ఎక్కువగా విడుదలౌతుందనీ, 'మేఘరంజనీ' రాగంతో ఆ నీటియావిరి మేఘాలుగా ఏర్పడుతుందనీ, 'వరుణ ప్రియ' రాగంతో ఆ మేఘాలు వర్షిస్తాయనీ చెప్పి నేను అట్టి ప్రయత్నమే చేసా" నన్నారు. ఆ రాగాలతో బాటు ఆ విద్వాంసుని తపస్సు, పవిత్రత, పరోపకారకాంక్ష కలిసి ఉంటాయి. అవన్నీ పరమేశ్వరుని అనుగ్రహానికి తోడ్పడతాయి.

## అర్థవేదం

అథర్వవేదాని కుపవేదం అర్థవేదం. అర్థాన్ని ఆర్జించటానికి, అనుభవించటానికి కావలసిన అనేక యంత్రాల నిర్మాణం ఈ శాస్త్రంలో ఉపదేశించబడింది. పూర్వం అనేక రకాల విమానాల, ఓడల, రథాల నిర్మాణాన్ని తెలిపే 'యంత్రసర్వస్వ' మనే బృహద్ గ్రంథాలుండేవి. అవి యిప్పుడు లభించటం లేదు. అనేక వాస్తు శిల్ప విద్యలతోకూడిన మయాచార్య విరచిత 'మయసంహిత' కూడా లభించటం లేదు. ఒకప్పుడు మనదేశం వస్త్రనిర్మాణంలో, శిల్పనిర్మాణంలో ప్రపంచ దేశాలలో అగ్రగణ్యంగా ఉండేది. ఓర్వలేని ఆంగ్లప్రభుత్వం క్రూరాతి క్రూరంగా మన కళాకారుల వ్రేళ్ళను నరికివేసింది. దానితో మన శిల్పకళలన్నీ కనుమరుగైపోయాయి.

భరద్వాజ మహర్షి వ్రాసిన బృహద్ విమానశాస్త్రం పాక్షికంగా లభిస్తోంది. అందులో వివిధ రకాల విమానాల వర్ణన ఉంది. ఇంధనాలుకూడా చాలా చెప్పబడ్డాయి. అందు సూర్యుని నుండి విద్యుచ్ఛక్తిని గ్రహించి విమానాలు నడిపే ఉపాయాలు కూడా ఉపదేశించబడ్డాయి.

> అథయన్త్ర ముఖాత్ విద్యుచ్ఛక్తిం సూర్యాంశుభిః క్రమాత్ ।
> సమాహర్తుం విశేషేణ ఉపాయః పరికీర్త్యతే ।
> (బృహత్ విమానశాస్త్రం పుట. **340**, శ్లో. **357, 358**)

ఆనాడు ఆ విధంగా భరద్వాజమహర్షి విమానాలు నిర్మించి నడిపించాడు.

ఆధునికులలో విమాన ఆవిష్కర్తలు రైటు సోదరు లని చెప్పే మాటలు సత్యం కావు. అంతకన్న కొన్ని సంవత్సరాల పూర్వమే శివశంకర తళపదే అనే భారతీయుడు బొంబాయి నగరంలో ఆంగ్లేయుల ఎదుటనే తొలి విమానం నిర్మించి నడిపించి చూపించాడు. ఆ విషయాలు వెలుగులోకి రాకుండా బలవంతంగా ఆంగ్లేయులు అణచివేసారు.

ద్వాపరయుగాంతంలో మనదేశం విద్యా విజ్ఞానాలలో, కళా కౌశలాలలో, ఆరోగ్య ఐశ్వర్యాలలో, శౌర్యపరాక్రమాలలో ప్రపంచంలోనే అగ్రగణ్యంగా ఉండేది. కాని, మన దురదృష్టం వల్ల ముఖ్యంగా మహాభారత యుద్ధంవల్ల, అనంతరం ఏర్పడిన అనైక్యత వల్ల దేశం పరాధీనమై పోయింది. వేల సంవత్సరాలు విదేశీయులు పాలించి సంపదలనన్నీ దోచుకుపోయారు. విజ్ఞాన విరోధులైన వారు మన విజ్ఞాన గ్రంథాలను, విజ్ఞాన వేత్తలను చూసి సహించలేకపోయారు. గ్రంథాల నగ్నికి ఆహుతిచేసి విజ్ఞాన వేత్తలను క్రూరాతిక్రూరంగా చంపివేసారు.

ఇంతజరిగినా మన విజ్ఞానానికి (అర్థవేదానికి) మూలమైన అథర్వవేదం మరియు మిగిలిన మూడు వేదాలు నేటికీ సురక్షితంగానే ఉన్నాయి. ఏనాటికైనా మన వేదాలే మనను విజ్ఞానపథంలో అగ్రగాముల చేయగలవు. అస్తు.

## ఉపనిషత్తులు

ఉపనిషత్తులంటే బ్రహ్మవిద్యా గ్రంథాలు. వేదాలలో బీజరూపంలో పరమేశ్వరు డుపదేశించిన బ్రహ్మవిద్యను ఈ గ్రంథాలు వివరించి చెబుతాయి. 'ఉపనిషత్' అనే పదము 'ఉప, ని' అనే ఉపసర్గలతో 'సత్ ధాతువు కలియగా ఏర్పడుతుంది. సద్ ధాతువులో (సద్లృ–విశరణ గత్యవసాదనేషు) – విశరణము (నాశము), గతి (ప్రాప్తి), అవసాదనము (విడిపించుట) అనే మూడర్థాలున్నాయి. అందుచే ఉపనిషదంటే – 'అవిద్యను నశింపజేసి, బ్రహ్మజ్ఞానాన్ని ప్రాప్తింపజేసి, సంసారబంధనాన్నుండి విడిపింపజేసే సాధన' మని అర్థం. 'ఉపనిషద్యతే ప్రాప్యతే బ్రహ్మవిద్యా అనయా' – దేనివలన బ్రహ్మవిద్య పొందబడుతుందో అదే ఉపనిషత్తని మరియొక నిర్వచనం.

ఉపనిషత్ పేరుతో లోకంలో చాలా గ్రంథాలున్నాయి.

అష్టోత్తర శతోపనిషత్తు లని తరచు వింటూ ఉంటాము. అంటే ఉపనిషత్తులు 108. ఇవేగాక, రుద్రాక్షోపనిషత్, భస్మోపనిషత్, అల్లోపనిషత్ మొదలైన పేర్లతో అనేకం ఉన్నాయి. ఇంతవరకు 233 ఉపనిషత్తులు ప్రకాశింప బడ్డాయి. కాని, యివన్నీ ప్రామాణికం కాదు. ఆది శంకరాచార్యులవారు వీటన్నిటిని పరిశీలించి వీటిలో కేవలం 10 ఉపనిషత్తులనే ప్రామాణికాలని నిర్ణయించారు. వాటికే వ్యాఖ్యానాలు వ్రాసారు. మిగిలినవన్నీ ఋషులు వ్రాసినవికాదు. సంస్కృతం తెలిసిన సాంప్రదాయక పండితులెవరో వాటిని వ్రాసి, తాము వ్రాసినవంటే ప్రజలు నమ్మరని అవి ఋషులు వ్రాసినవేయని ప్రచారం చేసారు. వాటిలో అల్లోపనిషత్ పూర్తిగా నవీనం. దానిలో అల్లానే దేవుడని వ్రాసి ఉంది. కొద్ది సంస్కృతం, కొద్ది అరబ్బీ తెలిసిన మిడిమిడి జ్ఞానం కలిగిన ఒక మహ్మదీయు డెవరో దీనిని వ్రాసినట్లుగా కనబడుతుంది.

ముక్తికోపనిషత్తు ఈ క్రింది పది ఉపనిషత్తులే ముఖ్యమంటుంది.

**ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరిః ।**
**ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ ॥**

ఇవేగాక కౌషీతకీ, శ్వేతాశ్వతర, మైత్రాయణీయ ఉపనిషత్తులు కూడా ప్రాచీనములు, ఋషి ప్రణీతములే యని ప్రాచీన భాష్యకారు లంటారు. పరిశీలించి చూస్తే వీటిలో శ్వేతాశ్వతరోపనిషత్తు చాలా ముఖ్యమైనది. దీనిలో కొన్ని వేదమంత్రాలుకూడా ఉన్నాయి. ఇది శ్వేతాశ్వతరఋషి ప్రణీతము. కనుక ఈ ఏకాదశోపనిషత్తుల గురించి సంక్షిప్తంగా తెలుసు కుందాము.

## ఈశావాస్యోపనిషత్తు

ఈ ఉపనిషత్తు వేదంలోని భాగమే. ఇది యజుర్వేదం లోని చివరిదైన 40వ అధ్యాయం. అయినప్పటికీ యిది ఉపనిషత్తుగా లోకంలో వ్యవహరింపబడుతూ ఉంది. 'ఈశావాస్య మిదం సర్వం' అనే వాక్యంతో ప్రారంభింపబడటంవల్ల దీనికి ఈశావాస్యోపనిషత్తనే పేరు వచ్చింది. దీనిలో పరమేశ్వరుని గుణగణాలు, స్వరూప స్వభావాలు చాలా స్పష్టంగా చెప్పబడ్డాయి. అట్టి సర్వవ్యాపక సర్వేశ్వరుని పొందేమార్గం కూడా యిది సూచిస్తుంది. సంక్షిప్తంగా ఈ ఉపనిషత్తు ఉపదేశించేదేమంటే –

**ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్ ।**
**తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ధనమ్ ॥ (1)**

ఓ మానవా ! గతిశీలమైన ఈ జగత్తంతా అణువు మొదలు బ్రహ్మాండం వరకు ఈశునిచే (నియామక శక్తిచే) వ్యాప్తమై ఉంది. కాబట్టి, ఈ జగత్తంతా ఈశునిదిగానే (పరమేశ్వరునిదిగానే) భావించి, త్యాగంతో ధర్మపూర్వకంగా నీకు లభించినదానిని అనుభవించు. ఎవరి ధనమునూ ఆశించవద్దు. (1)

**కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః ।**
**ఏవం త్వయి నాన్యథే తో<sub></sub>ऽస్తి న కర్మ లిప్యతే నరే ॥ (2)**

ఓ కర్మశీల మానవా ! వేదవిహిత కర్మల నాచరిస్తూనే నూరేండ్లు జీవింపగోరుము. కర్మబంధనాన్నుండి తప్పించుకోవడానికి ఇంతకన్న వేరు మార్గం లేదు. (2)

**అసుర్యా నామ తే లోకా అంధేన తమసావృతాః ।**
**తాన్ స్తే ప్రేత్యాపి గచ్ఛంతి యే కే చాత్మహనో జనాః ।(3)**

అజ్ఞానావృతులైనమానవులు ఆత్మఘాతకులై వేదవిరుద్ధ కర్మల నాచరించి అధోగతి పాలౌతారు. వారు చచ్చిన తదుపరి క్రిమి కీటకాది నీచయోనులను పొందుతారు. (3)

**అనేజదేకం మనసో జవీయో**
**నైనద్దేవా ఆప్నువత్ పూర్వమర్షత్ ।**
**తద్ధావతో<sub></sub>ऽన్యా నత్యేతి తిష్ఠత్**
**తస్మిన్నపో మాతరిశ్వా దధాతి ॥ (4)**

పరమేశ్వరుడు ఒకే ఒక్కడు (అద్వితీయుడు). అచలుడు (అతని కవస్థాచ్యుతి కలుగదు). మనస్సుకంటె వేగవంతుడు. అన్నిటికంటె ముందే ఎక్కడ చూచినా ప్రాప్తించి యుంటాడు. అతనిని నేత్రాదీంద్రియములు పొందలేవు (గ్రహించలేవు). ఆ పరమాత్మ కదలకనే విషయములవెంట పరుగెత్తు మనో వాగాదింద్రియాలను అతిక్రమిస్తాడు. జీవుడు తాను చేసిన కర్మలనన్నిటిని అతనియందే ధరిస్తాడు (అర్పిస్తాడు). అతనినుండే వాటి ఫలాలను పొందుతాడు. (4)

**తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే ।**
**తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః ॥ (5)**

ఆ పరబ్రహ్మతత్త్వం మూర్ఖుల దృష్టిలో కదలుచున్నట్లు కనబడుతుంది. కాని, అది కదలదు. అది అత్యంత దూరంలోను, అత్యంత సమీపములోను కూడా ఉంది. అది సమస్త పదార్థాల లోపల వెలుపల అంతటా ఓతప్రోతమై వ్యాపించి ఉంది. (5)

**యస్తు సర్వాణి భూతాన్యాత్మన్నేవానుపశ్యతి ।**
**సర్వభూతేషు చాత్మానం తతో న విచికిత్సతి ॥ (6)**

ఏ ఆత్మజ్ఞాని పరమాత్మయందే ఈ సమస్త పదార్థాలు గలవని యోగాభ్యాసంతో తెలిసికుంటాడో-అతడు పొరబడక సమస్త ప్రాణులు తనవంటివేనని గ్రహించి ధర్మాత్ముడౌతాడు. చివరకు ముక్తిని పొందుతాడు. (6)

**యస్మిన్ త్సర్వాణిభూతాన్యాత్మైవాభూద్ విజానతః ।**
**తత్ర కోమోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః ॥ (7)**

ఏ జ్ఞానమయ స్థితయందుండి సమస్త ప్రాణుల సుఖదుఃఖాలు తన సుఖదుఃఖాలవంటివే యని గ్రహిస్తాడో అట్టి యోగి శోక మోహాదుల నధిగమించి పరమాత్మను పొందుతాడు. (7)

**స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగ్ం**
**శుద్ధ మపాపవిద్ధం । కవిర్ మనీషీ పరిభూః**
**స్వయంభూర్ యాథాతథ్యతోఽర్థాన్**
**వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ॥ (8)**

(ఈ మంత్రార్థము ఈ పుస్తకములోని 4వ పుటలో ఉన్నది)

**అన్ధన్తమః ప్రవిశంతి యేఽ సంభూతి ముపాసతే**
**తతో భూయ ఇవ తే తమో య ఉ సంభూత్యాగ్ం రతాః॥ (9)**

ఎవరు ఇట్టి సర్వవ్యాపక సర్వేశ్వరుని విడచి త్రిగుణాత్మకమైన మూల ప్రకృతి (పరమాణువుల) నుపాసిస్తారో వారు అజ్ఞానాంధకారంలో పడిపోతారు. ఎవరు మూల ప్రకృతితో (పరమాణువులతో) ఏర్పడిన ప్రపంచ పదార్థాల నుపాసిస్తారో వారు అంతకన్నను ఎక్కువ గాఢాంధ కారమున పడిపోతారు (9)

**అన్యదేవాహుః సంభవా దన్య దాహు రసంభవాత్ ।**

**ఇతి శుశ్రుమ ధీరాణామ్ యే నస్తద్ విచచక్షిరే ॥ (10)**

ప్రపంచ పదార్థాల నుపాసించుటవలన కలుగు ఫలము వేరనీ, వాటికి కారణమైన పరమాణువుల (మూలప్రకృతి) నుపాసించుటవలన కలుగు ఫలము వేరనీ జ్ఞానులు, యోగులు చెబుతారు.

**సంభూతిం చ వినాశం చ యస్తద్ వేదోభయగ్ం సహ।**
**వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యామృత మశ్నుతే ॥(11)**

ఏ విద్వాంసుడు సంభూతిని (కార్యరూప స్థూలజగత్తును), వినాశిని (దేనిలో కార్యరూప జగత్తు విలీన మౌతుందో దానిని) తోడ్తోడుగా తెలిసికుంటాడో అతడు – కారణ ప్రకృతి జ్ఞానంతో మృత్యువును తరించి, కార్యరూప శరీరంతో ధర్మకర్మల నాచరించి మోక్షాన్ని పొందుతాడు.

**అన్ధన్తమః ప్రవిశన్తి యేఽవిద్యా ముపాసతే ।**
**తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతాః॥(12)**

అట్లే, ఎవరు కేవలం అవిద్య నుపాసిస్తారో వారు అంధకారంలో పడిపోతారు. ఎవరు కేవలం విద్యను (పాండిత్యాన్ని) ఉపాసిస్తారో వారు అంతకన్న గాడాంధకారంలో పడిపోతారు.

**అన్య దేవాహుర్ విద్యాయా అన్య దాహు రవిద్యాయాః ।**
**ఇతి శుశ్రుమ ధీరాణాం యే న స్తద్ విచచక్షిరే ॥ (13)**

విద్య వలన కలుగు ఫలము వేరనీ, అవిద్యవలనకలుగు ఫలము వేరనీ జ్ఞానులు చెబుతారు.

**విద్యాం చావిద్యాం చ యస్తద్ వేదోభయగ్ం సహ ।**
**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే ॥ (14)**

విద్యావిద్యల రెంటినీ తోడుగానే తెలుసుకోవాలి. అవిద్యయనగా ఏమిటో చక్కగా తెలిసినవారు మృత్యురూప సంసారబంధనాలన్నిటినుండి తరిస్తారు. విద్యతో (ఆత్మ పరమాత్మల యదార్థ జ్ఞానంతో) అమృతత్వాన్ని పొందుతారు.

**వాయు రనిల మమృత మథేదగ్ం భస్మాన్తగ్ం శరీరమ్ ।**
**ఓ3మ్ క్రతోస్మర, క్లిబే స్మర, కృతగ్ం స్మర ॥ (15)**

దేహ త్యాగ సమయంలో శరీరస్థ వాయువులు కారణరూప బాహ్యావాయువులో కలిసిపోతాయి. కనుక, ఓ కర్మశీల మానవా! పరమేశ్వరుని ప్రధాన నామమైన ఓ3మ్‌ను స్మరించు. ఆత్మబలము కొరకు అంతర్యామిని స్మరించు. చేసిన శుభాశుభకర్మలను స్మరించు. వాటి ఫలము ననుభవింపక తప్పదని యెరిగి ధర్మాత్ముడవగుము. పరమేశ్వరు నీ విధముగా ప్రార్థించు.

**అగ్నే నయ సుపథా రాయే అస్మాన్**
**విశ్వాని దేవ వయునాని విద్వాన్ ।**
**యుయో ధ్యస్మ జ్జుహూరాణ మేనో**
**భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥ (16)**

"ఓ స్వయంప్రకాశక పరమేశ్వరా ! మమ్ము సుపథమున (మంచి మార్గమున) నడుపుము. మా ఆలోచనల నన్నిటిని నీ వెరుగుదువు, అందలి స్వార్థ, సంకుచిత పాప భావాలన్నిటినీ తొలగించు. అందుకై నిన్ను మిక్కిలిగా ప్రార్థించుచున్నాను."

**హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్ ।**
**యో ऽ సా వాదిత్యే పురుషః**
**సోऽసా వహమ్ ఓ3మ్ ఖం బ్రహ్మ ॥ (17)**

పై విధముగా ప్రార్థించు భక్తుల నుద్దేశించి పరమేశ్వరు డిట్లనుచున్నాడు - "ఓ మానవులారా ! ఆదిత్యాది లోకలోకాంతరాలలో వ్యాపించియున్న నేను ఇచట కూడా ఉన్నాను. నేనే మీ అవిద్యారూప ఆవరణను తొలగించి సత్యసాక్షాత్కారము చేయించగల సమర్థుడను.

నేను 'ఓ3మ్' - సర్వ సంరక్షకుడను.

ఖం - సర్వవ్యాపకుడను .

బ్రహ్మ - సర్వాధికుడను (సర్వజీవులకన్న సమస్త ప్రకృతికన్న అధికుడను).

ఇది పరమేశ్వరు డుపదేశించిన ఉపనిషత్తు. పరమేశ్వరుడు సర్వవ్యాపకుడనీ, సర్వశక్తిమంతుడనీ ఇది స్పష్టంగా చెబుతోంది. అతడు అకాయుడనీ (శరీరరహితుడనీ - అవతారమెత్తడనీ), సృష్టికి ఏకమాత్ర కర్తయనీ వివరిస్తోంది. సాధనచేసి సమస్త బంధనాలనుండి, దుఃఖాలనుండి విడిపోవచ్చుననియు ఉపదేశిస్తోంది.

## కేనోపనిషత్తు

'కేనేషితం పతతి ప్రేషితం మనః' అనే వాక్యంతో ఈ ఉపనిషత్తు ప్రారంభింపబడింది. అందుచే ఇది కేనోపనిషత్తనే పేరుతో ప్రసిద్ధి చెందింది. సామవేదానికి వెయ్యి శాఖలున్నట్లు చెబుతారు. అందులో తలవకార శాఖ ఒకటి. ఆ శాఖలోని చివరి అధ్యాయమే ఈ ఉపనిషత్తు. ఇది గురు శిష్య సంవాదరూపంలో ఉంటుంది. మొదటి మంత్రంలో -

"ఎవని ప్రేరణతో మనస్సు కోరిన విషయాన్ని పొందుతోంది? ఎవని ప్రేరణతో ఈ వాక్కు పలుకుతోంది? ఏ దేవత చక్షుః శ్రోత్రములను వాటి విషయములందు నియుక్తం చేస్తోంది?" అనే ప్రశ్నలు కనబడతాయి. ఈ ప్రశ్నలకు విస్తృత సమాధానమే ఈ ఉపనిషత్తు. సమాధానంగా - ఈ యింద్రియాలన్నీ జీవునకు సాధనాలే అయినా వాటికి ఆ శక్తినిచ్చి కాపాడేది పరమేశ్వరుడే నని ఈ ఉపనిషత్తు చెబుతుంది. ఈ జన్మలోనే అన్నిటికీ మూలమైన ఆ పరబ్రహ్మతత్వాన్ని తెలుసుకో. లేకుంటే -

**"ఇహచేదవేదీ దథ సత్యమస్తి**
**నచే దవే దీన్మహతీ వినష్టిః"** గొప్ప నష్టమే కలుగుతుందంటుంది. పరమేశ్వరుడు ప్రసాదించిన మానవజన్మను వ్యర్థం చేసుకున్నట్టే ఔతుందని హెచ్చరిస్తుంది.

## కఠోపనిషత్తు

నచికేతుని కథగా సాగిన ఈ ఉపనిషత్తు బ్రహ్మవిద్యను చాలా సరళంగా సుబోధకంగా మధురమైన భాషలో బోధిస్తుంది. నచికేతుని తండ్రిపేరు వాజశ్రవసుడు. అతడు ముక్తినిగోరుతూ సర్వజిన్నామక (సర్వమేధ) యజ్ఞాన్ని నిర్వహిస్తాడు. దానిలో భాగంగా తనకున్న సర్వసంపదలను దానం చెయ్యాలి. ఆ నియమాన్ని పాటిస్తూ వాజశ్రవసుడు దానాలు చేస్తుండగా నచికేతుడు పరిశీలిస్తాడు. చాలా ముసలివి, బక్కచిక్కినవి, వట్టిపోయినవి అయిన గోవులను కూడా తండ్రి దానం చేస్తూ ఉండటం గమనిస్తాడు. ఇట్టి దానంవల్ల తండ్రికి సద్గతి కలుగదని తలచిన నచికేతుడు ఈ విషయం తండ్రి దృష్టికి

తీసుకురావాలనుకుంటాడు. దాన క్రియలో నిమగ్నమైయున్న తండ్రికి విసుగును కలిగిస్తూ 'నన్నెవరకు దానమిస్తావని" పలుమార్లు ప్రశ్నిస్తాడు. దానితో విసుగు చెందిన వాజశ్రవసుడు కోపంతో నిన్ను మృత్యువున కిస్తానంటాడు. తండ్రి వాక్యాన్ని సత్యం చెయ్యటానికి నచికేతుడు మృత్యుభవనానికి వెడతాడు.

పై కథ తైత్తరీయ బ్రాహ్మణంలోను మహాభారతంలోను కూడా కనబడుతుంది. కాని, వాటిలో కొన్ని భేదాలున్నాయి. అందుచే, ఈ కథ ఆత్మజ్ఞానా న్నుపదేశించటానికి ఋషిచే కల్పించబడినట్లు గ్రహించాలి. దీనిలో ఋషి ముఖ్యంగా ఐదు విషయాలు బోధిస్తాడు. అవి - 1. తన యింటికి అతిథిగా వచ్చిన వ్యక్తిని సత్కరించటం (ఆహార పానీయాదుల నివ్వటం) గృహస్థుని ప్రథమ కర్తవ్యం అంటాడు. 2. అగ్నిహోత్రంవల్ల మానవులకు, ఇతర ప్రాణులకు సుఖశాంతులు కలుగుతాయి. కనుక నిత్యాగ్నిహోత్రులు కావాలంటాడు. 3. శరీరాన్ని వదిలిన జీవాత్మ మరణించదు. అది అమరము-

**న జాయతే మ్రియతే వా విపశ్చిన్నాయం**
**కుతశ్చిన్న బభూవ కశ్చిత్ ।**
**అజో నిత్యః శాశ్వతో ఽ యం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే ॥ (కఠోపనిషత్తు. 2-18)**

అది (జీవాత్మ) ఒకప్పుడు పుట్టుటం గాని, మరొకప్పుడు చనిపోవటం గాని జరుగదు. అది దేనినుండీ పుట్టలేదు. దానిని ఎవరూ నశింపచేయలేరు. అది - అజః (జన్మలేనిది), నిత్యః (ఏ పరిణామము చెందక ఎప్పటికీ ఒకటిగా ఉంటుంది), శాశ్వతః (శాశ్వతమైనది), పురాణః (ఇప్పుడున్నట్లే పూర్వం కూడా ఉంది), న హన్యతే హన్యమానే శరీరే (శరీరము చంపబడినను జీవాత్మ చావదు. పరమేశ్వరునిచే మరొక శరీరంలో ప్రవేశపెట్టబడుతుంది) అని వివరిస్తాడు.

4. పరమేశ్వర తత్త్వం శబ్ద స్పర్శ రూప రస గంధాదులకన్న భిన్నమైనది. అది - అనాది-అనంతం-అచలం -

**అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం**
**తథారసం నిత్య మగంధవ చ్చ యత్**
**అనాద్యనంతం మహతః పరం ధ్రువం**
**నిచాయ్య తం మృత్యుముఖాత్ ప్రముచ్యతే ॥**

**(కఠోపనిషత్తు . 3-15)**

అట్టి పరమేశ్వరుని సాక్షాత్కారం పొందినవ్యక్తి (జీవాత్మ) మాత్రమే జననమరణరూప సంసారచక్రబంధనాన్నుండి విడివడి పరమానందాన్ని (ముక్తిని) పొందుతాడంటాడు కఠోపనిషత్కారుడు.

5. పరమేశ్వరుడే సృష్టికి ఏకైక కర్త. అతడే ప్రళయకాలంలో ఏకరూపంగా నున్న ప్రకృతిని బహురూపములుగా (ఈ ప్రపంచంగా) సృష్టిస్తున్నాడు. అతడే ఈ అనిత్యమైన ప్రపంచపదార్థాలలో నిత్యుడుగా ఉన్నాడు. అతడే చేతనులైన జీవులలో విశిష్ట చేతనుడుగా నున్నాడు. అనేకులైన జీవులకు కర్మఫలాలనిచ్చేవాడు కూడా అతడొక్కడే. అట్టి సర్వాంతర్యామియైన పరమాత్మను ఏ ధీరుడు (ధ్యానశీలుడు) తన ఆత్మలో దర్శిస్తాడో అతడే శాశ్వతమైన సుఖాన్ని, శాశ్వతమైన శాంతిని పొందుతాడు.

**ఏకో వశీ సర్వభూతాంత్మరాత్మా**
**ఏకం రూపం బహుధా యః కరోతి ।**
**త మాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః**
**తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥**
**నిత్యో ఽ నిత్యానాం చేతనశ్చేతనానా**
**మేకో బహూనాం యో విదధాతి కామాన్ ।**
**త మాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః**
**తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషామ్ ॥ (కఠోపనిషత్తు 5-12,13)**

అని ఈ ఋషి ఉపదేశిస్తాడు.

## ప్రశ్నోపనిషత్తు

బ్రహ్మ జిజ్ఞాసువులైన ఆరుగురు బ్రహ్మచారులు సమిత్ పాణులై బ్రహ్మవేత్తయైన పిప్పలాద మహర్షి దగ్గరకు వెళ్ళి బ్రహ్మతత్వాన్ని గురించి ప్రశ్నించి తెలుసుకుంటారు. అందుచే ఈ ఉపనిషత్తుకు ప్రశ్నోపనిషత్తనే పేరు వచ్చింది.

భక్తి శ్రద్ధలతో శుశ్రూషాభావాన్ని వెల్లడిస్తూ సమిధలను చేతపట్టుకుని వచ్చిన ఆ బ్రహ్మచారుల యోగ్యతను పరీక్షించాలనుకుంటాడు పిప్పలాదుడు. మీరంతా ఒక సంవత్సరం పాటు బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ తపస్సు చేసి

అనంతరం ప్రశ్నించి తెలుసుకోమంటాడు. వారంతా తీవ్ర జిజ్ఞాస కలిగినవారే కనుక ఒక సంవత్సర కాలం శ్రద్ధతో తపస్సు చేసి ఒకరొకరుగా ప్రశ్నించి తెలుసుకుంటారు.

ఆ బ్రహ్మచారు లారుగురు సుయోగ్యులైన జిజ్ఞాసువులు. అందుచే వారడిగిన ప్రశ్నలును గంభీరమైనవే. పిప్పలాద మహర్షి పరిపూర్ణ జ్ఞాని కనుక ఆ ప్రశ్నలన్నిటికీ చక్కగా హేతుబద్ధంగా వైజ్ఞానికంగా సమాధానాలు చెబుతాడు. వాటిని సంక్షిప్తంగా వ్రాయటం సాధ్యంకాదు. పాఠకు లా విషయాలను ఆ ఉపనిషత్తు చదివి తెలుసుకోగోరుచున్నాము.

## ముండకోపనిషత్తు

శౌనకు డనే ఒక గృహస్థునకు బ్రహ్మజిజ్ఞాస కలిగింది. అతడు ప్రాచీన విధి ననుసరించి సమిత్పాణియై శిష్యభావంతో మహర్షి అంగిరసుని సమీపించి నమస్కరించి -

**కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి ?**

హే భగవన్ ! ఓ స్వామీ ! దేనిని తెలిసికొంటే ఈ సర్వం తెలియబడుతుంది? తెలుపుడని ప్రార్థించాడు. ఆ ప్రశ్నకు సమాధానంగా మహర్షి -

**'ద్వేవిద్యే వేదితవ్యే..... పరాచైవాపరాచేతి' (1-1-4)**

నాయనా ! లోకంలో రెండు విద్యలు తెలుసుకోవలసి వుంది అవి - 1. పరావిద్య, 2. అపరావిద్య అని ప్రారంభించి ముందుగా పరాపరవిద్య లెవ్వియో వివరించాడు.

**"తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో ఽ థర్వవేదః**
**శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిష మితి**
**అథ పరా యయా తదక్షర మధి గమ్యతే " (1-1-5)**

"ఆ రెంటిలో ఋగ్వేదాది చతుర్వేదాలు, శిక్షాకల్పాది షడంగాలు కలిసి అపరావిద్య యనబడతాయి. ఏ విద్యవల్ల నాశరహిత అక్షర పరబ్రహ్మ సాక్షాత్కారం కలుగుతుందో అది పరావిద్య" అంటాడు. ఈ రెండు విద్యలు వేదితవ్యములే (తెసుకోవలసినవే) నని మహర్షి అభిప్రాయం. ఈశ్వరవాణియైన

ఈశోపనిషత్తు వాటిని విద్యా అవిద్య లంటుంది. ఈ రెండు తోడుతోడుగా తెలుసుకోవలసినవే. అపరావిద్య వలన - ఋగ్వేదాదులవలన కర్తవ్య కర్మల నాచరించి పవిత్రుడౌతాడు. పరావిద్యతో పరమాత్మ సాక్షాత్కారం పొంది ముక్తుడౌతాడు. కనుక ఈ రెండూ అవసరమే.

ఈ విధంగా ప్రారంభింపబడిన ఈ యుపనిషత్తు బ్రహ్మపదార్థ గుణ కర్మ స్వభావాలను విశదపరస్తుంది. ఆ పరతత్వాన్ని సాక్షాత్కరించు కోవడానికి ఒక చక్కటి ధ్యానపద్ధతిని చెబుతుంది.

**ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మా తల్లక్ష్య ముచ్యతే ।**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥ (2-2-4)**

"జప ధ్యానాలు చేసేటప్పుడు ప్రణవాన్ని 'ఓ౩మ్' అనే పదాన్ని ధనుస్సుగా భావించాలి. తన ఆత్మనే బాణంగా భావిస్తూ తనలో అంతర్యామిగా నున్న బ్రహ్మను లక్ష్యంగా చేసుకొని అంతర్ముఖుడు కావాలి. విలుకాడు లక్ష్యాన్ని ఛేదించేటట్టు అప్రమత్తతో సాధనచేస్తే బ్రహ్మ సాక్షాత్కారమౌతుంది. బాణం లక్ష్యంలో గుచ్చుకొని స్థిరపడునట్లు తాను బ్రహ్మమందు స్థిరపడాలి. ధ్యానమగ్నుడై సమాధిస్థితిని పొందా"లంటాడు ఈ మహర్షి

**"భిద్యతే హృదయ గ్రంథి శ్ఛిద్యంతే సర్వ సంశయాః ।**
**క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥(2-2-8)**

అంతర్యామియైన పరమేశ్వరుని సాక్షాత్కారం పొందితే అతని అవిద్యారూప హృదయగ్రంథి (ముడి = దేహాత్మభ్రాంతి) విడిపోతుంది. సందేహాలన్నీ ఛేధింపబడతాయి. కర్మలు క్షీణిస్తాయి. పరమానందం పొందుతాడు. ఆ ఆనందాన్ని వర్ణించడానికి మాటలుచాల వని ఉపదేశిస్తాడు.

చివరి తృతీయ ఖండంలో మహర్షి అంగిరసుడు **'ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే'** అనే ఋగ్వేద మంత్రాన్ని పేర్కొంటూ సంసారరూప వృక్షంపై రెండు పక్షులున్నాయి. అవి - ఒకటి జీవాత్మ రెండవది పరమాత్మా అంటాడు. ఈ విషయం ఈ ప్రకరణం చివరిలో వివరంగా తెలుసుకొందాము.

# మాండూక్యోపనిషత్తు

మాండూకుని కుమారుడైన మాండూక్య మహర్షిచే ఈ ఉపనిషత్తు రచింపబడింది. అందుచే దీనికి మాండూక్యోపనిషత్తనే పేరు వచ్చింది.

పరమేశ్వరుడు అనంతుడు కనుక అతని గుణకర్మస్వభావాలు అనంతం. అందువల్ల అతని గుణకర్మలను సూచించే నామాలు (పేర్లు) కూడా అనంతమే. ఆ అనంతనామాలలో అతని ముఖ్య నామం (అసలు పేరు) ఓ౩మ్. మిగిలినవన్నీ ఓం నామక పరమేశ్వరుని విశేషణాలే. ఈ 'ఓం' కారంలో నాలుగు మాత్రలున్నాయి. అవి అకార, ఉకార, మకార, అమాత్రలు. ఓం కారంలో మాత్రలున్నట్లే జీవులమైన మనకు 4 అవస్థలు - స్థానాలు ఉంటాయి. అవి - జాగృత్ స్వప్న సుషుప్త తురీయావస్థలు.

పిండాండంలో నివసించే జీవులమైన మనకు 4 అవస్థలు ఉన్నట్లే బ్రహ్మాండంలో వ్యాపించియున్న పరబ్రహ్మకుకూడా 4 అవస్థలను కల్పించి రెంటినీ పోలుస్తూ మాండూక్య మహర్షి ఈ యుపనిషత్తులో బోధించాడు. వాస్తవానికి పరమేశ్వరునికి నాలు గవస్థలుండవు. అతడు నిత్యశుద్ధుడు, నిత్యబుద్ధుడు నిత్యముక్తుడు. కనుక ఇది అలంకారిక వ్యాఖ్య మాత్రమే. సృష్టి జరుగుచున్నపుడు పరమేశ్వరుడు జాగ్రదావస్థలో బహిః ప్రజ్ఞ కలిగి వైశ్వానరునిగా ఉంటాడు. ఇది అతని ప్రథమ పాదం. సృష్టి పిదప స్థితిరూప వ్యవస్థను నడుపుచున్నపుడు స్వప్న స్థానంలో అంతః ప్రజ్ఞ కలిగి తైజసునిగా ఉంటాడు. ఇది అతని ద్వితీయ పాదం. ప్రళయస్థితిలో ప్రజ్ఞానగనిగా తన స్వస్వరూపంలో ఉంటాడు. అప్పుడతడు ప్రాజ్ఞుడు. ఇది అతని తృతీయ పాదం.

పైదంతా అలంకారిక వర్ణన. వాస్తవంగా పరమేశ్వరునికి త్రివిధ స్థితులుగానీ, ప్రజ్ఞలుగానీ, త్రివిధ పాదాలు గానీ ఉండవు. **"శాన్తం శివ మద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా సువిజ్ఞేయః"** అతడు ఏ యుపద్రవములులేని శాంతస్వరూపుడు. కల్యాణ స్వరూపుడు. అద్వైతుడు (అంటే అతనికి సాటిగల మరియొక తత్వం లేనివాడు). అట్టి అద్వైత పరబ్రహ్మమే చతుర్థపాదం అనే తురీయ స్థానం, (మన్యంతే) అని విద్వాంసులు తలంచుచున్నారు. (సః ఆత్మా) అది యాత్మ-సర్వవ్యాపకము. (సః విజ్ఞేయః) అదియే తెలుసుకోతగినదని మాండూక్య మహర్షి అంటాడు.

'ఓ3మ్' నామములోని త్రిమాత్రలు - అకార ఉకార మకారములు. పై ఆలంకారిక పరమేశ్వరుని త్రివిధ స్థితులను తెలుపుతున్నవంటాడు. ఇవేకాక, మాత్రారహితమైన చతుర్థస్థితి ఒకటుంది. అదే తురీయము. అది వ్యవహార యోగ్యం కాదంటాడు.

**"అమాత్ర శ్చతుర్థో౽వ్యవహార్యః ప్రపంచోపశమః**
**శివో౽ద్వైత ఏవ మోంకార ఆత్మైవ"**

అది శివము, అద్వైతము, వ్యాపకము. అట్టి పరమేశ్వరుని అసలు పేరు ఓ3మ్. అతనిని తెలుసుకున్నవాడే (నిర్బీజసమాధిలో సాక్షాత్కారం పొందినవాడే) పరమేశ్వరుని పొందు"నని చెబుతూ మహర్షి ఈ యుపనిషత్తును ముగించాడు.

## ఐతరేయోపనిషత్తు

ఈ యుపనిషత్తు ఋగ్వేదానికి చెందిన ఐతరేయారణ్యకము లోనిది. అందుచే నిది ఐతరేయోపనిషత్తుగా వ్యవహరింపబడుతోంది. దీనిలో మూడధ్యాయాలున్నాయి. మొదటి అధ్యాయంలో సృష్టి రచన వర్ణింపబడింది. ఈ వర్ణన ఆధునిక సృష్టిరచనా విజ్ఞానానికి చాలా దగ్గరగా ఉంటుంది. ఈ విషయం మరొక లఘు గ్రంథంలో తెలిసికొందాము.

రెండవ అధ్యాయంలో జీవుడు మాతృగర్భంలో ప్రవేశించే విధము చెప్పబడింది. ఈ ఋషి కథనం ప్రకారం - జీవుడు ముందుగా తండ్రి శరీరంలో ప్రవేశించి అతని వీర్యంలోకి చేరతాడు. ఇది ఆ జీవునకు మొదటి జన్మ. అనంతరం గర్భాధాన క్రియద్వారా తల్లి గర్భంలో ప్రవేశించి అక్కడ స్థిరపడతాడు. నవమాసాల యనంతరం గర్భం నుండి భూమిపైకి వస్తాడు. ఇది అతని రెండవ జన్మ. ఆ శిశువు క్రమంగా పెరిగి పెద్దవాడై యువావస్థను పొంది తనకు తగిన వధువును వరించి గృహస్థుడౌతాడు. అత డా శరీరంతో వృద్ధుడై మరణించకముందే (పునః జాయతే) మరల జన్మిస్తాడు. అంటే, అతడు తన భార్యయందు వీర్యాన్నుంచి గర్భస్థుడౌతాడని ఈ ఋషి భావం. ఇది తృతీయ జన్మ. ఈ విధంగా జీవుడు ముక్తుడయ్యే వరకు జనన మరణాలను పొందుతూనే ఉంటాడు.

**"కో౽య మాత్మేతి వయ ముపాస్మహే, కతరః స ఆత్మా**
**యేన వా రూపం పశ్యతి? యేన వా శబ్దం శృణోతి?...**

అంటూ ప్రారంభింపబడిన మూడవ అధ్యాయం బ్రహ్మజిజ్ఞాస చేయటమే మానవ జీవన పరమార్థమంటుంది. జీవుడు ఇంద్రియాలతో శబ్ద స్పర్శాదుల ననుభవిస్తున్నా అవి అతని శక్తివల్ల కాదు. వాటి నా విధంగా నిర్మించి వాటి కా శక్తినిచ్చిన విశిష్ట చేతన పదార్థమొకటుంది. అదియే పరమాత్మ. దాన్ని చక్కగా తెలిసికొన్నవాడే అమృతత్వాన్ని ముక్తిని పొందుతాడని చెబుతూ ఈ ఉపనిషత్తు ముగుస్తుంది.

## తైత్తిరీయోపనిషత్తు

ఈ ఉపనిషత్తు యజుర్వేదంయొక్క తైత్తిరీయ శాఖలోనిది. దీని కర్త తిత్తిరి మహర్షి. **'శన్నో మిత్రః శం వరుణః । శన్నో భవత్వర్యమా।'** అనే ప్రసిద్ధ ప్రార్థనా మంత్రంతో ప్రారంభమైన ఈ ఉపనిషత్తు పరమేశ్వరుని **'త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి"** అంటుంది. " ఓ వాయూ! వాయువువలె సర్వత్ర వ్యాపించియున్న ఓ పరమేశ్వరా ! నీవే ప్రత్యక్ష బ్రహ్మవు. నిన్నే ప్రత్యక్ష బ్రహ్మమని ఉపదేశింతును గాక !" అని సంకల్పం చేయుమంటుంది.

మొదటి అధ్యాయం శిక్షావల్లిలో ఏయే కర్మలు చేయటంవల్ల మానవునకు శుభములు కలుగునో చక్కగా ఉపదేశించబడింది. ఏ కర్మలు చేస్తున్నా స్వాధ్యాయ ప్రవచనాలను విడువవద్దంటుంది. బ్రహ్మచారులు స్నాతకులై గృహాలకు వెళ్ళునపుడు గురువు చేయవలసిన స్నాతకోపదేశం ఈ అధ్యాయం చివరిలో ఉంది. అది ఈ నాటికీ అందరూ అనుసరించదగిన ఉత్తమ ఉపదేశం. తప్పక చదువతగినది. ఆచరించతగినది.

రెండవ అధ్యాయం బ్రహ్మానందవల్లి. దీనిలో సృష్టిరచనా క్రమాన్నుండి ప్రారంభించి బ్రహ్మానందం వరకు వర్ణింపబడింది. సర్వవిధ ఐశ్వర్యములు గల మనుష్యుడు పొందు ఆనందమును ఒక పరిమాణముగా (యూనిట్‌గా) తీసుకొని అంతకన్న వందరెట్లు ఆనందం మనుష్యగంధర్వుడు పొందు ననియు, అంతకన్న వందరెట్లు దేవగంధర్వుడు పొందుతాడనియు ఈ విధంగా వందల వేల లక్షల కోట్ల రెట్లైన ఆనందముకూడా ముక్తిలో జీవుడు పొందే ఆనందానికి సరికాదనియు చెప్పబడింది.

తృతీయాధ్యాయ మైన భృగువల్లిలో అన్న ప్రాశస్త్యం వివరింపబడింది. గృహస్థుడు అతిథిని ఆదరించి సత్కారించాలనీ, అతిథిసత్కారం వ్రతంగా స్వీకరించాలనీ ఉపదేశించబడింది.

## ఛాందోగ్యోపనిషత్తు

ఈ ఉపనిషత్తు సామవేదానికి చెందిన తాండ్యబ్రాహ్మణం లోనిది. దీని కర్త తండ్యఋషి. ఛందస్సంటే వేదం. వేదంవల్ల కలిగే జ్ఞానాన్ని ఛందోగం అంటారు. అట్టి వేదజ్ఞానానికి మార్గం చూపేది కనుక దీనికి ఛాందోగ్యం అనేపేరు వచ్చింది. కేవలం జ్ఞానాన్ని గురించేకాక ఆ జ్ఞానం లభించేటందుకు చేయవలసిన సాధన గురించి - ఉపాసన గురించి దీనిలో చర్చించబడింది.

ఓ3మ్ కారాన్ని ఉద్గీథ మంటుంది ఈ ఉపనిషత్తు. ఉద్గీథం అంటే - ఉచ్చస్వరంతో గానం చేయబడేదని అర్థం. అట్టి ఓంకారం లోని రహస్యాలను ఇది వివరిస్తుంది.

**"ఏషాం భూతానాం పృథివీ రసః, పృథివ్యా ఆపోరసః"** అంటూ ప్రారంభించబడిన ఈ ఉపనిషత్తు సర్వభూతాల సారమూ, సర్వవేదాల సారమూ ఉద్గీథమే - ఓంకారమే అంటుంది. **'ఏష రసానాం రసతమః పరమః పరార్థో஽ష్టమో య 'ఉద్గీథః'** ఉద్గీథముచే చెప్పబడు బ్రహ్మమే ఈశ్వరుడు. అతడే రసముల కన్నిటికంటె అత్యుత్తమ రసం - ఆనందరసం" అంటుంది. కనుక యిక్కడ ఉద్గీథ మంటే పరమేశ్వరుడే. ఈ ఉపనిషత్కారుడు కొన్ని కథల ద్వారా, కథానికల ద్వారా ఉపాసనా విధానాలను తెలిపాడు. అందుచే సామాన్యంగా దీనిని చదివితే చాలా సందేహాలు వస్తాయి. గురుముఖతః (బ్రహ్మవేత్త సమ్ముఖమున) అధ్యయనం చేయటం మంచిది.

అద్వైతులు ఈ ఉపనిషత్తులోని రెండు వాక్యాలను తీసుకొని తమ అద్వైతమతాన్ని సిద్ధింపజేయ యత్నిస్తారు. కాని, ఆ వాక్యాల కర్థం వారు సరిగా తెలుసుకోవటంలేదు. వాటిని గురించి సంక్షిప్తంగా తెలిసికొందాము.

**'సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానీతి శాంత ఉపాసీత' (3-14-1)**

"ఈ సర్వము బ్రహ్మమే. దానినుండే ఈ విశ్వం జనించి దానియందే లీనమగుచున్నది." బ్రహ్మ ఈ సర్వానికి ఆధారం కావటం వలన అదియే సర్వమని యిచ్చట చెప్పబడింది. ' ఈ జగత్తు లేనే లేదు. ఇదంతా మిథ్య' అనే

మాటలు పై వాక్యంలో లేవు. ఉప్పు ఎక్కువగా కలిగిన గంజిని ఒకడు త్రాగి ఇదంతా ఉప్పే అన్నట్లు ఈ ఋషి యిదంతా బ్రహ్మమయం అంటున్నాడే కాని, జగత్తు లేనే లేదనటం లేదు.

రెండవ వాక్యం–తత్త్వమసి. దీని అసలురూపం **'తత్త్వమస్తి'** తత్త్వమ్+అస్తి = యథార్థవస్తువై యున్నది . స ఆత్మా తత్త్వమస్తి = ఆ వ్యాపక పరమేశ్వరుడే సత్యమైన వస్తువైయున్నది. దీనిని 'తత్+త్వమ్+అసి' అని మూడు పదములుగా విభజించి తత్ నామక పరమేశ్వరుడు నీవే అయివున్నావని అద్వైతులు అర్థం చెప్ప యత్నిస్తారు. కాని, ఆ యర్థం ఈ ఉపనిషత్తులో కలువదు. 'తస్మిన్ త్వమ్ అసి' అని విగ్రహవాక్యం చేయటమే సరియైన పద్ధతి. అప్పుడు ఆ బ్రహ్మయందే నీవున్నావని అర్థం. లేదా 'తదాత్మకస్త్వమసి' ఆ పరమేశ్వరునే నీ అంతరాత్మగా కలిగి ఉన్నా' వని అర్థం చెప్పుకోవచ్చు.

అద్వైతులు మరొక పొరబాటు చేస్తున్నారు. పై రెండు వాక్యాలు వేద వాక్యాలంటున్నారు. కాని, ఇవి ఛాందోగ్యోపనిషత్తు వాక్యాలేకాని వేద వాక్యాలు కావు.

సత్యకాముని కథ ఈ ఉపనిషత్తులోనే వస్తుంది. అతడు దాసీ పుత్రుడు. తండ్రి ఎవరో, తండ్రి గోత్రమేదో కూడా తెలియని దీనస్థితి. అట్టి వ్యక్తికి కూడా బ్రహ్మజిజ్ఞాస కలిగింది. హరిద్రుమతు డనే గురువు వద్దకు వెళ్ళి యథార్థం చెప్పి బ్రహ్మవిద్యోపదేశం చేయుమంటాడు. గురువు విశాల హృదయంతో **'నైత దబ్రాహ్మణో వివక్తి'** బ్రాహ్మణుడుకాని వాడు ఈ విషయం చెప్పలే'దని తలచి అతనికి ఉపనయనం చేసి శిష్యునిగా స్వీకరించాడు. ఈ కథవల్ల ఏ పరివారంలో జన్మించినా సత్యభాషణాది సద్గుణాలు కలిగిఉంటే ఉపనయనానికి, బ్రహ్మవిద్యకు అర్హులే నని అర్థమౌతున్నది.

## బృహదారణ్యకోపనిషత్తు

బృహదారణ్యకం శుక్ల యజుర్వేదానికి చెందిన వాజసనేయశాఖ లోనిది. యాజ్ఞవల్క్య మహర్షి ప్రణీత శతపథ బ్రాహ్మణంలో యిది 14వ కాండగా కనబడుతుంది. దీనిలో ఆరు అధ్యాయాలున్నాయి.

ఋషులు తెలిసినదాని నాధారముగా చేసికొని తెలియనిదానిని

వర్ణించుటకు యత్నిస్తారు. ఈ సృష్టి రహస్యాలను తెలుపుటకే అశ్వమేధాది యజ్ఞాలు రచింపబడినవి. ఋషి ఈ ఉపనిషత్తులో సృష్టిని అశ్వమేధయజ్ఞ క్రియాకలాపములతో పోలుస్తూ ఉపనిషత్తు నారంభించినాడు. ఛాందోగ్య ప్రశ్నోపనిషత్తులలో వలె దీనిలోని విషయాలన్నీ చాలా గూఢంగా ఉంటాయి. చక్కని వ్యాఖ్యానంతో కూడిన గ్రంథాన్ని చదివితేనే కాని యివి అర్థం కావు. తెలుగులో మనకు లభించే వ్యాఖ్యాన గ్రంథాలలో కళాప్రపూర్ణ పండిత గోపదేవ్ శాస్త్రిగారి రచనలే అగ్రగణ్యంగా ఉంటాయి. వాటిలో విషయ స్పష్టత ఉంటుంది.

రెండవ అధ్యాయంలో యాజ్ఞవల్క్య మైత్రేయిల సంవాదం కనబడుతుంది. యాజ్ఞవల్క్యుడు వేదవేదాంగ పారంగతుడు. యోగి, తపస్వి, బ్రహ్మవేత్త. గృహస్థాశ్రమాన్ని చక్కగా నిర్వహించిన గృహస్థు. ఏ కారణం చేతనో అతనికి యిద్దరు భార్యలుండిరి. ఒకరు మైత్రేయి, మరొరు కాత్యాయిని. మైత్రేయి బ్రహ్మవాదిని. కాత్యాయిని సాధారణ గృహిణి. వారిద్దరికి యాజ్ఞవల్క్యుడు ధనం పంచి యివ్వాలనుకొన్నాడు. అప్పుడు బ్రహ్మవాదినియైన మైత్రేయి ఈ ధనంతో నాకు అమృతత్వం లభిస్తుందా? అని అడిగింది. దానికి ఋషి సమాధానం చెబుతూ ఈ ఆస్తిపాస్తులన్నీ ఈ లోకంలో సుఖంగా జీవించటానికి పనికి వస్తాయేగాని అమృతాత్వాన్ని యివ్వలేవంటాడు. 'మరి వీటితో నాకేమీ పని? అమరత్వాన్ని పొందటానికి కావలసిన బ్రహ్మవిద్యనే' బోధించమంటుంది మైత్రేయి. అంతట యాజ్ఞవల్క్యుడు అనేక ఉపమానాలతో బ్రహ్మవిద్య నుపదేశిస్తాడు.

మూడవ అధ్యాయం చాలా ముఖ్యమైనది. విదేహ రాజైన జనకుడు బహుదక్షిణ నామక యజ్ఞాన్ని నిర్వహించి అందు సర్వశ్రేష్ఠ విద్వాంసుని సత్కరింపదలచాడు. ఒక వెయ్యి గోవులను తెప్పించి వాటి కొమ్ములకు పది పది బంగారు నాణెములు కట్టించాడు. మీలో నందరికన్న ఎక్కువ బ్రహ్మజ్ఞాని ఈ గోవులను తోలుకుపోవచ్చు నన్నాడు. ఎవ్వరును ఆ గోవులను తోలుకుపోవడానికి సాహసించలేకపోయారు. వారిలో బ్రహ్మ తేజస్సుతో వెలుగొందుచున్న యాజ్ఞవల్క్యుడు తన శిష్యుడైన సామశ్రవుని పిలిచి "సామశ్రవ! ఈ గోవులను మన ఆశ్రమానికి తోలుకుపో"అన్నాడు. శిష్యు డట్లే చేసాడు. దానితో మిగిలిన విద్వాంసులంతా క్రోధితులయ్యారు. నీవు సర్వోచ్ఛ

బ్రహ్మవేత్తనుగా నిరూపించుకోమన్నారు. యాజ్ఞవల్క్యుని ప్రశ్నింప తలపడ్డారు. ముందుగా జనక మహారాజు పురోహితుడైన అశ్వలుడు ప్రశ్నించాడు. దానికి మహర్షి సమర్థవంతంగా సమాధానం చెప్పాడు. కహోలుడు, గార్గి, ఉద్దాలకుడు, విదగ్ధి వరుసగా ప్రశ్నించారు. వీరిలో బ్రహ్మవాదిని గార్గి వేసిన ప్రశ్నలు విశిష్టంగా ఉంటాయి. అవి ఆమె యొక్క వైదుష్యానికి ప్రతీకలు. వాచక్నుని పుత్రికయైన గార్గి సభలో మరొకసారి లేచి ఋషిపై తీవ్రమైన రెండు ప్రశ్నాస్త్రాలను సంధిస్తుంది. వీటికి సరియైన సమాధానం చెబితే నిన్ను మించిన బ్రహ్మవేత్త ఈ సభలో లేడంటుంది. ఆరెంటిని ఋషి చక్కగా ఎదుర్కొని సమాధానపరుస్తాడు. దానితో విజయం యజ్ఞావల్క్య మహర్షిని వరిస్తుంది.

చతుర్థాధ్యాయంలో జనకునకు యాజ్ఞవల్క్యుని ఉపదేశముంటుంది. పంచమ షష్ఠాధ్యాయాలలో చాలా గూఢమైన ఆధ్యాత్మిక విషయా లుంటాయి.

త్రిమతాచార్యు లంగీకరించిన పై దశోపనిషత్తులతోబాటు శ్వేతాశ్వత రోపనిషత్తును కూడా మనం అంగీకరించటం మంచిది. దానిలో వైదిక త్రైతవాదం చాలా స్పష్టంగా ఉంటుంది. కఠోపనిషత్తువలె సులభంగా బోధపడుతుంది. దీనిలో కొన్ని వేదమంత్రాలుకూడా ఉన్నాయి. కనుక దానిని గురించి కూడా సంక్షిప్తంగా తెలిసికొందాము.

## శ్వేతాశ్వతరోపనిషత్తు

ఈ ఉపనిషత్తు కృష్ణయజుర్వేదంలోని దంటారు. ఉపనిషత్తులలో అశ్వతరుడనే పేరుగల ఒక ఋషి కనబడతాడు. అట్లే శ్వేతాశ్వతరు డనే మరొక ఋషి ఈ ఉపనిషత్ కర్త కావచ్చు. లేదా ఈ పదములో ఏదైనా యౌగికార్థం ఉండవచ్చు. ఇది చాలా ప్రాచీనమైనది.

**'కిం కారణం బ్రహ్మ? కుత స్మ జాతా ?**

**జీవామ కేన? క్వ చ సంప్రతిష్ఠాః ?"** అంటూ ప్రారంభమైన ఈ ఉపనిషత్తు అన్ని ప్రశ్నలకూ సమాధానం చెబుతుంది. కాల స్వభావాదులుకానీ, పంచభూతాలుకానీ, సుఖదుఃఖాల ననుభవించే అల్పజ్ఞుడు అల్పశక్తిమంతుడునైన జీవుడు కానీ ఈ సృష్టికి కారణం కాదంటుంది ఈ ఉపనిషత్తు. సర్వవ్యాపకమై అనంత శక్తి సామర్థ్యాలుగల పరమేశ్వరుడే కర్త అంటుంది. సృష్టిలో మూడు అనాది పదార్థాలున్నాయని స్పష్టంగా చెబుతుంది.

జ్ఞా జ్ఞౌ ద్వా వజా వీశానీశా
వజా హ్యేకా భోక్తృభోగార్థయుక్తా।
అనంత శ్చాత్మా విశ్వరూపోహ్యకర్తా
త్రయం యదా విందతే బ్రహ్మ మేతత్॥ (1-9)

(జ్ఞా + అజ్ఞౌ) తెలిసినవాడు, తెలియనివాడు (ఈశానీశౌ) ఈశుడు, అనీశుడు నను నిరువురు (అజౌ) జన్మరహితులైన అనాది పురుషులున్నారు. భోక్తతోను, భోగ్యపదార్థాలతోను కూడిన ఒక ప్రకృతికూడా ఉంది. అది కూడా (అజా) జన్మలేనిదే - అనాదియే. వీరిలో ఈశుడు (అనంత) అంతము లేనివాడు. (విశ్వరూపః) విశ్వమంతా వ్యాపించువాడు. (అకర్తా) జీవులవలె ఫలాపేక్షతో శుభాశుభకర్మల నాచరింపడు. ఈ విధంగా ఈ మూడు పదార్థాలను యథార్థముగా తెలిసికొన్న జీవుడు ముక్తిని పొందుతాడంటుంది ఈ ఉపనిషత్తు. ఈ మూడు పదార్థాలు సృష్టిలో ఏ విధంగా సమ్మిళితమై యున్నాయో అనేక ఉపమానాలతో వివరిస్తుంది మొదటి అధ్యాయం.

రెండవ అధ్యాయం వేదమంత్రాలతో ప్రారంభమౌతుంది. యజుర్వేద 11వ అధ్యాయంలోని మొదటి ఐదు మంత్రాలు వరుసగా ఈ అధ్యాయ ప్రారంభంలో వస్తాయి. అనాది పదార్థాలైన జీవేశ్వర ప్రకృతుల సాక్షాత్కారం యోగాభ్యాసం వల్లనే సాధ్యమౌతుంది. అట్టి యోగ సాధనను ఈ మంత్రాలు ప్రోత్సహిస్తాయి. సాధకునకు ఈశ్వరసహకారం ఉంటుందని హామీ యిస్తాయి. ఈ విధంగా ప్రారంభింపబడి ఈ అధ్యాయ మంతా సాధన గురించే వివరిస్తుంది.

మూడు, నాలుగు అధ్యాయాలలోనూ కొన్ని వేదమంత్రాలున్నాయి. ముఖ్యంగా ఈ రెండు అధ్యాయాలు పరమేశ్వర స్వరూపాన్ని వర్ణిస్తాయి. విద్యావిద్యల స్వరూపాన్ని వివరిస్తూ ఐదవ అధ్యాయం ప్రారంభమౌతుంది. పరమేశ్వరుడు ఈ సృష్టిని చేయుటకు గల కారణాలను తెలుపుతూ జీవుని స్వరూపాన్ని ఈ విధంగా వర్ణిస్తుంది.

బాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ
భాగోజీవః స విజ్ఞేయః స చానంత్యాయ కల్పతే ॥ (5-9)

ఒక వెంట్రుక కొనను నూరు భాగాలుగా చేసి, వాటిలోని ఒక భాగాన్ని తీసుకొని మరల నూరుభాగాలు చేస్తే ఎంత పరిమాణముంటుందో అంత

పరిమాణం గలవాడు జీవుడని తెలుసుకోండి. (అంటే జీవుని పరిమాణం వెంట్రుక కొనయొక్క 10,000 భాగం 1/10,000 భాగం అని గ్రహించాలి. అతి సూక్ష్ముడని చెప్పటానికే ఈ వర్ణన.) అంతటి అల్ప పరిమాణం కల వాడేయైనా అనంతుడైన పరమేశ్వరుని ఆనందాన్ని పొంద సమర్థుడౌతాడు.

**నైవ స్త్రీ న పుమా నేష న చైవాయం నపుంసకః ।**
**యద్ య చ్ఛరీర మాదత్తే తేన తేన స యుజ్యతే॥ (5-10)**

ఈ జీవుడు స్త్రీకాదు. పురుషుడూకాదు. అట్లని నపుంసకుడును కాదు. ఏయే శరీరాలను గ్రహిస్తాడో ఆయా శరీరాలతో సంయుక్తుడై ఆయా విధాలుగా వ్యవహరిస్తాడు.

ఇక చివరిదైన ఆరవ అధ్యాయం సృష్టి వైచిత్ర్యాన్ని, సృష్టి కారాణాలని వర్ణిస్తుంది. చిత్ర విచిత్రమైన ఈ సృష్టిని, అంతకన్నను విచిత్రమైన కర్మఫల వ్యవస్థను సంపూర్ణంగా తెలుసుకోవటం అసాధ్యం. కానీ, ఎవరు పవిత్ర హృదయులై యోగాభ్యాసం ద్వారా అంతర్యామియైన పరమాత్మ సాక్షాత్కారం పొందుతారో వారు కర్మబంధనాలనుండి, ప్రకృతి బంధనాలనుండి విముక్తిని పొంది పరమానందరూప ముక్తిని పొందుతారు.

**'నాన్యః పంథా విద్యతే ఽ యనాయ'**
**ఇంతకన్న వేరొకమార్గం లేదు.**

ఈ అధ్యాయపు చివరి 21వ శ్లోకాన్నిబట్టి ఈ ఉపనిషత్తు (బ్రహ్మవిద్య) శ్వేతాశ్వతరుడనే ఋషిప్రోక్తమని తెలుస్తున్నది. ఆ మహర్షి చెప్పగా ఎవరో శిష్యులు దీనిని గ్రంథస్థం చేసి ఉంటారు. ఇట్టి గొప్పదైన ఈ బ్రహ్మవిద్యను శాంతచిత్తుడు కానివానికి, శిష్యుడు కానివానికి, పుత్రుడు కానివానికి ప్రసాదించరాదంటాడు దీని కర్త. అంటే యోగ్యులైన జిజ్ఞాసువులకు మాత్రమే ఉపదేశించాలనీ, లేకుంటే ఊషరక్షేత్రంలో విత్తిన విత్తనంవలె నిష్ఫలమౌతుందనీ ఆ మహర్షి భావం.

## వైదిక త్రైతవాదం

ఆధ్యాత్మిక క్షేత్రంలో సృష్టిని గురించి, సృష్టిలోని పదార్థాల గురించి భిన్న భిన్న అభిప్రాయాలున్నాయి. వీటిలో ముఖ్యమైనవి మూడు. 1. అద్వైతము, 2. విశిష్టాద్వైతము, 3. ద్వైతము.

అద్వైతం సృష్టిలో కేవలం బ్రహ్మపదార్థం తప్ప మరేమీ లేదంటుంది. కొద్ది జ్ఞానం కలిగిన జీవతత్వం కూడా బ్రహ్మకన్న భిన్నం కాదంటుంది. ఇంద్రియ గోచరమయ్యే ఈ పదార్థాలన్నీ మిథ్య అంటుంది. మిథ్య అంటే 'లేనిది ఉన్నట్లు కనబడటం' అంటుంది. దీనికి ఉదాహరణలుగా "చీకటిలో త్రాడును త్రొక్కి పాము అనే భ్రాంతితో భయగ్రస్తుడు కావటం, స్వప్నంలో విపరీత వస్తువులను, సంఘటనలను చూసి సత్యమనే భ్రాంతితో కలత చెందటం" అని చెబుతుంది. 'బ్రహ్మసత్యం, జగన్మిథ్య, జీవోఽబ్రహ్మైవ న పరః' బ్రహ్మ సత్యము, జగత్ మిథ్య, జీవుడు బ్రహ్మనే. అన్యుడుకాదు - అనేది వారి సిద్ధాంతం.

విశిష్టాద్వైతం బ్రహ్మ ప్రకృతులు రెండును సమరూపులు, వాస్తవిక సత్తా కలవి అంటుంది. మూలతః ఈ రెండూ ఒకటేనంటుంది ఈ సాంప్రదాయం.

ద్వైతం జీవుడు-ప్రకృతి, బ్రహ్మ-విశ్వము, ఆత్మ - పరమాత్మ యివన్నీ భిన్నమైనవే అంటుంది. అయినప్పటికీ వీరు రకరకాల పురాణాలు వ్రాసి ప్రజలను తమవైపు ఆకర్షించుకొన్నారు. విశిష్టాద్వైతులు ఒక పర్యాయమే చక్రాంకితులైతే ద్వైతులు పలుమార్లు చక్రాంకితులై వైకుంఠంలో తమ స్థానాన్ని గట్టిపరచుకుంటారు. లింగాంకితులు కైలాసంలో స్థానం కొరకు ప్రయాస పడతారు.

ఇవేగాక స్వామినారాయణమతం, రాధాస్వామిమతం, బ్రహ్మకుమారిమతం మొదలైన వెన్నోపుట్టాయి. మరెన్నో పుడుతున్నాయి. సృష్టిని గురించి వీరి అభిప్రాయాలు చిత్ర విచిత్రంగా ఉంటాయి. బౌద్ధ జైన మతాలు మనదేశంలో పుట్టినప్పటికీ యివి దేవుని అంగీకరించవు. జీవులను ప్రకృతిని ఉనికి గలవిగా అంగీకరిస్తాయి. నైతికతను బోధిస్తాయి.

క్రైస్తవులు ఆదిలో యహోవా దేవుడు తప్ప మరేమీ లేదంటారు. అతడే సంకల్పమాత్రంచేత అభావం నుండి ఈ సృష్టి నుత్పన్నం చేసాడంటారు. మానవునిలో తప్ప మరే ప్రాణిలోను జీవుడు లేడంటారు. దేవుడు మానవప్రాణిని సృజించి అతని నాసికాపుటాలలో గాలి ఊదుతాడట. దానితో క్రొత్తగా జీవుడు పుడతాడట. అభావంనుండి పుట్టిన ఆ జీవునకు అంతం లేదట. మనషి చనిపోయిన తరువాత కూడా జీవుడు ఆ శరీరాన్నే అంటిపెట్టుకుని దేవుని

రాకకై ఎదురు చూస్తాడట. కాలాంతరంలో నాల్గవ ఆకాశంనుండి దేవుడు దిగివచ్చి సమాధులలో ఉన్న జీవుల నందరిని వెలికితీసి న్యాయ నిర్ణయం చేస్తాడట. ఆ దినాన్ని వారు **జడ్జిమెంట్ డే** అంటారు. అప్పుడు - ఎవరు క్రీస్తును అంగీకరించారో వారికి స్వర్గము, అంగీకరించని వారికి నరకము యిస్తాడంటారు. అందుచేతనే వారు శవాలను దహనం చేయకుండా పూడ్చిపెడతారు.

మహ్మదీయ మతమును యిట్టిదే. యహోవా బదులు అల్లాను దేవునిగాను, క్రీస్తు బదులు మహ్మద్‌ను దేవుని కుమారునిగాను (ప్రవక్తగాను) చెబుతారు. వీరి అల్లా ఏడవ ఆకాశంలో ఉంటాడట. వీరి మహ్మద్‌ప్రవక్తయే చివరి ప్రవక్తయట. ఖురాన్‌యే అంతిమ శాసనమట.

పై సిద్ధాంతాలేవీ సృష్టిక్రమానికి, హేతువాదానికి నిలబడవు. వీటిని మన వేద శాస్త్రా లసలే అంగీకరించవు. నియమబద్ధంగా నడిచే ఈ స్థూల జగత్తు మిథ్య ఎట్లౌతుంది? మిథ్యాజ్ఞానం ఎవరికి కలిగింది? జీవుడు బ్రహ్మనే అంటున్నారు కనుక మిథ్యాజ్ఞానం బ్రహ్మకే కలిగినట్లౌతుంది.

మిథ్యాజ్ఞానం కలవాడు దేవు డెట్లవుతాడు ? లేని దాని నుండి ఉనికిగల పదార్థం ఏట్లేర్పడుతుంది? మనవేదం చెప్పే త్రైత సిద్ధాంతం హేతువాదానికీ, విజ్ఞానానికీ నిలబడి ఉంటుంది. ఇంతేగాక, వాటికి కూడా మార్గదర్శకంగా ఉంటుంది. యుగయుగాలు గడచినా ఇది యిట్లే ఉంటుంది.

త్రైతవాదం అంటే – సృష్టికి మూలపదార్థాలు మూడు అని చెప్పే సిద్ధాంతం. సృష్టిలోని ఏ కార్యపదార్థాన్ని చూచినా 3 కారణాలు కనబడతాయి. కుండ నిర్మాణానికి మట్టి, కుమ్మరి, కుండను నిర్మించే సాధనాలు తప్పక ఉంటాయి. ఈ మూటిలో ఏ ఒక్కటి లేకపోయినా కుండ నిర్మింపబడదు. వస్త్ర నిర్మాణానికి దూది లేదా దారాలు, నేతగాడు, నేతకు అవసరమయ్యే సాధనాలు తప్పక ఉండాలి. ఇట్లే సృష్టి నిర్మాణానికి పరమాణువులు, వాటిని వివిధ నిష్పత్తులలో కలిపి మూలకాలుగా, వివిధ పదార్థాలుగా నిర్మించగల ఒక మహత్తర చేతన పదార్థం (దేవుడు) తప్పక ఉంటారు. పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు కనుక అతనికి ఏ సాధనాలు అవసరముండదు. అయితే నిత్యతృప్తుడు, ఆనందమయుడు అయిన పరమేశ్వరుడు ఈ సృష్టిని ఎవరి కొరకు చేస్తున్నాడు

? అనే ప్రశ్న వస్తుంది. ఇంతేగాక, సృష్టిని పరిశీలించి చూస్తే భిన్న భిన్న అభిరుచులుగల చేతన పదార్థాలు (జ్ఞానంగల పదార్థాలు) అనేకం కనబడతాయి. అవే జీవులు. వాటి కొరకే పరమేశ్వరు డీ సృష్టిని చేస్తున్నాడు.

**'యాథా తథ్యతో౽ర్థాన్ వ్యదదాత్ శాశ్వతీభ్యః సమాభ్య ః'**

**(యజు. 40-8)**

అని వేదం చెబుతుంది. శాశ్వతులు (నిత్యలు), అల్పచేతనులు నైన జీవుల కొరకు ఈ సృష్టిని గావిస్తున్నట్లు పరమేశ్వరుడే స్వయంగా చెబుతున్నాడు. పరిశీలించి చూస్తే ఈ సృష్టి జీవులకొరకే.

ఈ విధంగా సృష్టిలో పరమాణువులు (ప్రకృతి), పరమేశ్వరుడు, జీవులు ఉన్నాయి. ఇవి మూడూ అనాది పదార్థాలు. వీటికి ఆది లేదు. అంటే ఇవి దేనినుండీ పుట్టలేదు. కనుక వీటికి అంతం కూడా ఉండదు (చనిపోవు). అయితే వీటిలో తర తమ భేదాలున్నాయి. ప్రకృతికంటె జీవుడు, జీవునికంటె పరమేశ్వరుడు సూక్ష్మమైనవి. వీటిని గురించి వేదం ఈ విధంగా వివరిస్తుంది.

**బాలా దేక మణీయస్కం ఉతైకం నేవ దృశ్యతే ।**

**తతః పరిష్వ జీయసీ దేవతా సా మమ ప్రియా ॥** (అథర్వవేదము. 10-8-25)

**బాలాత్ ఏకం అణీయస్కం** = వెంట్రుకకన్నను సూక్ష్మమైన దొకటి ఉంది. (అది ప్రకృతి – పరమాణువులు) **ఉత ఏకం న ఇవ దృశ్యతే** = అంతకన్నను సూక్ష్మమైనతత్వం మరొకటుంది. అది లేనట్లే కనబడుతుంది. (అది జీవ తత్వం). **తతః పరిష్వజీయసీ దేవతా** = దానికన్నను దానిలో కూడా వ్యాపించి ాగియున్న దేవత మరొకటుంది. (అది పరమేశ్వర తత్వం) సా మమ ప్రియా = ఆ సర్వవ్యాపక దేవతయే నాకు ప్రియమైనది.

వీటిలో ఒకటి జడతత్వం, రెండు చేతన తత్వాలు. జడం అంటే జ్ఞానం ేనిది. చేతన మంటే జ్ఞానం కలది. ప్రకృతిలో (పరమాణువులలో) జ్ఞానం ేదు. కనుక అది జడతత్వం. జీవునిలోను దేవునిలోను జ్ఞానం ఉంది. కనుక ివి రెండూ చేతన తత్వాలు. జీవుని జ్ఞానం, పరిమాణం, శక్తి అల్పమైనవి. వుని జ్ఞానం, పరిమాణం, శక్తి అనంతమైనవి. దేవుడు అనంత జ్ఞానం, నంత పరిమాణం, అనంత శక్తి సామర్థ్యాలు కలిగి జీవులలోను, రమాణువులలోను కూడా వ్యాపించగల సూక్ష్మతత్వం. దేవుడు జీవుల కొరకు

సృష్టిని చేస్తాడు. అంటే పరమాణువులతో మూలకాలను, పంచభూతాలను, వాటితో వివిధ పదార్థాలను చేస్తాడు. జీవులు చేసే కర్మలను పరిశీలిస్తూ ఆ కర్మలకు న్యాయంగా ఫలితాల నిస్తూ ఉంటాడు.

ఈ సృష్టిని ఒక వృక్షంతో పోలిస్తే ఈ సృష్టిరూప వృక్షంపై జీవ దేవ తత్త్వాలు పక్షులుగా ఉంటాయి. ఆ స్థితిని వేదం ఈ విధంగా ఆలంకారికంగా వర్ణిస్తుంది -

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।**
**తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి ॥**
**(ఋగ్వేదం. 1-164-20, అథర్వ. 9-9-20)**

(ద్వా సుపర్ణా సయుజా సఖాయా) సయుజులు, సఖులునైన- రెండు పక్షులు (సమానం వృక్షం పరిషస్వజాతే) ఒకే వృక్షమునాశ్రయించి ఉన్నాయి. (తయో : అన్యః పిప్పలం స్వాదు అత్తి) వాటిలో ఒకటి పక్వమైన పండ్లను తింటున్నది. (అనశ్నన్ అన్యః అభిచాకశీతి) మరొకటి ఏ పండును తినక సాక్షిగా నలువైపులా చూస్తున్నది.

దీనిలో వృక్షాన్ని ప్రకృతిగాను, పండ్లను తినే పక్షిని జీవునిగాను, తినకుండా అంతటిని పరిశీలించు పక్షిని దేవునిగాను గ్రహించాలి.

ప్రకృతిని వృక్షం అనటానికి ఒక కారణముంది. వృక్షానికి 'వృశ్చ్యతే ఇతి వృక్షః' అని నిర్వచనము. వ్రయ్యలుగా-ముక్కలు ముక్కలుగా విభజింపవచ్చును కనుక దానిని వృక్షమన్నారు. ఈ ప్రపంచం పరమాణువుల సంయోగంతో ఏర్పడింది. కాలాంతరంలో మరల పరమాణువులుగా విడదీయబడుతుంది. కనుక ప్రకృతి వృక్షంతో పోల్చబడింది. జీవులు, దేవుడు చేతనులుకనుక పక్షులుగా (ప్రాణులుగా) చెప్పబడ్డారు. జీవుడు జ్ఞాన కర్మ లను రెండు సుపర్ణములను (రెక్కలను) కలిగి ఉంటాడు. దేవుడు సృష్టి లయము లను రెండు మహాత్కార్యాములు చేయగల రెక్కలను కలిగి ఉంటాడు. ఈ విధంగా త్రైతవాదాన్ని ప్రతిపాదించే వేదమంత్రాలు అనేకం ఉన్నాయి.

వైదిక కర్మకాండలో ప్రధానమైనవి పంచ మహాయజ్ఞలు, షోడశ సంస్కారాలు. వీటిని గురించి సంక్షిప్తంగా తెలిసికొందాము.

# పంచ మహాయజ్ఞ విధి

ప్రతి వ్యక్తి ప్రతి దినం అవశ్యంగా ఆచరించవలసినవి పంచ మహాయజ్ఞాలు. వీటికి నిత్యకర్మలని మరొకపేరు. తనకు, ఇతరులకు ఉన్నతిని కలిగించే ప్రతి కార్యాన్ని యజ్ఞ మనవచ్చు. అట్టి యజ్ఞాలలో పంచ మహాయజ్ఞాలని చెప్పబడే ఈ క్రింది ఐదు కార్యాలు ప్రధానమైనవి.

## బ్రహ్మయజ్ఞం

బ్రహ్మప్రాప్తి కొరకు చేయబడే యజ్ఞాన్ని బ్రహ్మయజ్ఞం అంటారు. ఇచట బ్రహ్మ అంటే సర్వవ్యాపక సర్వేశ్వరుడే. దీనినే లోకంలో 'సంధ్యావందనం' అనే పేరుతో వ్యవహరిస్తారు. ఉదయ సాయం సంధ్యాసమయాలలో నిది చేయబడుతుంది. కనుక దీని కా పేరు వచ్చింది.

పరమేశ్వరుడు మనకు ఉత్తమ మానవజన్మనిచ్చి వికసించిన 5 జ్ఞానేంద్రియాలను, 5 కర్మేంద్రియాలను, బుద్ధిని యిచ్చాడు. ఇంతేగాక, ఆ యింద్రియాలతో అనుభవించటానికి ఎన్నెన్నో విషయాలను ఈ సృష్టిలో ఏర్పరచాడు. అట్టి పరమేశ్వరునికి కృతజ్ఞతలు తెలపటం ప్రతీ వ్యక్తికి కనీస ధర్మం. అందుకొరకే ఈ సంధ్యావందనం ఏర్పాటు చేయబడింది. వివిధ సాంప్రదాయాలవారు వివిధ సంధ్యావందన పద్ధతు లేర్పరచుకొన్నారు. వీటన్నిటికన్న మహర్షి దయానంద సరస్వతి గారిచే సంకలనం చేయబడిన 'వైదిక సంధ్యావిధి' విశిష్టంగా ఉంటుంది. కేవలం వేదమంత్రాలతోనే కూర్చిన ఆ విధిలో తనకొరకు, పరులకొరకు, పరమాత్మకొరకు చేయవలసిన కర్తవ్యాలు తెలుపబడ్డాయి.

ప్రారంభ క్రియలు **'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్'** అనే సూక్తిని జ్ఞాపకం చేస్తాయి. ఏ ధర్మసాధన చేయటానికైనా మనకు మన శరీరమే ఆధారం. కనుక శరీరాన్ని, యింద్రియాలను బలంగాఉంచుకోవాలి. వాటితో పవిత్ర కార్యాలనే చేయాలి. ఆ విషయాన్నే ఇంద్రియస్పర్శ మార్జన మంత్రాలు, వాటి క్రియలు గుర్తుచేస్తాయి. ప్రాణాయామం శరీరంలోని, ఇంద్రియాలలోని దోషాలను దహించివేసి ఆరోగ్యాన్ని, బలాన్ని, స్ఫూర్తిని యిస్తుంది. ఆయుర్దాయాన్ని పెంచి మానసిక ఏకాగ్రతను కలిగిస్తుంది. ఆ క్రియ చేస్తూ మనసులో స్మరించే

మంత్రాలు పరమేశ్వరుని స్వరూపాన్ని విశదపరుస్తాయి. అర్థభావనతో అఘమర్షణ మంత్రాలు పఠిస్తే పాపభావాలు పారిపోతాయి. తద్వారా మనకు అన్నీ శుభాలే ప్రాప్తిస్తాయి.

ద్వితీయ ప్రకరణం మనసాపరిక్రమ ప్రకరణం. ఈ ప్రకరణంలో తాను స్థిరంగానే కూర్చుని మనస్సును క్రమముగా తనకు నాలుగు దిక్కులా పైనా క్రింది ప్రసరింపచేసి ఆ యా దిక్కులలో పరమేశ్వరుడు తనను ఏఏ విధాలుగా రక్షిస్తున్నాడో గుర్తుచేసుకోవటం జరుగుతుంది. అట్టి రక్షకుడైన పరమేశ్వరునకు, ఆయన ఏర్పాటుచేసిన రక్షణ శక్తులకు నమస్సు లర్పిస్తూ కృతజ్ఞతలు తెలుపుకోవటం జరుగుతుంది. వీటితోబాటు సామాజిక జీవనంలో పరస్పరం ఏర్పడే ద్వేషభావాలను దూరం చేసుకోవటానికి సంకల్పం చేయబడుతుంది.

తృతీయ ప్రకరణం ఆత్మోన్నతి ప్రకరణం. ఉపస్థానమంత్రాలను అర్థభావనతో మనస్సులో పఠిస్తే మనస్సు అంతర్ముఖమౌతుంది. ఏకాగ్రమౌతుంది. అప్పుడు అర్థభావనతో గాయత్రీ జపంచేస్తే బుద్ధిలో వికాసం కలుగుతుంది. సూక్ష్మవిషయగ్రహణ సామర్థ్యం లభిస్తుంది. యోగసాధనకు, ఆత్మపరమాత్మల సాక్షాత్కారానికి మార్గం సుగమమౌతుంది. మాచే ప్రచురింపబడిన **'సంధ్యావందనం - వైజ్ఞానిక సమాలోచన'** చదివితే మీకు మరెన్నో విషయాలు తెలుస్తాయి.

బ్రహ్మయజ్ఞంవల్ల మనలోని చెడుగులు దూరమై విద్య, శిక్ష, ధర్మము, సభ్యత మొదలైన శుభగుణాలు వర్ధిల్లుతాయి. మనస్సు నిర్మలమై ప్రసన్నత కలుగుతుంది. మనో ఏకాగ్రత, ధారణశక్తి వృద్ధిచెందుతాయి. ధర్మకార్యాల నాచరించేటప్పుడు నిర్భయత, ఉత్సాహం, ప్రోత్సాహం లభిస్తాయి. ఆత్మపరమాత్మల సాక్షాత్కారానికి మార్గం సుగమమౌతుంది.

## 2. దేవయజ్ఞం (అగ్నిహోత్రం)

దేవయజ్ఞం అంటే దేవతలకొరకు చేసే శుభకార్యం. దివ్యగుణాలు కలిగిన మానవులను దేవత లంటారు. అట్లే భౌతిక పదార్థాలలో దివ్యగుణాలుంటే వాటిని కూడా దేవత లనవచ్చు. దానశీలత, పరోపకార ప్రవృత్తి, నిష్కపటత కలిగిన మానవులను చేతనదేవతలనీ, ఏ పదార్థాలవల్ల ప్రాణులకు ప్రయోజనం కలుగుతున్నదో వాటిని జడదేవతలనీ అంటారు. అగ్నిహోత్రంవల్ల ముఖ్యంగా

జడదేవతల పూజ జరుగుతుంది. ఇక్కడ పూజ అంటే సత్కారం. వాటిని చక్కగా సంస్కరించి తద్వారా ప్రాణులకు మేలుచేయటం. ఈ సృష్టిలోని పదార్థాలన్నీ పంచభూతాలతో నిర్మింపబడ్డాయి. ప్రాణులన్నీ వాటి ఆధారంతోనే జీవిస్తున్నాయి. అయితే జీవన క్రమంలో అవి మలినమైపోతూ ఉంటాయి. మనం మంచి ఆహారం తీసుకొని మలంగాను, మంచి నీరుత్రాగి మూత్రంగాను విడిచిపెడుతూ వుంటాము. తద్వారా భూమి జలము గాలి కలుషిత మౌతుంటాయి. వాటిని మరల శుద్ధం చేయటానికి అగ్నిహోత్రం అద్భుతమైన పరికరం.

అగ్నిలో ఒక పద్ధతి ప్రకారం ఆవునెయ్యి, మూలికలు, బెల్లం, తేనె, మిఠాయిలు, ధాన్యాలు, ఎండిన బాదం అక్రోట్ ఖర్జూరం మొదలైన కాయలు, కస్తూరి కుంకుమ పువ్వు మొదలైన సుగంధ ద్రవ్యాలు ఆహుతులిస్తే ఔషధీయుక్తము పుష్టికరమునైన వాయువులు వెలువడతాయి. అవి గాలిలో కలిసి అంతటా విస్తరింపబడి వాయువును శుద్ధిచేస్తాయి. ప్రాణుల శరీరాలలోచేరి వాటిని కూడా శుద్ధి చేస్తాయి. క్రమంగా పైకి వెళ్ళి మేఘాలలో చేరతాయి. ఆ మేఘాలు వర్షించినపుడు ఆ వాయువులు భూమిలోను, నీటిలోను చేరి వాటిని శుద్ధిచేస్తాయి. ఈ విధంగా అగ్నిలో వేసిన పదార్థం పంచభూతాలకు పంచబడుతుంది. కావుననే **'అయం యజ్ఞో విశ్వస్య భువనస్య నాభిః'** ఈ యజ్ఞం (అగ్నిహోత్రం) సమస్త భువనాలకు నాభి) అంటుంది యజుర్వేదం.

దైనిక అగ్నిహోత్రం సూర్యోదయ సూర్యాస్తమయ సమయాలలో చేస్తే మరింత గుణకారిగా ఉంటుంది. సంధ్యాసమయ సూర్యకిరణాలు యజ్ఞవాయువులను బలపరుస్తాయి. విశేషంగా అగ్నిహోత్రం కామధేనువు. కోరిక లను పాలనిచ్చే గోవువంటింది. పుత్రకామేష్టి, వర్షేష్టి, ఆరోగ్యేష్టి, ఆయుష్కామేష్టి మొదలైన యజ్ఞాల ప్రసక్తి మన శాస్త్రాలలో కనబడుతుంది. అందుకు తగిన హోమద్రవ్యాలతో ఆయా విధుల ననుసరిస్తూ పెద్దపెద్ద యజ్ఞాలు చేస్తే అవన్నీ సాధ్యమే.

దైనిక అగ్నిహోత్రంవల్ల వాయు జలములు శుద్ధమై ఆరోగ్యలాభం కలుగుతుంది. ఋతువులు మనకు అనుకూలమౌతాయి.

## పితృయజ్ఞం

మనకు జన్మనిచ్చి, పెంచి పెద్దచేసి, ఎన్నో రకాలుగా సేవలు చేసిన

తల్లిదండ్రులకు అవసరమైన సేవలు చేయటం మన కనీస ధర్మం. దానినే పితృయజ్ఞ మంటారు. ఇచట పితరులంటే జీవించియున్న తల్లిదండ్రులే. మరణించిన వారికి మన మెట్లు సేవచేయగలము? కేవలం జీవించియున్న తల్లిదండ్రులకేగాక పితామహులు, ప్రపితామహులు, బంధువులు, గురువులు మనను ఆశ్రయించుకుని ఉంటే వారికి కూడా సేవచేయమంటుంది వేదం.

**పితృభ్యః స్వధాయిభ్యః స్వధా నమః**
**పితామహేభ్యః స్వధాయిభ్యః స్వధా నమః**
**ప్రపితామహేభ్యః స్వధాయిభ్యః స్వధా నమః ।**
**అక్షన్ పితరో౨మీమదన్త పితరో౨ తీతృపన్త పితరః**
**పితరః సున్ధధ్వమ్ ॥ (యజుర్వేదం. 19-36)**

ఇచట స్వధా అంటే వారికి అవసరమైన విధముగా అన్న పానీయాదుల నిచ్చి తృప్తిపరచటం. దీనినే తర్పణ మంటారు. శ్రద్ధతో చేసే సేవను శ్రాద్ధ మంటారు. నేడు లోకంలో మరణించిన పితరులపేరిట జరిపే శ్రాద్ధతర్పణ క్రియలను వేదం అంగీకరించదు. ఆ కర్మలు వైదికం కాదు. జీవించియున్న పితరులకు, పితామహులకు, ప్రపితామహులకు, తనను ఆశ్రయించుకొని ఉన్న అత్తమామలకు, వారి తల్లిదండ్రులకు వృద్ధులైన బంధువులకు, పెద్దలకు, గురువులకు తగిన సేవలు చేయటమే పితృయజ్ఞ మని మరువరాదు.

పెద్దల నుండి విద్యావిజ్ఞానాలు, అనేక విధములైన సేవలు పొందిన మనం వారికి ఋణపడిఉంటాం. ఈ పితృయజ్ఞంవల్ల వారి ఋణం కొంత తీరుతుంది. కృతజ్ఞతలు తెలుపుకున్నవారమౌతాము. వారి ఆశీస్సులు మనకు లభిస్తాయి.

## బలివైశ్వదేవయజ్ఞం

'బలి' అనే పదమునకు సమర్పించుట అని అర్థం. అన్నాది శాకాహార పదార్థాలను సమర్పించటమే బలికాని దేవీ దేవతల పేరిట జంతువులను చంపటం కాదు. జంతుబలిని మన వేదశాస్త్రా లంగీకరించవు. వంటశాలలో సిద్ధమైన భోజన పదార్థాలను వైశ్వదేవ మంటారు. ఎందుచేతనంటే ఆ పదార్థాల వెనుక ఎందరి శ్రమనో దాగి ఉంటుంది. కనుక, మానవుడు అభిమాన రహితుడై విశ్వేదేవతల (సమస్త దైవీశక్తుల) సహకారంతో తన కా పదార్థాలు లభించాయని గుర్తించాలి. అందుకే వండిన అగ్నిలోకాని, బయట అగ్నిలోకాని

ఉప్పు కారాలు, పులుపు లేని అన్నాదుల నాహుతులుగా నివ్వాలని మన శాస్త్రాలు చెబుతాయి. తద్వారా పాకశాలా భోజనశాలలలోని వాతావరణం శుద్ధమౌతుంది. విశ్వేదేవతలను గుర్తించి, ఆహుతు లిచ్చినందువల్ల మనస్సు ప్రసన్నమౌతుంది.

పై క్రియతోబాటు తనను ఆశ్రయించుకొనియున్న గోవు, గుఱ్ఱము, కుక్క, మొదలగు మూగప్రాణులకు వాటికి కావలసిన ఆహారాదుల నివ్వమంటాయి మన శాస్త్రాలు. ఇంతేగాక, నీ చుట్టూ ఉన్న సమాజంలోని పేదలను, వికలాంగులను, రోగులను, ఆర్తులను గుర్తించి ఆదుకోవాలంటాయి.

**శునాం చ పతితానాం చ శ్వపచాం పాపరోగిణామ్ ।**
**వాయసానాం క్రిమీణాం చ శనకై ర్నిర్వపేద్భువి ॥**

**(మనుస్మృతి. 3-92)**

కుక్కలకు, పతితులకు, కుక్కమాంసము తిను చండాలురుకు, పాపరోగులకు , కాకులకు, క్రిములకు అన్నభాగములను ఒక విస్తరిలో తీసి పెట్టాలి. వాటిని ఆకలిగొన్న ఏ ప్రాణికైనను పెట్టవచ్చు.

ఈ అన్నభాగాలు తీసిపెట్టేటప్పుడు 'శ్వభ్యో నమః, పతితేభ్యో నమ, శ్వపక్భ్యో నమః, పాపరోగిభ్యో నమః, వాయసేభ్యో నమః, క్రిమిభ్యో నమః' అనే వాక్యాలు ఉచ్చరిస్తూ చేయాలని విధిలో వ్రాసి ఉంటుంది. ఇచట 'నమః ' అనే పదమునకు అన్న మని అర్థం. వాటికి నేను అన్న భాగాలను పెట్టుచున్నానని భావం. ఈ యజ్ఞానికి భూతయజ్ఞ మని మరొక పేరు.

## అతిథియజ్ఞం

ఎవరి రాకకు తిథి నిశ్చిత ముండదో వారిని అతిథు లంటారు. పూర్వం వేద శాస్త్రాలను, ధర్మసూత్రాలను పూర్ణంగా చదువుకొన్న వారు లోకోపకారార్థం వాటిని ప్రచారం చేయటానికి సంన్యాసాశ్రమం స్వీకరించేవారు. సర్వసంగపరిత్యాగులై ధర్మోపదేశంచేస్తూ లోకసంచారం చేసేవారు. వారి రాకపోకలను ఎవరికీ తెలిపేవారు కాదు. తమకు ఆకలయినపుడు ఏ గృహస్థుని అరుగుపైననో కూర్చునేవారు. గృహస్థులు ముందుగా తెలిపిన బ్రహ్మ దేవ పితృ బలివైశ్వదేవ యజ్ఞాలను పూర్తిచేసి వారు భుజించేముందు తమ యింటికి ఎవరైనా అతిథులు (సంన్యాసులు, మహాత్ములు) వచ్చినారేమో నని తలుపు తెరచి చూచేవారు. ఎవరైనా అట్టివారు వస్తే అతిథియజ్ఞం చేసేవారు.

గృహస్థుడు అతిథులను సాదరంగా ఆహ్వానించి పాద్య అర్ఘ్య

ఆచమనములకొరకు వేరువేరుగా జలాలనిచ్చి సత్కారపూర్వకంగా ఉన్నతాసనాంపై కూర్చుండబెట్టాలి. ఉత్తమమైన అన్నపానీయాదులనిచ్చి తృప్తిపరచాలి. తగిన సేవలు చేసి ప్రసన్నులుగా చేసుకోవాలి. అనంతరం కుటుంబమువారంతా వారితో సత్సంగం జరపాలి. తమకు కలిగే ధర్మ సందేహాలను ప్రశ్నించి తగిన సమాధానాలు పొందాలి. వారి ఉపదేశాను సారంగా తమను తాము సవరించుకోవాలి.

అతిథులు కేవలం సంన్యాసులే కానక్కర లేదు. సమయాన్ని బట్టి ఎవరైనా ఉత్తమ వానప్రస్థి లేదా గృహస్థు లేదా రాజు అయినా కావచ్చు. ధర్మం చక్కగా తెలిసినవారు, నిష్కపటులు, పక్షపాతరహితంగా ధర్మోపదేశం చేయగలవారెవరైనా అతిథులు కావచ్చు. కాని, పాషాండులు, వేదనిందకులు, స్వార్థపరులు, కుక్షింబరులు, శఠులు, హఠులు అయిన కపట సాధువుల నెంతమాత్రం సత్కరించకూడదు.

యోగ్యులైన అతిథులను సత్కరించటంవల్ల చాలా లాభం కలుగుతుంది. వైదిక ధర్మప్రచారం జరిగి పాఖండం, మూఢ నమ్మకాలు నశిస్తాయి. ప్రజలకు ధర్మం ఏమిటో, అధర్మం ఏమిటో చక్కగా బోధపడుతుంది. విద్యా విజ్ఞానాల ప్రచారం, ఏకరూపత, సంఘటన సిద్ధించి దేశం సర్వరంగాలలో ఉన్నతిని పొందుతుంది.

పంచ మహాయజ్ఞాలను చేయకపోతే ప్రత్యవాయ మనే పాపం వస్తుందని మన శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. **'జాయమానో వై నరః త్రిభిః ఋణవాన్ జాయతే'** – ప్రతీ మానవుడు (స్త్రీలు, పురుషులు) మూడు ఋణాలతో (అప్పులతో) జన్మిస్తారు. అవి – పితృఋణము, దేవఋణము, ఋషి ఋణము. ఈ మూడు ఋణాలను గుర్తు చేసుకోవడం కొరకే మూడు ప్రోగుల యజ్ఞోపవీతం ధరించాలని మన శాస్త్రాలు చెబుతాయి. స్త్రీలకు కూడా ఈ మూడు ఋణాలు ఉంటాయి కనుక వారుకూడా యజ్ఞోపవీతం తప్పక ధరించాలంటారు మన ఋషులు. పితృయజ్ఞంతో పితృఋణము, దేవయజ్ఞం (అగ్నిహోత్రం)తో దేవఋణము, అతిథియజ్ఞంతో ఋషి ఋణం తీర్చుకోవాలి. బ్రహ్మయజ్ఞంవల్ల ఆత్మోన్నతి కలుగుతుంది. బలివైశ్వదేవయజ్ఞం వల్ల భూతదయ కలిగి పుణ్యాత్ముల మౌతాము. ఈ విధంగా యీ పంచ మహాయజ్ఞాలు మన మేలు కొరకే.

# షోడశ సంస్కారవిధి

'సంస్కారం' అంటే 'సంస్కరించేది' అని అర్థం. పూర్వ ప్రకరణాలలో తెలిసికొన్నట్లుగా జీవుడు అనాది. అతడు చేసిన కర్మల కారణంగా ఒక శరీరం తదుపరి మరొక శరీరాన్ని పొందుతూ ఈ సృష్టిలో తిరుగుతూ ఉంటాడు. స్థూలమైన పాపకర్మలు నిమ్నయోనులలో (పశు పక్ష్యాది జన్మలలో) అనుభవించిన తదుపరి మానవ జన్మ లభిస్తుంది. మానవ జన్మ లభించినా కొన్ని పాపకర్మలకు చెందిన సంస్కారాలు అతని సూక్ష్మ శరీరంలో ఉంటాయి. అవి వాటికి తగిన పరిస్థితులు అనుకూలించినపుడు ప్రకటమయ్యే అవకాశం ఉంది. కనుక అట్టి అవకాశం రాకుండుటకు చేసే ప్రయత్నాలే షోడశసంస్కారాలు.

చరక మహర్షి చెప్పినట్లు **'సంస్కారో హి గుణాంతరాధాన ముచ్యతే'** – చెడు సంస్కారాలను తొలగించి మంచి సంస్కారాలను నింపుటకే ఈ సంస్కారాలు రూపొందించబడ్డాయి. ఈ షోడశ సంస్కారాల కాధారం ఈశ్వరీయ జ్ఞానమైన వేదం. గృహ్యసూత్ర గ్రంథాలలో గర్భాధానం మొదలు అంత్యేష్టి వరకు గల సంస్కారాలు 16. మధ్యకాలంలో మన దేశం విదేశీయుల, విమతస్థుల పాలనలో ఉండటం వల్ల ఈ సంస్కారాల ప్రథ చాలావరకు లోపించింది. నామకరణం, ఉపనయనం, వివాహం వంటి కొన్ని సంస్కారాలే జరుపుకుంటున్నారు. మహర్షి దయానంద సరస్వతి గారు ఈ లోపాన్ని గుర్తించి, ప్రాచీన ఋషులు వ్రాసిన గ్రంథాలనుండి సంకలనం చేసి **'షోడశ సంస్కారవిధి'** అనే మహత్వపూర్ణమైన గ్రంథాన్ని వ్రాసారు.

ఆ ప్రకారం సంస్కారాలు చేసుకుంటూ తదనుగుణంగా జీవిస్తే మానవుడు మహాత్ముడౌతాడు. సంక్షిప్తంగా వాటి గురించి తెలుసుకుందాము.

ప్రతీ సంస్కారంలోను బృహద్ యజ్ఞంతోబాటు విశేష హోమాలు, క్రియలు ఉంటాయి. ఇవన్నీ మంత్రపూర్వకంగా జరుగుతాయి. ప్రతీ మంత్రంలోను గంభీరమైన అర్థం ఉంటుంది. ప్రతీ క్రియ వైజ్ఞానికంగాను, హేతుబద్ధంగాను ఉంటుంది. గ్రంథవిస్తరణ భీతిచే సంస్కారాలలోని మౌళిక ఉద్దేశ్యం మాత్రమే యిక్కడ తెలుపబడుతోంది. వివరాల కొరకు, విధికొరకు 'షోడశ సంస్కారవిధి' చూడగోరుచున్నాము.

**1. గర్భాధానం :** మన పరివారంలో గొప్పగొప్పవారు జన్మించాలనీ, గొప్పగొప్ప పనులు చేసి మన వంశ కీర్తిని యినుమడింప జేయాలని మనమంతా కోరుకుంటాము. అందుకొరకు చేయవలసిన మొదటి ప్రయత్నం గర్భాధాన సంస్కారం. **'గర్భస్యాధానం వీర్యస్థాపనం స్థిరీకరణం యస్మిన్నేవ వా కర్మణా తద్ గర్భాధానమ్'** అని నిర్వచనం. గర్భధారణమనగా వీర్య స్థాపనము, స్థిరీకరణము.

మంచి పంటలు పండాలంటే మంచి విత్తనాలను మంచి క్షేత్రంలో (భూమిలో) నాటాలి. అట్లే మంచి సంతానం కోరేవారు ముందుగా వారి శరీరాలను (స్త్రీ పురుష శరీరాలను - రజో వీర్యాలను) శుద్ధిచేసుకోవాలి. బలపరచుకోవాలి. అనంతరం ప్రసన్న మనస్కులై ఒక మహాపురుషుడు మా యింట జన్మించాలని కోరుకుంటూ భార్యాభర్తలు సమాగమము జరపాలి. అందుకు తీసుకోవలసిన జాగ్రత్తలు, ప్రయత్నాలు ఈ సంస్కారంలో తెలుపబడతాయి. విశేష హోమం, క్రియలు అందుకు తోడ్పడతాయి. ఈ సంస్కారం చాలా మహత్వపూర్ణమైనది. దీని వైజ్ఞానిక వివరణ తెలసికోగోరువారు మాచే ప్రచురింపబడిన 'వైజ్ఞానిక సంస్కృతి' చదువగోరుచున్నాము.

**2. పుంసవనము :** ఇది గర్భిణికి రెండవ లేదా మూడవ నెలలో చేయాలి. గర్భస్థ శిశువు పెరుగుదలకు తీసుకోవలసిన జాగ్రత్తలు, ఆహార విహారాలు దీనిలో తెలుపబడతాయి. **'పుమాన్ సూయతే యస్మాత్ ఇతి పుంసవనమ్'** అని నిర్వచనం. పుమాన్ = బలవంతులు, ఆరోగ్య వంతులునైన సంతానం కొరకు ఈ సంస్కారం చెయ్యబడుతుంది. గర్భిణీ స్త్రీకి ఏఏ అంగాలలో బాధలు కలుగుతాయో గర్భస్థ శిశువుకు కూడా ఆయా అంగాలలో బాధలు కలుగుతాయని శుశ్రుత శాస్త్రం చెబుతుంది. తగిన అన్న పాన ఔషధాలతో గర్భిణిని రక్షిస్తూ ఉండాలి. భయాదులు కలుగకుండా ధైర్యం చెబుతూ ఉండాలి.

**3. సీమంతోన్నయనము :** గర్భస్థశిశు మానసికోన్నతికి ఈ సంస్కారం నాల్గవ నెల తదుపరి చేయాలి. **'పంచ సంధయః శిరసి విభక్తాః సీమంతా నామ'.** శిరస్సు 8 బల్లపరుపు ఎముకల కలయకచే ఏర్పడుతుంది. వీటి మధ్య 5 సంధులు (జాయింట్స్) ఏర్పడతాయి. ఆ సంధులనే 'సీమంతము'

లంటారు. ఈ ఎముకలపెట్టె లోపల అతిసున్నితము, అతిప్రధానమునైన మెదడు ఉంటుంది. అట్టి మెదుడుయొక్క ఉన్నయన ఉద్భావనల కొరకు ఈ సంస్కారం చేయబడుతుంది. **'సీమంతస్య ఉన్నయనం ఉద్భావనం ఇతి సీమంతోన్నయనమ్'** అని నిర్వచనం. ఉన్నయనం అంటే మెదడుకు ఉన్నతిని, వికాసాన్ని కలిగించటం. ఉద్భావనం అంటే ఉన్నత భావాలతో నింపటం. ఈ రెంటికీ కావలసిన విజ్ఞానమంతా ఈ సంస్కారంలో యిమడ్చబడింది. ఏఏ ఆహారాలు తీసుకుంటే నాడీకణాలు, మెదడుయొక్క నిర్మాణాలు జరుగుతాయో తెలుపబడింది. గర్భిణిస్త్రీకి ఉల్లాసం కలిగించి తద్వారా గర్భస్థశిశు మనోవికాసానికి కృషి చేయటం జరుగుతుంది.

పుంసవన, సీమంతోన్నయన సంస్కారాల వైజ్ఞానిక వివరణ కొరకు మా ప్రచురణ **'దౌహృదిని'** చదవండి.

**4. జాతకర్మ** : ఇది శిశువు జన్మించిన వెంటనే చేసే సంస్కారం. నేడు ప్రసూతిగృహాలలో (మెటర్నిటీ హాస్పిటల్స్‌లో) తీసుకుంటున్న జాగ్రత్తలన్నీ మన ప్రాచీన జాతకర్మ విధిలో కనబడతాయి. దీనిలో పరిశుభ్రతకు ఎక్కువ ప్రాధాన్యత యివ్వబడింది. గర్భిణికి నొప్పులు ప్రారంభమైన వెంటనే మంత్రయుక్తంగా మార్జనం చేసి గాలి వెలుతురు చక్కగా ప్రసరించే శుభ్రమైన గదికి తీసుకువెళ్ళాలి. ప్రసవించిన తదుపరి మాయను వేరుపరచి శుభ్రంచేసి తండ్రి ఒడిలో పరుండబెట్టి తండ్రి చేతనే బొడ్డు త్రాడును కోయించాలి. (ఈ క్రియ మనకు వింతగా కనబడుతుందికాని పాశ్చాత్య దేశాలలో తండ్రి చేతనే ఆధునిక వైద్యులు బొడ్డు త్రాడును కత్తిరింపచేయిస్తారు). అనంతరం మాతా శిశువులను శుభ్రమైన గోరు వెచ్చటి నీటితో స్నానం చేయించాలి. తండ్రి కాళ్ళుచేతులు కడుగుకొని ప్రసూతి గృహం బయట విశేష హోమం చెయ్యాలి.

హోమవిధి పూర్తిచేసి తండ్రి ప్రసూతిగృహంలోని శిశువు దగ్గరకు వెళ్ళి కొన్ని క్రియలు చేయాలి. 1) తేనెలో కొద్దిగా నెయ్యి కలిపి బంగారు పుడకతో శిశువు నాలికపై 'ఓ3మ్' అనే పదము వ్రాయాలి. 2) కుడి చెవిలో "వేదోఽసి" నీ గుప్తనామము వేదము (జ్ఞానము) అని చెప్పాలి. అంటే 'నీవు జ్ఞానము గల జీవాత్మవు' అని గుర్తు చెయ్యాలి. 3) కొన్ని మంత్రాలు పఠిస్తూ ఘృతమిశ్రిత మధువును బంగారు పుడకతో ప్రాశనం చేయించాలి. 4) ఆశీర్వాద మంత్రాలు

ముందు కుడి చెవిలోను, తదుపరి ఎడమ చెవిలోను పఠించాలి.. 5) తన కుడి హస్తంతో శిశువుయొక్క కుడి భుజమును స్పృశిస్తూ కొన్ని ఆశీర్వచన మంత్రాలు పఠించాలి. 6) కొన్ని మంత్రాలు చదువుచు బాలింత శరీరంపై సుగంధిత జలాన్ని చిలుకరించాలి. 7) పునః ఆశీర్వాద పూర్వకంగా కొన్ని మంత్రాలు చదివి శిశువు శిరస్సును అఘ్రాణించాలి. (వాసన చూడాలి). 8) అనంతరం శిశువుచే పాలు త్రాగించే ప్రక్రియ ఉంటుంది. అదియును వేదమంత్ర పూర్వకంగానే, 9) ప్రసూతి గృహంలో 10 దినముల వరకు ఉదయ సాయం సంధ్యా సమయాలలో విశేష పదార్థాలతో హోమం చెయ్యాలి. 10వ దినమున తండ్రి విద్వాంసులు ధార్మికులునైన కొందరు పండితుల సహకారంతో ఆశీర్వాద పూర్వకంగా కొన్ని వేదమంత్రాలు పఠిస్తాడు. దానితో ఈ సంస్కారం పూర్తవుతుంది.

ఇది చాలా పెద్ద సంస్కారం. క్రొత్తగా తమ పరివారంలోకి వచ్చే జీవాత్మకు తండ్రి చెప్పే స్వాగతం. ప్రతీ మంత్రంలోను గంభీరమైన అర్థం ఉంది. ప్రతీ క్రియలోను వైజ్ఞానికత ఉంది.

**5. నామకరణ సంస్కారం :** 'సంజ్ఞాకరణం లోకే వ్యవహారార్థం' అని చెప్పినట్లు లోక వ్యవహారం కొరకు తమ పిల్లలకు పేరు పెట్టడం అవసరం. తల్లిదండ్రులు తమ పిల్లలపై ఎన్నెన్నో ఆశలు పెట్టుకుంటారు. తమ పిల్లలు గొప్ప విద్యావంతులు కావాలని కొందరు, వీరులు కావాలని కొందరు, వ్యాపారవేత్తలు కావాలని కొందరు, కళాకారులు కావాలని కొందరు కోరుకుంటారు. అట్టివారు తమ పిల్లలకు తమ ఆశలకు ఆశయాలకు అనుగుణమైన పేరు పెట్టుకోవాలి. ఆ పేరు వారిని ప్రేరేపించటానికి, ప్రోత్సహించటానికి అనువుగా ఉండాలి. ఆ విధంగా తగిన పేరు ఎన్నుకుని నామకరణం చెయ్యటంకూడా ఒక సంస్కారమే నంటారు మన ఋషులు.

ఈ సంస్కారం బిడ్డ పుట్టిననాటినుండి10వ దినమున గాని, 11వ దినమునగాని, 101వ లేదా రెండవ సంవత్సరారంభ దినమున గాని చేయాలి. (లేదా అందరికి అనుకూల మైన దినమును నిర్ణయించుకోవచ్చును). దీనికి విశేషహోమం ఉంటుంది. బిడ్డ జన్మించిన తిథి, నక్షత్రాలతోను; వాటి దేవతా నామములతోను ఆహుతు లివ్వబడతాయి. ఈ ఆహుతులు లోకంలో

అనుకునేటట్లు ఆయా గ్రహాల శాంతికొరకు కాదు. జన్మించిన తిథి నక్షత్రాలు గుర్తుపెట్టుకోవాలనేదే ఆశయం. నామకరణం ఈ క్రింది యజుర్వేద మంత్రంతో చేయబడుతుంది.

**కో౽సి కతమో౽సి కస్యాసి కోనామాసి । యస్యతే**
**నామామన్మహియం త్వా సోమే నాతితృపామ । భూర్భువః స్వః**
**సుప్రజాః ప్రజాభిః స్యాంగ్ సువీరో వీరైః సుపోషః పోషైః ॥**

**(యజు. 7-29)**

"నీ వెవరువు ? ఎన్నవ వాడవు ? ఎవరి వాడవు ? నీ పేరేమి?" అనే ప్రశ్నలు పై మంత్రపు మొదటి పాదంలో ఉన్నాయి. ఈ ప్రశ్నలు జీవుని అనాదిత్వాన్ని సూచిస్తాయి. తమ పరివారంలోనికి వచ్చిన ఆ జీవుడు క్రొత్తగాపుట్టలేదనీ, పూర్వజన్మలలో ఎవరి బిడ్డగానో ఏ నామముతోనో ఉన్నాడనీ తెలుపుతున్నాయి. తదుపరి మంత్ర భాగంలో సమాధానంగా "ఎవరికి పేరుపెట్టి ఉత్తమ ఆహారపానీయాదులతో తృప్తి పరచాలనుకుంటున్నామో అట్టి వాడవు నీవు. సచ్చిదానంద స్వరూపుడైన పరమేశ్వరుని అనుగ్రహం వల్ల మనము సదా వివిధ సుఖములు బడయుదము గాక !" అని చెప్పబడింది.

తదుపరి ఒక ఋషి వాక్యంతో

**ఓం కో౽సి కతమో ౽స్యే షో ౽స్యమృతో౽సి**

**ఆహస్పత్యం మాసం ప్రవిశ (అసౌ)** - ............. పెట్టదలచిన పేరును ఈ ఖాళీలో ఉచ్చరించి నామకరణం చెయ్యాలి. అనంతరం దీర్ఘాయువు కొరకు ప్రార్థన, పెద్దల ఆశీర్వాదాలు ఉంటాయి.

**6. నిష్క్రమణ సంస్కారం :** నిష్క్రమణం అంటే శిశువును గృహం నుండి ఆరుబయట వాతావరణంలోనికి తీసుకురావటం. ఆరోగ్యరీత్యా శిశువును 3 నెలల వరకు గృహంలోనే ఉంచాలి. నాల్గవ నెల నుండి బయటకు తీసుకురావచ్చు. మొదటిసారి బయటకు తీసుకు వచ్చేటప్పుడు కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. సూర్య చంద్ర కిరణాల ఆవశ్యకతను గుర్తించాలి. అందుకొరకే ఈ సంస్కారం రూపొందించబడింది.

ఈ సంస్కారంలో సామాన్య యజ్ఞం చేస్తే చాలు. అనంతరం శిశువు యొక్క కుడి ఎడమ చెవులలో తండ్రి నిర్దేశిత వేదమంత్రాల

నుచ్చరించాలి. తదుపరి శిశువును ఆరు బయటకు తీసుకువచ్చి కొద్దిసేపు త్రిప్పి లోనికి తీసుకువెళ్ళాలి. అప్పుడు సూర్య చంద్రుల విశేషగుణాలను తెలిపే వేదమంత్రాల పఠనం, కొన్ని క్రియలు ఉంటాయి.

**7. అన్నప్రాశన సంస్కారం :** శిశువులకు ఆరు నెలలవరకు తల్లిపాలు సంపూర్ణ ఆహారం. తదుపరి అన్నం అవసరం. పిండి పదార్థాలు (కార్బోహైడ్రేట్స్), మాంసకృత్తులు (పప్పులు), కూరగాయలు క్రమంగా అలవాటు చెయ్యాలి. లేకుంటే పోషకాహారలోపాలోస్తాయని వైద్యనిపుణులంటారు. ఇంతేగాక, తల్లి బలహీనపడిపోకుండా కాపాడుకోవాలి. అందుకొరకై అన్నప్రాశనాన్ని (మెత్తటి అన్నం తినిపించటాన్ని) మన ఋషులు ఒక సంస్కారంగా రూపొందించారు.

**'దధి మధు ఘృత మిశ్రితమన్నం ప్రాశయేత్'** అని ఆశ్వలాయన ఋషి అంటారు.

శిశువులకు తినిపించే ఆహారం తయారుచేయడానికి మరిన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. ఆ విషయం ఈ సంస్కారంలో చెప్పబడుతుంది. విశేష హోమంలో కొంత అన్నభాగాన్ని ఆహుతులుగా నిచ్చిన తదుపరియే శిశువుకు ప్రాశనం చేయిస్తారు. ఈ క్రింది యజుర్వేద మంత్రంతో కొద్దికొద్దిగా ప్రాశనం చేయించాలి.

**అన్నపతే ! అన్నస్య నో ధేహ్యనమీవస్య శుష్మిణః ।**
**ప్రప్ర దాతారం తారిష ఊర్జం నో ధేహి ద్విపదే చతుష్పదే ॥**

**(యజు. 11-83)**

అన్న ప్రదాతవైన ఓ పరమేశ్వర ! మాకు రోగరహితమైన బలదాయక అన్నమును ప్రసాదింపుము. అన్నదాతను వర్ధిల్లజేయుము. మాయొక్క ద్విపాద పరివారమునకును, చతుష్పాద గో అశ్వాది పశువులకును బలకరమగు ఆహారమునిచ్చి రక్షించుము.

ఈ మంత్రం మనం ప్రతీసారి భోజన సమయమున పఠించి భుజించటం ఆదర్శంగా ఉంటుంది. అన్నదాత పరమేశ్వరుడని మరువకూడదు. అట్టి దాతకు కృతజ్ఞతలు తెలపటం మన ధర్మం.

**8. చూడాకర్మ సంస్కారం :** చూడాకర్మ అంటే పుట్టు వెంట్రుకలు తీయించటం. శిశువు తల్లి గర్భంలో ఉన్న 9 నెలలు ఉమ్మనీటి సంచిలో

(Amniotic Fluid Bag లో) పెరుగుతుంది. ఆ నీరు క్రిమినిరోధకంగా ఉండటానికి కొద్ది ఆమ్లయుక్తంగా ఉంటుంది. అందువల్ల శిశువు తలపై ఏర్పడిన వెంట్రుకలు పాలిపోయి బలహీనంగా ఉంటాయి. వాటిని ఒకసారి తొలగించివేస్తే మొక్కలు చిగురించినట్లు ఏపుగా వత్తుగా నల్లగా వెంట్రుకలు వస్తాయి. దానివల్ల శిరస్సునకు ముఖ్యంగా కపాలమునందలి మెదడుకు రక్షణ కలుగుతుంది. దీనికి అనువైన సమయం మూడవ సంవత్సరం. అప్పటికి కపాలం గట్టిపడుతుంది. చూడాకర్మ సంస్కారంవల్ల చాలా లాభాలు కలుగుతాయంటుంది యజుర్వేదం –

**శివో నామాసి స్వధితిస్తే పితా నమస్తే ऽఅస్తు మామా హింసీః।**
**నివర్తయా మ్యాయుషేऽన్నాద్యాయ ప్రజననాయ**
**రాయస్పోషాయ సుప్రజా స్త్వాయ సువీర్యాయ ॥ (యజు. 3-63)**

"ఓ కత్తీ ! నీవు కళ్యాణకారివి. నిన్ను పుట్టించిన లోహము వజ్రతుల్యము. నీకు నమః (తగినవిధంగా సత్కారము). మమ్ము హింసింపకుము."

దీర్ఘాయువు కొరకు, బలమైన జీర్ణశక్తి కొరకు, ప్రజనన (సంతానోత్పాదక) శక్తికొరకు, ధనసంపాదనాసామర్థ్యం కొరకు, పుష్టి కొరకు, సుసంతాన ప్రాప్తి కొరకు, బలపరాక్రమముల కొరకు ఈ శిశువు తలపైనుండు పుట్టు వెంట్రుకలను తొలగించుచున్నాను" – అని తండ్రి సంకల్పించి కత్తిరించాలి.

అంటే చూడాకర్మవల్ల పై లాభాలన్నీకలుగుతాయని పరమేశ్వరుని ఉపదేశం. సమస్త నాడీ శక్తులకు మూలమైన మెదడును, దానికి రక్షణగా నున్న కపాలమును ఈ ముండనం కాపాడుతుందని భావం.

ఈ సంస్కారం తొందరపడకుండా తగిన జాగ్రత్తలు తీసుకుంటూ నెమ్మదిగా చెయ్యాలి. ముందుగా విధి ననుసరిస్తూ విశేషహోమం చెయ్యాలి. ముండనానికి వాడే కత్తెరను, కత్తిని వేడినీటితో శుద్ధి చెయ్యాలి. (స్టెరైైజ్ చెయ్యాలి). అనంతరం తండ్రి దర్భల సహితంగా వెంట్రుకలను పట్టుకుని కత్తిరించాలి. ముందు కుడివైపు, తదుపరి ఎడమవైపు , ముందు, వెనుక క్రమంగా కత్తిరించాలి. అనంతరం మంగలిచే ముండనం చేయించాలి. రాలిన వెంట్రుకలను గోమయంతో అద్ది ఒక మట్టిపాత్రలో నుంచి దర్భలు, కొన్ని జమ్మి ఆకులు కూడా ఆ పాత్రలోనే పెట్టి దూరంగా భూమిలో పాతిపెట్టాలి.

ముఖ్యంగా ఈ జాగ్రత్తలన్నీ పరిశుభ్రతకొరకు, ఆరోగ్యం కొరకు. అనంతరం శిశువుకు స్నానం చేయించి యజ్ఞశాలకు తీసుకురావాలి.

మంగలికి తగిన ధనం, వస్త్రాలు, స్వయంపాకం యిచ్చి పంపాలి. ముఖ్యంగా ముందుగా తీసిపెట్టిన బియ్యం, యవలు, మినుములు, నువ్వులు మంగలికివ్వాలి. దీని ఉద్దేశ్యమేమంటే నాడీకణాలకు పుష్టిని కలిగించే కాల్షియం, పోటాషియం, ఫాస్పరస్‌లు వాటిలో ఎక్కువగా ఉంటాయి. కనుక వాటిని మంగలి కివ్వటమేకాక శిశు ఆహారంలో చేర్చాలని ఈ క్రియ గుర్తు చేస్తుంది. ఈ విధంగా ఈ సంస్కారాలన్నీ వైజ్ఞానికంగా ఉంటాయి. పెద్దల ఆశీర్వాదంతో ఈ సంస్కారం ముగుస్తుంది.

**9.కర్ణవేధ సంస్కారం :** కర్ణవేధం అంటే చెవులు కుట్టించటం. సుశృతాచార్యులు చెప్పినట్లు 'రక్షాభూషణ నిమిత్తం బాలస్య కర్ణౌ విధ్యేతే' - ఆరోగ్యరక్షణకు, ఆభూషణాలంకరణకు బాలబాలికల కర్ణములను (చెవులను) కుట్టించాలి. ఎందుకనగా "వ్యత్యాసాత్ వా శిరో విధ్యేత్ ఆంత్రవృద్ధినివృత్తయే" ఆంత్రవృద్ధి (గిలక - హెర్నియా) నివృత్తికొరకు (రాకుండుటకు) వ్యత్యయ మంటే కుడి కర్ణవేధం ఎడమ గిలకను, ఎడమ కర్ణవేధం కుడి గిలకను నిరోధిస్తుంది - రాకుండా కాపాడుతుంది. ఈ సంస్కారానికి 3 లేదా 5వ సంవత్సరం అనుకూలంగా ఉంటుంది.

అన్ని సంస్కారాలలో వలెనే సామాన్యప్రకరణ యజ్ఞవిధిని పూర్తిచేసి మంత్ర పూర్వకంగా శరీరనిర్మాణశాస్త్రం తెలిసిన వైద్యులచే చెవులు కుట్టించాలి.

ఆయుర్వేద గ్రంథం సుశృత సంహితలో ఈ విధంగా వ్రాసి ఉంది.

**భిషక్ వామహస్తే నాకృష్య కర్ణం దైవకృతే ఛిద్రే**

**ఆదిత్యకరావభాస్వితే శనైః శనైః ఋజు విధ్యేత్**

వైద్యుడు తన ఎడమచేతితో చెవి తమ్మిని మృదువుగా లాగిపట్టి సూర్యకిరణములు చక్కగా ప్రకాశించు దైవకృత ఛిద్రమును గుర్తించి అక్కడ కుట్టాలి.

దీని భావమేమంటే - చెవి తమ్మిలోని రక్తనాళాల నాడీతంతువుల మధ్య పరమేశ్వరుడే ఒక రంధ్రాన్ని (నరనాడులు లేని కండరభాగాన్ని) ఏర్పాటు

చేసాడు. అక్కడ కుడితే ఆ రంధ్రం ఏ నరానికి హాని కలిగించకుండా ఉంటుంది. ఆభూషణాలలోని స్వర్ణం (బంగారం) ఆ నరనాడులను స్పృషిస్తూ ఆరోగ్యదాయని ఔతుంది. ఆ విధంగా కుట్టగల వైద్యులు అందుబాటులో లేకుంటే అనుభవజ్ఞులైన స్వర్ణకారులచే ఈ క్రియ చేయించవచ్చు. కర్ణవేధ మంత్రాలలో "మా చెవులతో మేము భద్రమైనవే వినుచుందుము గాక, మా యింద్రియములు, అంగములు ఆరోగ్యంగా స్థిరంగా నుండి వాటితో మేమెప్పుడూ మంచి పనులనే చేయుదుము గాక!" అనే సంకల్పం ఉంటుంది.

**10. ఉపనయన సంస్కారం :** ఉపనయనం అంటే గురువు దగ్గరకు నడిపించటం. పూర్వం బాలబాలికలకు 8వ సంవత్సరంలో ఉపనయన సంస్కారం చేసి గురువు దగ్గరకు (గురుకులానికి) పంపేవారు. విదేశీపాలనలో ఆ ప్రథ పోయి పాఠశాలలకు పంపుతున్నారు. ప్రతి వ్యక్తికి తల్లిదండ్రులే మొదటి గురువులు. అనంతరమే ఆచార్యులు (ఉపాధ్యాయులు) గురువులౌతారు. అందుచే ఈ సంస్కారంలో తల్లిదండ్రులు ఆచార్యులను ఇంటికి ఆహ్వానించి వారిచే తమ పిల్లలకు యజ్ఞోపవీతధారణ చేయించి వారి కప్పగిస్తారు. ఆచార్యులు ఆ బాలబాలికలచే విశేష హోమం చేయించి కొన్ని ప్రతిజ్ఞలు చేయిస్తారు. ముఖ్యంగా ఒక క్రియ చాలా ఆదర్శంగా ఉంటుంది.

ఆచార్యుడు జలవిశిష్టతను తెలిపే 3 వేదమంత్రాలతో బాలకుని దోసిలిని జలముతో నింపుతాడు. తదుపరి ఆచార్యుడు తన దోసిలిని జలముతో నింపుకొని ఆ నీటినికూడా బాలకుని దోసిలిలో నున్న జలములో పోసి, బాలకుని దోసిలిని అంగుష్ఠ సంహితంగా పట్టుకుంటాడు. అనంతరం ఒక మంత్రం పఠించి బాలకుని దోసిలియందలి నీటిని క్రింది వెడల్పు పళ్ళెరములో విడిపిస్తాడు. ఈ విధంగా మూడు పర్యాయాలు చేయటం జరుగుతుంది.

దీని భావమేమంటే-బాలకుని దోసిలిలోని జలము అతని స్వాభావిక జ్ఞానానికి సూచకము. ఆచార్యుని దోసిలిలోని జలము ఆచార్యుని విశిష్ట జ్ఞానానికి సూచకము. ఆచార్యుడు బాలుని తన శిష్యునిగా స్వీకరించి తనవద్ద ఉన్న జ్ఞానాన్ని బాలకునికి యిస్తానంటూ అతని దోసిలిలో విడుస్తాడు. బాలుడు తన జ్ఞానాన్ని + ఆచార్యుని నుండి లభించిన జ్ఞానాన్ని తనవరకే పరిమితం చేసుకోక దానినంతటిని భూమిపై విస్తరింప చేస్తానంటూ క్రింద పళ్ళెరంలో

విడుస్తాడు. అంటే బాలుడు పెరిగి పెద్దవాడై తాను సంపాదించిన జ్ఞానాన్నంతా కొందరిని శిష్యులుగా చేసుకొని వారికి బోధిస్తానని ప్రమాణం చేస్తున్నాడు. ఈ విధంగా పూర్వం జ్ఞానం తరతరాలుగా ఉచితంగానే ప్రవహిస్తూ ఉండేది. ప్రతిజ్ఞ గట్టిపడటం కొరకు ఈ క్రియ మూడుసార్లు చేయిస్తారు.

అనంతరం సూర్యుని చూపించి సూర్యునివలె ఆదర్శంగా జీవించాలని ఉపదేశిస్తాడు. పిమ్మట, భూమి సూర్యుని చుట్టూ తిరిగినట్లు శిష్యుడు ఆచార్యుని చుట్టూ 3 ప్రదక్షిణలుచేసి గురువుగా స్వీకరిస్తాడు. అనంతరం ఆచార్యుడు శిష్యుని అంగములను స్పృశిస్తూ అవి బలపడాలనీ, రక్షింపబడాలనీ సంకల్పిస్తాడు. గురుశిష్యు లిద్దరు పరస్పరం హృదయాలను స్పృశిస్తూ ఒకరికొకరు అనుకూలంగా ఉంటామని ప్రతిజ్ఞ చేస్తారు. చివరగా ఆచార్యుడు శిష్యునితో 'నాయనా ! నీకు నేనొక్కడినే ఆచార్యుడిని కాను. నీకు నీ అంతర్యామియైన పరమేశ్వరుడు, అగ్నిహోత్రం కూడా గురువులే' నని ఉపదేశిస్తాడు. పెద్దల ఆశీర్వాదాలతో ఈ సంస్కారం ముగుస్తుంది.

ఈ సంస్కారంలో 'యజ్ఞోపవీతధారణ', తదుపరి సంస్కారంలో 'గాయత్రీ ఉపదేశం' ముఖ్యాంగాలుగా ఉంటాయి. ఈ రెండూ బాలికలకు కూడా చెయ్యాలి. వారికికూడా యజ్ఞోపవీతధారణకు, గాయత్రీ ఉపదేశానికి, వేదాధ్యయనానికి సమాన అధికారం ఉంది. వివరంగా తెలుసుకోగోరువారు మా ప్రచురణలు **'యజ్ఞోపవీతవైశిష్ట్యము' 'గాయత్రీ మహిమ'** చదువగోరుచున్నాము. అయితే, స్త్రీలకు స్త్రీలు, పురుషులకు పురుషులు ఆచార్యులుగా, ఉపదేశికులుగా నుండాలి. ఇరువురి గురుకులాలు దూర దూరంగా ఉండాలి.

**11. వేదారంభ సంస్కారం :** వేదారంభం అంటే వేదాల అధ్యయనాన్ని ప్రారంభించటం. వేదాధ్యయనం గురువు సన్నిధిలో జరగాలి. కనుక శిష్యులను గురుకులాలకు పంపాలి. గురుకులం అంటే గురువు పరివారం. దీనిని నేటి మాటలతో చెప్పాలంటే రెసిడెన్షియల్ స్కూల్స్. వీటినే గురుకుల పాఠశాల లంటున్నారు. అయితే, ప్రాచీన గురుకులాలు నేటి గురుకుల పాఠశాలలవలె కాకుండా చాలా ఆదర్శంగా ఎన్నో నియమాలతో తాపసిక ఆశ్రమాలవలె ఉండేవి.

పూర్వం గురుకులానికి వెళ్ళిన విద్యార్థులు విద్య పూర్తయ్యేవరకు ఇంటికి

తిరిగివచ్చేవారు కాదు. తల్లిదండ్రులు కూడా పోయి చూసివచ్చేవారు కాదు. గురువులే సమస్త బాధ్యతలను వహించేవారు. గర్భిణి తన శిశువును గర్భంలో కాపాడినంత జాగ్రత్తగా గురువులు శిష్యులను కాపాడేవారు. శిష్యులకు విద్యతోబాటు సదాచారాన్ని సభ్యతను సంస్కృతిని నేర్పేవారు. అప్పుడే వారు ఆచార్యు లనబడతారు. '**ఆచారం గ్రాహయతి ఇతి ఆచార్యః**' - అని ఆచార్య పదమునకు నిర్వచనం.

భూమి సూర్యుని చుట్టూ తిరిగినట్లు శిష్యులు గురువుల చుట్టూ తిరుగుతూ అన్నిటినీ గ్రహించేవారు. శిష్యులంతా భిక్ష తీసుకువచ్చి గురువుగారి ముందు ఉంచేవారు. గురువులు దానిని అందరికీ సమంగా పంచి వారితోనే కలిసి భుజించేవారు. పాదములకు చెప్పులుగాని, పైన గొడుగుగాని ధరించేవారు కాదు. మెత్తటి పరుపులపైకాక భూమిపైననే చాప పరచుకొని శయనించేవారు. జీవన క్రియలన్నీ గురువు ననుసరిస్తూనే జరిగేవి. తల్లిదండ్రులను సేవించినట్టు గురువులను సేవించేవారు.

ఈ సంస్కారంలో సామాన్య యజ్ఞంతోబాటు కొన్ని విశేష హోమాలు, క్రియలు జరుగుతాయి. బ్రహ్మచారిచే అగ్నిసంచయనము, ఇంద్రియ స్పర్శము, మేధస్సుకొరకు ప్రార్థన చేయించి గురువు గాయత్రీ మంత్రోపదేశం చేస్తాడు. గురు శిష్య లిరువురును పరస్పరం హృదయాలను స్పృశిస్తూ ఒకరికొకరు అనుకూలంగా ఉంటామని ప్రతిజ్ఞ చేస్తారు. గురువు బ్రహ్మచారిచే దండధారణ మేఖలా ధారణలను చేయిస్తాడు. ఆత్మరక్షణకు ధర్మరక్షణకు దండధారణ, నియమపాలనలో కటిబద్ధతకు మేఖలాధారణ ఉపకరిస్తాయి. అనంతరము తండ్రి బ్రహ్మచారికి బ్రహ్మచర్య నియమాలను ఉపదేశిస్తాడు. ఈ నియమాలు 20కి పైగా ఉంటాయి. ఉపదేశాన్ని విని బ్రహ్మచారి తండ్రికి నమస్కరించి అవశ్యం వాటిని పాటిస్తానంటాడు.

అనంతరం భిక్ష చేయిస్తారు. సంకోచంపోయి అలవాటుపడుటకు ముందు తన పరివారం దగ్గర భిక్ష చేయిస్తారు. ముందుగా తల్లి, తండ్రి, అక్క, అన్న, అత్త, మామ మొదలగువారిని భిక్ష అడగమంటారు. అనంతరం బంధువులవద్ద పెద్దలవద్ద గ్రహింప చేయిస్తారు. ఆ విధంగా లభించిన భిక్షను బ్రహ్మచారి గురువున కర్పించగా గురువు అందుండి కొంత గ్రహించి ఆ భిక్షనంతను

శిష్యున కిచ్చివేస్తాడు. మరునాటినుండి శిష్యుడు గ్రామంలోనికివెళ్ళి భిక్ష తీసుకువచ్చి గురువున కప్పగించటమనే క్రియ జరుగుతూనే ఉంటుంది. ఈ క్రియలోని ఆశయమేమంటే – బాలకునిలోని అహంకార అభిమానాలు తొలగి సామాజిక స్పృహ కలిగించుటయే. భిక్షతో శారీరకంగాను, బౌద్ధికంగాను పెరిగిన బ్రహ్మచారి సమాజానికి ఋణపడి ఉన్నట్లు గుర్తించి, సమాజసేవకు కృషిచేస్తాడు.

తదుపరి అంతా భుజించి విశ్రాంతి తీసుకుంటారు. మరల సాయంత్రం విశేషహోమం ఉంటుంది. చివరగా పెద్దలంతా బ్రహ్మచారిని ఆశీర్వదించి గృహాలకు వెళ్ళిపోతారు. ఆనాటి నుండి అధ్యయనం పూర్తయ్యేవరకు బ్రహ్మచారి అక్కడనే ఉంటాడు. కన్యలకు భిక్ష చేయించటం తప్ప మిగిలిన విధులు చాలా వరకు ఇట్లే ఉంటాయి. కన్యాగురుకులాలు వేరుగా ఉండేవి. నియమాలు, భోజనము, వసతి మొదలైనవి రాజులకు పేదలకు అందరికీ ఒకే రకంగా ఉండేవి. మన ఆదర్శ పురుషులు శ్రీరామ శ్రీకృష్ణులు ఆ విధంగా గురుకులవాసం చేసినవారే.

**12. సమావర్తన సంస్కారం :** సంతృప్తిగా అధ్యయనం చేసి గురుకులాన్ని విడిచి గృహానికి తిరిగి వెళ్ళే సమయంలో ఈ సంస్కారం చేస్తారు. దీనిని స్నాతకమని, స్నాతకోత్సవమని లోకంలో వ్యవహరిస్తున్నారు. పూర్వం 24, 36, 48 సంవత్సరాలు వచ్చువరకు గురుకులంలో బ్రహ్మచారులుగా నుండి వేదాధ్యయనం చేసేవారట. 24 వ సంవత్సరం వరకు గడిపిన వారిని వసుబ్రహ్మచారులనీ, 36, 48 సంవత్సరాలు వచ్చువరకు గడపిన వారిని వరుసగా రుద్ర, ఆదిత్య బ్రహ్మచారులనీ పిలిచేవారట.

వివాహేచ్ఛ కలిగినపుడు వారు సమావర్తన సంస్కారం జరుపుకొని యింటికి వెళ్ళి వివాహం చేసుకునేవారు. ఈ సంస్కారంలో విశేషయజ్ఞంతో బాటు కొన్ని క్రియలుంటాయి. వాటిలో 8 కడవలలోని నీటితో స్నానము చేయటం ఒకటి. బహుశః అందుచేతనే దీనికి స్నాతకమనే పేరు వచ్చింది. అత దంతవరకు కఠోరమైన బ్రహ్మచర్యవ్రతాన్ని పాటిస్తూ ఉండటంవల్ల స్నానాదులలోను, అలంకరణలోను, అన్న పానాదులలోను సంయమిగా ఉండేవాడు. వాటినుండి క్రమంగా విముక్తిని పొందుతూ సామాన్య స్థితికి వచ్చి వివాహం చేసుకొని గృహస్థుడు కావలసియున్నది. అందుచే ఈ సంస్కారం

అతనిని బంధన విముక్తిని చేస్తుంది.

విశేష స్నానానంతరం బ్రహ్మచారి ఒక వేదమంత్రాన్ని పఠించి మేఖలా (మొలత్రాడు) దండములను విడిచిపెడతాడు. పరమేశ్వరోపాసన చేసి, పెరుగు లేదా నువ్వులను ప్రాశనముచేసి, వెంట్రుకలను గోళ్ళను తొలగించుకుంటాడు. మేడిపుల్లతో దంతధావనచేసి సుగంధ ద్రవ్యాలను శరీరానికి రాచుకొని మరొకసారి స్నానం చేస్తాడు. అనంతరం మంత్ర పూర్వకంగా పీతాంబరాలను ధరించి అలంకరించుకుని అద్దంలో చూచుకుంటాడు. కంటికి కాటుక పెట్టుకొని పాదరక్షలను గొడుగును ధరించి పెండ్లికొడుకులా తయారౌతాడు.

తదుపరి శిష్యుడు ఆచార్యుని అర్ఘ్యపాద్యాదులతో సత్కరించి తగిన విధంగా గో వస్త్ర ధన ధాన్యాదులను దానంగా సమర్పిస్తాడు. బంధుమిత్రుల సమ్ముఖమున గురువు తనకు చేసిన మహోపకారాలను ప్రస్తుతించి ధన్యవాదాలు తెలుపుతాడు. నన్ను కృతార్థుని చేసినట్లే మిగిలిన విద్యార్థులకును వివిధ విద్యల నేర్పి కృతకృత్యులను చేయుడని ప్రార్థిస్తాడు. ఆ సమయంలో గురువు చేసే దీక్షాంతోపదేశం (స్నాతకోపన్యాసం) ఎంతో విశిష్టంగాను ఆదర్శంగాను ఉంటుంది. అది సర్వకాలాలలోను, సర్వదేశాలవారు, సర్వులు అనుసరించతగినది. తైత్తరీయోపనిషత్తు శిక్షావల్లిలో యిది కనబడుతుంది. సంక్షిప్తంగా అదేమంటే -

**వేదమనూ చ్యాచార్యోఽంతేవాసిన మనుశాస్తి ।**
**సత్యం వద । ధర్మం చర । స్వాధ్యాయాన్ మా ప్రమదః ।**
**ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం**
**మా వ్యవచ్ఛే త్సీః ।**
**సత్యా న్న ప్రమదితవ్యమ్ । ధర్మా న్న ప్రమదితవ్యమ్ ।**
**కుశలా న్న ప్రమదితవ్యమ్ । భూత్యై న ప్రమదితవ్యమ్ ।**
**స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ ॥**

వేదాధ్యయనం పూర్తిచేసిన బ్రహ్మచారికి ఆచార్యుడు ఈ విధంగా ఉపదేశం చెయ్యాలి -

శిష్యా ! నీ వెల్లపుడు సత్యమునే చెప్పుము. ధర్మమునే ఆచరింపుము. ఇంటికి వెళ్ళినప్పటికి వేదాది సత్యశాస్త్రములను చదువుట మానవద్దు. విద్యచెప్పిన

గురువులకు దక్షిణ నొసగి గృహస్థుడవై సంతానతంతువును నడుపుము. అనగా – సంతానమును కని, పెంచి పెద్దచేసి విద్యాబుద్ధుల నిమ్ము. సత్యగ్రహణ సత్యాచరణ విషయములో ప్రమత్తుడవు కావద్దు. ధర్మాచరణలోను, నీ యోగక్షేమాల విషయంలోను, ఇతర ప్రాణుల పట్ల వ్యవహరించవలసిన విషయంలోను ప్రమత్తుడవు కావద్దు. పొరబడవద్దు. బద్ధకించవద్దు. స్వాధ్యాయ ప్రవచనాలలోనూ బద్ధకించవద్దు.

**దేవ పితృ కార్యాభ్యాం న ప్రమదితవ్యమ్ ।**
**మాతృదేవో భవ । పితృదేవో భవ । ఆచార్యదేవోభవ ।**
**అతిథి దేవో భవ ।**
**యా న్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని ।**
**యా న్యస్మాకం సుచరితాని తాని త్వయోపాస్యాని ।**
**నో ఇతరాణి ............. (శిక్షావల్లి. 7-1-2)**

దేవతలను (విద్వాంసులను) పితరులనుసేవించుటలో ఏమరుపాటు వద్దు. నీకు తల్లి తండ్రి ఆచార్యులు ధర్మోపదేశకులు దేవతలు కావాలి. వారిని నీవు తగిన విధంగా సేవించు. మేము నీ కుపదేశించిన నిత్య నైమిత్తిక కర్మలను తప్పక చేయాలి. మా యాచరణలలోని మంచి నడతనే నీవు గ్రహించు. మిగిలినవాటిని విడిచిపెట్టు........

ఈ విధంగా పెద్ద ఉపదేశమే ఉంటుంది.

అనంతరం పెద్దల ఆశీస్సులతో ఈ సంస్కారం ముగుస్తుంది. ఇంతవరకు బ్రహ్మచర్యాశ్రమంలో నున్న యువకుడు గృహానికి వెళ్ళి వివాహం చేసుకొని గృహస్థుడౌతాడు.

**13. వివాహ సంస్కారం :** సంతానాన్ని కని ప్రయోజకులను చేయడానికి పురుషునికి స్త్రీ, స్త్రీకి పురుషుడు తోడు అవసరం. ఆ తోడు జీవితాంతం ఉండాలి. కనుక తన అభిరుచులకు ఆశయాలకు తగిన వ్యక్తి అయితేనే ఆ స్నేహబంధం శాశ్వతంగా ఉంటుంది. అందుకు స్వయంవర వివాహాలే ఉత్తమం. పైపై మెరుగులకు, అందచందాలకు వశమైపోక సమాన గుణ కర్మ స్వభావాలు కలవారితో వివాహం చేసుకోవాలంటాయి మన ధర్మశాస్త్రాలు. అందుకు తగిన వయస్సుకూడా అవసరం. కనీసం కన్యకు 19 సంవత్సరాలు, యవకునకు

25 సంవత్సరాలు పూర్తి కావాలంటారు మన ఋషులు.

దేశదూరం, బంధుత్వదూరం గల వివాహాలే శ్రేష్ఠం. **'దుహితా దుర్హితా దూరే హితా భవతీతి'** అని నిరుక్త శాస్త్రం చెబుతుంది. అంటే ఎంత ఎక్కువ దూరదేశమైతే అంత మంచిది. బంధుత్వంలో కూడా. అప్పుడే పరస్పర ప్రీతి, ఆరోగ్య ఐశ్వర్యాల వృద్ధి కలుగుతాయి.

వివాహ సంస్కారం చాలా పెద్ద సంస్కారం. ఇందలి ప్రతి క్రియలోను, ప్రతి మంత్రంలోను గంభీరమైన అర్థం ఉంటుంది. లోకంలో రెండు రకాల వివాహ పద్ధతులు ప్రచారంలో ఉన్నాయి. ఒకటి వైదిక పద్ధతి, రెండు పౌరాణిక పద్ధతి. మనమంతా వేదమతానికి చెందినవారంకనుక వైదిక పద్ధతిలో జరుపుకోవడమే ఉత్తమం. దానిలో కూడా పెక్కు పౌరాణిక క్రియలు చోటు చేసుకున్నాయి. వీటన్నిటికన్న మహర్షి దయానంద సరస్వతీ విరచిత సంస్కారవిధి ననుసరించి జరుపుకోవడమే ఉత్తమంగాను, ఆదర్శంగాను, హేతుబద్ధంగాను, వైజ్ఞానికంగాను ఉంటుంది.

వివరంగా తెలుసుకోగోరువారు ఆ గ్రంథాన్ని చదువ గోరుచున్నాము. సంక్షిప్తంగా – ఈ సంస్కారంలోని క్రియలు ఈ విధంగా ఉంటాయి. 1. వర స్వాగతము (మధుపర్కవిధి), 2. కన్యా ప్రతిగ్రహణము, 3. ఆహ్వానితుల ఎదుట ప్రతిజ్ఞలు చేసి, అనుమతి కోరుట. 4. వివాహయజ్ఞం, 5. పాణిగ్రహణ ప్రతిజ్ఞలు, 6. శిలారోహణము, 7. లాజాహోమము, 8. కేశ విమోచనము, 9. సప్తపది, 10. జల ప్రోక్షణము, 11. సూర్యదర్శనము. 12. హృదయాలంభనము, 13. సుమంగళాశంసనము, 14. పెద్దల ఆశీర్వాదములు, 15. సాయింత్రం – ఉత్తరవిధి (విశేషహోమ సహితం), 16. ధ్రువ దర్శనము, 17. అరుంధతీదర్శనము, 18. అన్నాహుతులు, 19. ఓదన ప్రాశనము, 20. వామదేవ్య గానము.

అనుకూలతను బట్టి రెండవ దినమునగాని, మూడవ దినమునగాని వధూవరులను సమ్మాన పూర్వకంగా వరుని గృహానికి తీసుకువెళ్ళాలి. మరల అక్కడ విశేషహోమాలు, ఆశీర్వచనాలు ఉంటాయి.

పై క్రియలన్నిటిలోను 5 క్రియలు చాలా ముఖ్యమైన వంటాయి గృహ్యసూత్రాలు –

**న ఉదకేన వాచా కన్యాయాః పతిరిష్యతే ।**
**పాణిగ్రహణ సంస్కారాత్ పతిత్వం సప్తమే పదే ॥**

"కేవలం ఉదక క్రియలతో కాని, వేదవాక్కులతో కాని కన్య పతిని పొందలేదు. పాణిగ్రహణ సంస్కారమునుండి సప్తపది వరకు గల ప్రమాణపూర్వక క్రియలు చేయించినపుడే కన్యపతిని పొందునని గ్రహించండి" అని చెబుతాయి.

ఈ ఐదుక్రియల (పాణిగ్రహణ, శిలారోహణ, లాజాహోమ; కేశవిమోచన, సప్తపది క్రియల) వివరణకొరకు మాచే ప్రచురింపబడిన **'వైదిక వివాహ వైశిష్ట్యము'** చదువ గోరుచున్నాము.

విచిత్రమేమన వైదిక వివాహ క్రియలలో మంగళసూత్రధారణ కనబడదు. వరుడు వధువు మెడలో మంగళసూత్రం కట్టాలనే నిర్దేశం వేదాలలోకానీ ప్రాచీన గృహ్యాసూత్రగ్రంథాలలోకానీ కనబడదు. కనుక ఇది మధ్యకాలంలో వచ్చిన ఆచారమే. బహుశః మన దేశాన్ని విదేశీయులు పాలించినపుడు కన్యల రక్షణకొరకు చిన్నతనంలోనే వివాహాలు చేసి పెండ్లయినట్లు గుర్తుగా మెడలో మంగళసూత్రధారణ చేయించి యుంటారు.

ఈ వివాహ సంస్కారం నుండి గృహస్థాశ్రమం ప్రారంభమౌతుంది.

## గృహస్థాశ్రమం

ప్రాచీన శాస్త్రాలలో మానవ జీవితాన్ని నాలుగు ఆశ్రమాలుగా విభజించి కర్తవ్యాకర్తవ్యాల నుపదేశించారు. ఆశ్రమం అంటే "ఆ-సమంతాత్ శ్రమయతి' చక్కగా సమగ్రంగా శ్రమించటం"అని అర్థం.

**శ్లో॥ బ్రహ్మచర్యాశ్రమం సమాప్య గృహీ భవేత్ ।**
**గృహీభూత్వా వనీ భవేత్, వనీ భూత్వా ప్రవ్రజేత్ ॥**
**(శతపథ బ్రాహ్మణం. కాండ. 14)**

గురుకులంలో బ్రహ్మచర్య నియమాలను పాటిస్తూ శారీరక బౌద్ధిక వికాసంకోసం శ్రమించాలి. తదనంతరం వివాహితుడై మిగిలిన 3 ఆశ్రమాలవారిని, పిల్లలను పోషించటానికి శ్రమించాలి. కుమారునకు కుమారుడు కలిగిన తదుపరి వానప్రస్థాశ్రమం స్వీకరించి ఆత్మోన్నతికొరకు శ్రమించాలి. విద్యా వైరాగ్య సంపన్నుడైతే సంన్యాసాశ్రమం స్వీకరించి

ధర్మప్రబోధం చేస్తూ పరివ్రాజకునిగా శ్రమించాలి. ఈ విధంగా అన్ని ఆశ్రమాలలోను శ్రమించటమే ఉంటుంది.

గృహస్థాశ్రమం చాలా బాధ్యతలతో కూడి ఉంటుంది. అయినప్పటికీ అనుకూలమైన భార్య (లేదా భర్త) లభిస్తే అదే స్వర్గం అవుతుంది.

వివాహసంస్కారంలో ధర్మార్థకామమోక్షాలను సాధించడానికే భార్యాభర్తలు ఒకరినొకరు స్వీకరిస్తున్నట్లు ప్రతిజ్ఞలు చేస్తారు. కనుక యిద్దరూ ఆ లక్ష్యం వైపు పయనించాలి. నిష్ఠగా పంచమహాయజ్ఞాలు చేస్తూ ఋణ విముక్తులు కావాలి. ధర్మపూర్వకంగా సంతానాన్ని కని సంస్కారాలు చేస్తూ వారిని సంస్కారవంతులుగా, ఉత్తమ పౌరులుగా నిర్మించాలి. వేదాలలో ఉపదేశింపబడిన కౌటుంబిక ధర్మాలనుపాటిస్తూ అందరితో సఖ్యతగా మెలగాలి. మహాపురుషుల జీవితచరిత్రలను పఠిస్తూ తదనుగుణంగా జీవించ యత్నించాలి. మనుస్మృత్యాది గ్రంథాలను చదువుతూ సామాజిక నియమాలను పాటించాలి. నియతకాలంలో ఈశ్వరోపాసనచేస్తూ ఆత్మోన్నతికై సాధన చెయ్యాలి. తన గుణ కర్మ స్వభావాల కనుగుణమైన వర్ణాన్ని స్వీకరించి ఉన్నతికై శ్రమించాలి. అప్పుడే అది ఆదర్శ గృహస్థాశ్రమం ఔతుంది.

**'వృణోతే ఇతి వర్ణః'** - వర్ణం అంటే వరించి స్వీకరించేది. జన్మతో వచ్చేది కాదు. నేడు అది అస్తవ్యస్తమై కులవ్యవస్థగా స్థిరపడింది. అదియును జన్మతోనే స్వీకరిస్తున్నారు. పరిశీలించి చూస్తే అన్ని కులాలలోను బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర ప్రవృత్తులవారున్నారు. అయినా వారు తమ కులాభిమానాన్ని వీడలేకున్నారు. బోధకుడు, రక్షకుడు, పోషకుడు, శ్రామికుడు అనేవారు అన్ని కాలాలలోను, అన్ని దేశాలలోను ఉంటారు. ప్రతీవ్యక్తి నాలుగు వర్ణాలలో ఏదో ఒక దానిలోనికి వస్తాడు. అయినప్పటికి వీరిలో ఒకరు ఎక్కువగాని ఒకరు తక్కువగాని కాదు. అందరూ భాతృసమానులే నంటుది వేదం -

**అజేష్ఠాసః అకనిష్ఠాసః ఏతే సంభ్రాతరో వావృధుః ।**
**సౌభగాయ । (ఋగ్వేదం. 5-60-5)**

అందరూ కలిసి ఉన్నతికొరకు ప్రయత్నం చేయమంటుంది. అన్ని వర్ణాలవారు పరస్పరం ప్రీతితో మెలగాలంటుంది యజుర్వేదం -

**రుచం నో ధేహి బ్రాహ్మణేషు, రుచం రాజసు నస్కృధి ।**

రుచం విశ్వేషు శూద్రేషు । మయి ధేహి రుచారుచమ్ ॥
(యజుర్వేదం. 18-48)

**14.** వానప్రస్థ సంస్కారం : బ్రహ్మచర్య గృహస్థాశ్రమాలు రెండూ ప్రవృత్తి మార్గం. అవి భౌతిక ఉన్నతికై చేసే ప్రయత్నం. ఇక వానప్రస్థ సంన్యాసాశ్రమాలు రెండూ నివృత్తి మార్గం. ఆత్మోన్నతికై చేసే విశేష ప్రయత్నం. మొదటి రెండూ ఇహలోక ఉన్నతిని కలిగిస్తాయి. చివరి రెండూ పరలోక ఉన్నతిని - ముక్తిని కలిగిస్తాయి. 'పౌత్రముఖం దృష్ట్వా వనీ భవేత్' అని చెప్పినట్లు మనుమని ముఖం చూసి కలిగిన భౌతిక ఉన్నతికి సంతృప్తిచెంది ఆత్మోన్నతికై అడవులకు వెళ్ళాలి. అదే వానప్రస్థం - వనములకు ప్రస్థానం.

పూర్వం గ్రామాలచుట్టూ ఉపవనాలుండేవి. వాటిచుట్టూ పెద్ద పెద్ద అడవులుండేవి. వానప్రస్థులు అక్కడ కుటీరాలను నిర్మించుకొని వనాలలో దొరికే కందమూల ఫలాదులు తింటూ యోగాభ్యాసం చేసేవారు. లేదా వనవాసులవద్ద భిక్ష తీసుకుంటూ స్వాధ్యాయ జపధ్యాన నిరుతలై ఉండేవారు. నేడు దేశకాల పరిస్థితులలో చాలా మార్పు వచ్చింది. కనుక అంతటి కఠిన నియమాలు నేటి వారు పాటించలేరు. నేటి కాలానికి అనుగుణంగా వానప్రస్థాశ్రమాలను ఏర్పాటు చేసుకొని అట్టి వ్యవస్థీకృత ఆశ్రమాలలో గడపటం అందరికీ అనుకూలంగా ఉంటుంది. లక్ష్యం మాత్రం యోగాభ్యాసం - సాధన కావాలి.

పూర్వం వానప్రస్థులే గురుకులాలు నడిపేవారట. విద్యార్థుల నుండి ఏమీ ఆశించకుండా తమకు తెలిసిన విద్యలను బ్రహ్మచారులకు నేర్పేవారు. అందువల్ల విద్యలు ఉచితంగా లభించేవి. నేడు కూడా ఆవిధంగా చేసే అవకాశం ఉంది. అధ్యాపనసామర్థ్యం లేనివారు వ్యవస్థాపరమైన పనులు చూసుకోవచ్చు. కొన్ని సేవాకార్యక్రమాలు, ప్రజా సంక్షేమ కార్యక్రమాలు చేపట్టవచ్చు.

వానప్రస్థ సంస్కారంలో బృహత్యజ్ఞంతోబాటు స్థాలీపాకంతో విశేష హోమం ఉంటుంది. ఆ విశేషహోమ మంత్రాలతో తా నింతవరకు ఏఏ పదార్థాలనుండి, ఏఏ వ్యక్తులనుండి సుఖాలు పొందాడో వాటన్నిటిపట్ల సుహృద్భావాన్ని ప్రకటిస్తాడు. ధన్యవాదాలు తెలుపుతూ సెలవు తీసుకుంటాడు. భార్య తనవెంట రావడానికి సమ్మతిస్తే తీసుకువెళ్ళవచ్చు. లేకుంటే ఆమె

బాధ్యతను పెద్దకుమారున కప్పగించి తాను ఒంటరిగా వనాలకు వెళ్ళవచ్చు. జీవితంలో జరుగుచున్న మార్పుకు సూచకంగా, భావిజీవితానికి ప్రేరకంగా పేరు మార్చుకోదలచిన మార్చుకోవచ్చును.

**15. సంన్యాస సంస్కారం :** సంన్యాసం అంటే చక్కగా విడిచి పెట్టటం. జీవుడు ఈ లోకంతో రాగాన్ని కలిగి ఉంటాడు. ముఖ్యంగా ఈ రాగం మానవునిలో ప్రస్ఫుటంగా కనబడుతుంది. ఈ ప్రాపంచిక రాగాలను మన ఋషులు మూడు వర్గాలుగా విభజించారు. అవి - 1. విత్తేషణ, 2. దారేషణ (పుత్రేషణ), 3. లోకేషణ. విత్తేషణ అంటే ధన కనక వస్తు వాహనాది ఐశ్వర్యాలను ఇంకా యింకా పొందాలనే తపన. దారేషణ అంటే భార్య పిల్లలపైనా బంధువర్గంపైనా వ్యామోహం. వారిని వదలిపెట్టలేకపోవటం. వారి ఉన్నతినే పరమ ధర్మంగా భావించి శ్రమించటం. లోకేషణ అంటే పేరు ప్రతిష్ఠలకై ప్రాకులాడటం. వానప్రస్థాశ్రమంలో ఈ మూడు రకాల రాగాలనుండి విరక్తి పొందడానికి ప్రయత్నిస్తాడు. తపిస్తాడు. ఎప్పుడు ఈ మూటినుండి సంతృప్తి కరమైన విరక్తి కలుగుతుందో అప్పుడతడు సంన్యాసాశ్రమ స్వీకారానికి అర్హుడౌతాడు.

**లోకైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ పుత్రైషణాయాశ్చ**
**ఉత్థాయ అథ భైక్షచర్యం చరంతి ॥**
**(శతపథ బ్రాహ్మణం. 14-2-5-1)**

అని యాజ్ఞవల్క్య మహర్షి అంటారు. అయితే, అట్టి వ్యక్తి పూర్ణ విద్వాంసుడు, ధార్మికుడు, పరోపకార ప్రియుడు, పక్షపాతరహితంగా ధైర్యంగా ధర్మోపదేశం చేయగల సమర్థుడు అయివుండాలి. అట్టివారే సంన్యాసాశ్రమం స్వీకరించి పరివ్రాజకులు కావాలి. అంతటి విద్యా సామర్థ్యాలు లేనివారంతా వానప్రస్థులుగానే ఉంటూ యోగసాధనలో గడపాలి.

సంన్యాససంస్కారం పెద్దగానే ఉంటుంది. బృహద్యజ్ఞంతో బాటు విశేషహోమాలుంటాయి. కొన్ని క్రియలుంటాయి. ముఖ్యంగా "ఈషణ త్రయాలను వదిలిపెడుతున్నాను - సర్వప్రాణులకు అభయమిస్తున్నా" ననే ప్రతిజ్ఞచేయిస్తారు. త్యాగానికి గుర్తుగా కాషాయబట్టలు ధరింపజేస్తారు.

దండధారణ చేయిస్తారు. దండం ఆత్మరక్షణకే గాని యితర ప్రాణులను హింసించటానికి కాదు.

అప్పటినుండి సంన్యాసి ఇల్లు విడచి దేశసంచారం చేస్తూ వైదిక ధర్మప్రచారం చెయ్యాలి. గృహస్థుల యింటికి అతిథిగా వెళ్ళి వారి ధర్మసందేహాలను తీర్చాలి. అవైదిక పాఖండమతాలు ఎక్కడైనా కనబడితే ధైర్యంగా వాటిని ఖండించాలి. సత్యమైన వేదధర్మాన్ని వారికి వివరించి చెప్పాలి. రాజైనప్పటికీ అధర్మంగా ప్రవర్తిస్తుంటే హెచ్చరించాలి. ఏది ధర్మమో వివరించి చెప్పాలి.

**16. అంత్యేష్టి సంస్కారం :** ఇది చివరి సంస్కారం. జీవుడు శరీరాన్ని వదలిపెట్టి వెళ్ళిపోయిన తరువాత ఆ శరీరానికి చివరగా చేసే సంస్కారం అంత్యేష్టి. అంటే శవాన్ని దహనం చెయ్యడం. 'భస్మాంతగ్ం శరీరమ్' అని యజుర్వేదం (40-15) చెబుతుంది. శరీరం భస్మంగా అంతం కావాలని దీని భావం. అదికూడా వేదమంత్రపూర్వకంగా జరగాలని మను మహర్షి అంటారు.

'నిషేకాది శ్మశానాంతో మంత్రైర్ యస్యోదితో విధిః

(మనుస్మృతి. 2-16)

మొదటిదైన నిషేకం (గర్భాధానం) మొదలు శ్మశానంలో అంతమయ్యే అంత్యేష్టి వరకు అన్ని సంస్కారాలు వేదమంత్రాలతో విధిని అనుసరిస్తూ యజ్ఞాలుగా జరుపుకోవాలి.

ఈ సంస్కారంలో దహనవేదికనే అగ్నిహోత్రం. మన శరీరం పంచభూతాలతో నిర్మితమై వాటితోనే పెరిగి పెద్దదైనది. కావున మరల శరీరాన్ని పంచభూతాలలో కలిపి వెయ్యాలి. అందుకు దహనం చెయ్యటమే ఉత్తమ పద్ధతి. నదిలో ప్రవహింపజేస్తే క్రుళ్ళి వాసన వస్తుంది. జలవాయువులు కలుషితమౌతాయి. భూమిలో పాతిపెట్టినా వర్షంనీరు ఆ శవాలగుండా క్రిందకు దిగి భూగర్భజలాలు కలుషితమౌతాయి. అందుచేతనే యూరప్ దేశాలలో క్రిమేషన్ యాక్టు (1902 సం॥లో) - శవాన్ని దహనం చేసే బిల్లు పాస్ చేసారు.

అమెరికాలో అంతకు పూర్వమే 'క్రిమేషన్ అసోసియేషన్ ఆఫ్ అమెరికా' అనే పేరుతో 1876లో స్థాపించబడింది. అప్పటినుండి క్రమంగా శవదహన వేదికలు విస్తరిస్తూ వేలకొలది శవాలు దహనం చేయబడుతున్నాయి. శవాలన్నిటిని పూడ్చిపెట్టి సమాధులు కడితే కాలాంతరంలో భూమియంతా

శ్మశానవాటిక అవుతుంది గదా!

దహన వేదికపై కట్టెలను పేర్చి దానిపై శవాన్ని ఉంచి పైనుండి మరల కట్టెలను పేర్చాలి. నేతిని ఆహుతులుగా ఇచ్చుటకు అనువుగా పొడుగు కఱ్ఱలకు 5 తులముల పరిమాణము నెయ్యి పట్టు గరిటలను కట్టాలి. కర్పూరంతో అగ్నిని వెలిగించి మంటలు అందుకున్న తరువాత మంత్రాలు చదువుతూ పెద్ద గరిటలతో పుష్కలంగా నేతిని ఆహుతులుగా యిస్తూ ఉండాలి. గంధపుచెక్కలు, సుగంధ ద్రవ్యాలు ముందుగానే శవముపై పరచాలి. నెయ్యి, సుగంధ ద్రవ్యాలు వీలైనంత ఎక్కువగా వెయ్యాలి. జాగ్రత్తలు తీసుకుంటూ దహనం చేస్తే ఒక గంటలోనే శవం భస్మమైపోతుంది. పంచభూతాలలో కలిసిపోతుంది. కావుననే సంస్కృతంలో మరణాన్ని 'పంచత్వం గతః' అంటారు.

శవం దహనమైన పిదప శ్మశానమునకు వెళ్ళినవారందరు స్నానాదులు చేసి శుద్ధులు కావాలి. చనిపోయిన యింటిని కూడా శుద్ధి చేసి బృహద్యజ్ఞం చెయ్యాలి. ఇది యింటిలోని గాలి శుద్ధియగుటకు మాత్రమే. వెళ్ళిపోయిన జీవాత్మకొరకు కాదు. ఎన్ని ఎక్కువ ఆహుతులిస్తే అంతగా ఆ పరిసరవాతావరణం శుద్ధమౌతుంది. ఇంటిలోని గాలి బయటకుపోయి శుద్ధమైన మంచిగాలి ఇంటిలోనికి వస్తుంది. ఆ సమయంలో ఈశ కఠోపనిషత్తులు చదువుకొని మననం చేస్తే, ఆత్మ జ్ఞానం కలిగి విచారం దూరమౌతుంది. ఇంటిలోనివారు ఆరోగ్యంగాను శాంతంగాను ఉంటారు.

మూడవ దినమున శ్మశానానికి వెళ్ళి భస్మం ప్రోగుచేసి ఒక మట్టి పాత్రలో ఎత్తి భూమిలో లోతుగా పాతిపెట్టాలి. దహన వేదికను శుభ్రంచేసి పెడితే మరొక శవాన్ని దహనం చేయడానికి అనువుగా ఉంటుంది. దీని తదుపరి మరి చేయవలసినది ఏమీ లేదు. లోక ప్రచలితమైన దినకర్మలన్నీ అవైదికం. పూర్వ ప్రకరణంలో తెలిసికొన్నట్లు శ్రాద్ధ తర్పణాలు జీవించి ఉన్నవారికే. మరణించిన వారిని మనం ఏరకంగాను సేవించలేము. తృప్తిపరచలేము.

## భారతీయసంస్కృతి

ఈ పదహారు సంస్కారాలతో కూడినదే భారతీయసంస్కృతి. జీవుడు శరీరంలోనికి వచ్చినది మొదలు జీవుడు శరీరాన్ని వదలి వెళ్ళేంతవరకు వివిధ

వయస్సులలో 15 పర్యాయాలు సంస్కరించటం జరుగుతుంది. వీటిలో కొన్ని శారీరక ఉన్నతికి, కొన్ని బౌద్ధిక ఉన్నతికి, మరికొన్ని ఆత్మిక ఉన్నతికి ఎంతగానో తోడ్పడతాయి. మానవుని మహాత్మునిగా, చివరకు ముక్తాత్మగా తీర్చిదిద్దుతాయి. ఇంతటి ఔన్నత్యం మరే దేశ సంస్కృతిలోను లేదు. చివరి 16వ సంస్కారం జీవుడు ధరించి వదిలి వెళ్ళిన శరీరంవల్ల కూడా ఏ ప్రాణికీ కష్టం కలుగకుండుటకు దహించి పంచభూతాలలో కలిపివేస్తుంది. ఇది ఎంతటి గొప్ప ఆదర్శం !!

## ఉపసంహారము

**ప్రియ పాఠకులారా !**

ఈ **'వేద శాస్త్రాల పరిచయం'** ద్వారా మీకు మన ధర్మగ్రంథాల సంక్షిప్త పరిచయం కలిగి ఉంటుంది. మరింత వివరంగా తెలుసుకోవాలనే కూతూహలం కలిగి ఉంటుంది. అందుకు మహర్షి దయానంద సరస్వతి గారి రచన 'సత్యార్థప్రకాశం' చదవండి. వారిదే 'ఋగ్వేదాది భాష్యభూమిక' చదివితే మీకు వేదాలలో గల వివిధ విషయాల పట్ల అవగాహన కలుగుతుంది. అన్నిటినీ మించి వేదాధ్యయనంవల్ల మనకు చాలా మేలు కలుగుతుంది.

ఆది శంకరాచార్యులు చెప్పినట్లు వేదాలు సర్వవిద్యా నిలయాలు. వాటిలోని అన్ని విద్యలను మనం అందుకోలేకపోయినా ఆత్మ పరమాత్మలను గురించి, మానవునిగా చేయవలసిన కనీస కర్తవ్యాలను గురించి తెలుసుకోవడం ఎంతైనా అవసరం. ప్రతీ వ్యక్తి సామాజిక ప్రాణిగా కౌటుంబిక జీవనం ఎలా గడపాలో, సామాజిక జీవనం ఎలా గడపాలో తెలుసుకోవాలి. దేశం కొరకు, ధర్మం కొరకు, సమాజం కొరకు తను చెయ్యవలసిన కర్తవ్యాలేమిటో తెలుసుకోవాలి. వాటితోబాటు తాను భౌతికంగాను (శారీరకంగాను), సామాజికంగాను, ఆత్మికంగాను ఉన్నతి చెందుటకు ప్రయత్నించాలి. వీటన్నిటికీ కావలసిన ప్రాథమిక జ్ఞానం మనకు వేదాధ్యయనం వల్ల లభిస్తుంది. అందుచేతనే మను మహర్షి –

**వేదమేవాభ్యసేన్నిత్యం, యథాకాల మతన్ద్రితః ।**
**తం హ్యస్యాహుః పరం ధర్మం, ఉపధర్మోఽన్య ఉచ్యతే ॥**

**(మనుస్మృతి. 4-142)**

"ఓ మానవులారా ! మీరు నిత్యం వేదమునే అభ్యసించండి. ఎంత ఎక్కువ సమయం యివ్వగలిగితే అంత ఎక్కువ సమయం వేదమునే అధ్యయనం చెయ్యండి. ఈ విషయంలో బద్ధకించవద్దు. అదియే పరమ ధర్మం. మిగిలనవన్నీ ఉపధర్మము" లంటాడు.

దురదృష్టవశాత్తు మధ్యకాలంలో మనదేశాన్ని విదేశీయులు, విమతస్థులు పాలించటంవల్ల మన ప్రాచీన గురుకుల విద్యావిధానం కనుమరుగైపోయింది. దాని స్థానంలో లార్డ్ మెకాలే ప్రవేశపెట్టిన ఆంగ్లేయ విద్యావిధానం చోటుచేసుకుంది. దానితో మనం సంస్కృతభాషకు దూరమై ఆంగ్లభాషకు దగ్గరయ్యాము. భాషతోబాటు మన సంస్కృతికి, సభ్యతకు కూడా దూరమైపోయాము. వేషం మారింది, భాష మారింది, భావాలూ మారాయి. ఇట్టి స్థితిలో నేరుగా వేదాలు చదివితే అర్థం కావు. చక్కటి వ్యాఖ్యానంతోకూడిన వేదాలు చదివితేనే మనకు అర్థమౌతాయి.

యోగి అరవిందులు చెప్పినట్లు వేదభాష్యాలలో (వేద వ్యాఖ్యాన గ్రంథాలలో) మహర్షి దయానంద సరస్వతిగారి భాష్యమే అత్యున్నతంగా ఉంటుంది. వారు ప్రాచీన ఋషుల శైలి ననుసరించి భాష్యం వ్రాసారు. యజుర్వేదానికి పూర్తిగాను, ఋగ్వేదానికి సప్తమ మండలంవరకు మాత్రమే భాష్యం వ్రాయగలిగారు. ఆ పనిలో ఉండగానే స్వార్థపరుల విషప్రయోగానికి గురియై మరణించారు. అయినప్పటికీ వారి మార్గాన్ని - శైలిని అనుసరిస్తూ ఆర్యవిద్వాంసులు మిగిలిన వేదాలకు భాష్యం వ్రాసారు. వాటిని మనం అధ్యయనం చేయవచ్చు.

దినానికి ఒక మంత్రంగా స్వాధ్యాయం చేయటానికి అనువుగా కొందరు ఆర్యవిద్వాంసులు 'స్వాధ్యాయ మంజరి' - 'వేద శతకాలు' అనే పేర్లతో గ్రంథాలు వ్రాసారు. వేదాన్ని పూర్తిగా చదివే తీరిక, ఓపిక లేనివారు ఆ గ్రంథాలు చదువుకోవచ్చు. వీటిలో ఒకటి 'వైదిక వినతి' అనే పేరుతో రెండు భాగాలుగా తెలుగులో లభిస్తున్నది. మిగిలినవి ఆర్యభాష హిందీలో ఉన్నాయి. వేదానుకూల ఆధ్యాత్మిక సాహిత్యంకొరకు తెలుగులో కావాలనుకుంటే 'ఆర్యసమాజము - కూచిపూడి - 522 313 గుంటూరు జిల్లా' వారినీ, హిందీలో కావాలనుకుంటే 'విజయకుమార్ గోవిందరామ్ హాసానంద్, 4408 - నయీ సడక్, ఢిల్లీ - 110006' వారినీ సంప్రదించండి.

వైదిక సాహిత్యం చాలా విస్తృతంగా ఉంది. అది హేతుబద్ధంగాను వైజ్ఞానికంగాను ఉంటుంది. ప్రతి వ్యక్తి నిత్యం సంధ్యావందనానంతరం కొంత సమయం తప్పక స్వాధ్యాయం చెయ్యాలి. అప్పుడే సంధ్యావందనం ఫలవంతమౌతుంది. ఎందుకన - సంధ్యలో చేసే గాయత్రీ జపంలో నా బుద్ధిని వికసింపచేయుమనీ, సత్కర్మలలో ప్రేరేపించుమనీ ప్రార్థించటం జరుగుతుంది. ఆ ప్రార్థన కనుగుణంగా మనం స్వాధ్యాయం చేస్తే మన బుద్ధి వికసిస్తుంది. ధర్మాధర్మాల కర్తవ్యా కర్తవ్యాల జ్ఞానం కలుగుతుంది. అందుచేతనే ఋషులు -

'స్వాధ్యాయాన్ న ప్రమదితవ్యమ్'

'స్వాధ్యాయం చేయటంలో బద్ధకించవద్దు'

అని పలుమార్లు హెచ్చరించారు. కనుక మనం స్వాధ్యాయశీలురమై అన్ని రంగాలలోను ఉన్నతిని పొందుదము రండు.

'సర్వే భద్రాణి పశ్యంతు'

'మా కశ్చిత్ దుఃఖభాగ్భవేత్'

ఓ3మ్ స్వస్తి

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

## (సుమ్మార్థి డా।। సుబ్బారావు గారి రచనలు)

1. గాయత్రీ మహిమ 30-00
2. గాయత్రీ విజ్ఞానం (ముద్రణలో)
3. మన ఇతిహాసం 70-00
4. మన వేదశాస్త్రాల పరిచయం 70-00
5. అగ్నిహోత్రం 100శాతం వైజ్ఞానికం 60-00
6. అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ 30-00
7. అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము 30-00
8. గోమాత 40-00
9. వేదాలలో సూర్యకిరణ చికిత్స 80-00
10. వేదాలలో జలచికిత్సా విజ్ఞానం 60-00
11. పెండ్లినాటి ప్రమాణాలు 40-00
12. గర్భాధాన విజ్ఞానం 50-00
13. దౌహృదిని 40-00
14. మరణానంతరం జీవుని ప్రయాణం 40-00
15. మానవ ధర్మము 40-00
16. ఈశావాస్యమిదం సర్వమ్ 35-00
17. దేవుడు - జీవుడు - ప్రకృతి 30-00
18. వేదాలలో అశ్వనీదేవతలు 20-00
19. సంధ్యావందనం - వైజ్ఞానిక సమాలోచన 20-00
20. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ 60-00
21. వేదాల వెలుగుచూపే ఆర్యసమాజము 30-00
22. వైదిక జన్మదిన వేడుక 30-00
23. పండుగల పరమార్థం 40-00
24. వైదిక గృహప్రవేశ విధి 30-00
25. వేదాలలో వర్షేష్టి విజ్ఞానం 25-00
26. వైదిక క్రాంతి పథం 30-00
27. పురుషసూక్తము 20-00
28. వైదిక శాంతి పాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) 20-00
29. సృష్టికథ 20-00
30. సరస్వతీ సూక్తము 10-00
31. స్వతంత్ర సముపార్జనలో మహర్షి దయానందుడు 10-00
32. వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమము 10-00
33. గంగాధర శివుడు 10-00
34. ప్రణవస్తోత్రము 10-00
35. లక్ష్మీశాంతి సూక్తాలు (ముద్రణలో)
36. వేదాలలో మనోవిజ్ఞానం (ముద్రణలో)
37. వేదోపదేశాలు (ముద్రణలో)
38. వైదిక సుప్రభాతం (ముద్రణలో)
39. శివరాత్రి రహస్యము (ముద్రణలో)
40. గణపతి రహస్యము (ముద్రణలో)

**ఇతర విద్వాంసుల రచనలు**

1. మాతాపుత్రికల జ్ఞాన చర్చ 60-00
2. సత్యధర్మ విచారణ 6-00
3. స్వరాజ్య సంగ్రామములో ఆర్యసజాము (ముద్రణలో)
4. ధర్మవీర్ పం. లేఖారామ్ 5-00
5. వేదాలలో విజ్ఞానబీజాలు (ముద్రణలో)

ముద్రణలో ఉన్నవి దాతలు లభించినపుడు ముద్రింపబడును